# లోకమాత



—శ్రీ కె.టి.యల్. నరసింహాచార్యులు



# లోకమాత

## (శ్రీ శారదాదేవి చరిత్ర)


రచయిత :

సాహిత్యరత్న, విద్యావిశారద, భాషాప్రవీణ

శ్రీ కె.టి.యల్.నరసింహాచార్యులు.






ప్రచురణ :

తిరుమల తిరుపతి దేవస్థానములు,

తిరుపతి.

1992

# ముందుమాట

ఆధునిక భారతీయ మహిళా లోకంలో శారదాదేవి కొక విశిష్ట స్థానం వున్నది. వివేకానందస్వామి లాంటి జగత్ప్రసిద్ధుడైన వేదాంతిని మనకు ప్రసాదించిన ఋషిపుంగవుడు రామకృష్ణపరమహంసకు ఈ సాధ్వి సహధర్మచారిణి. లోకవ్యాప్తి పొందిన సంఘటన లేవీ శారదా దేవి జీవితంలో కనపడకపోయినా రామకృష్ణపరమహంస స్వయంగా తన ప్రియశిష్యు లిద్దరకీ ఈమె చేత మంత్రోపదేశం చేయించడాన్ని బట్టి చూస్తే పారమార్థిక ప్రతిభలో ఈమెకు వున్న సాధన ఉన్నతి స్పష్టమవుతుంది. ఆయన షోడశీపూజలో శారదాదేవిని సాక్షాత్ పరమేశ్వరీ స్వరూపిణిగ భావించి ఆరాధించాడు. అందువల్ల ఆ మహాయోగికి ఈ సతీమతల్లి చోదకశక్తి యని ప్రశంసించడంలో అతిశయోక్తి లేదు.

సహనం, సౌశీల్యం మూర్తీభవించిన శారదాదేవి శిష్యుల పట్ల చూపిన వాత్సల్యం ఉదాత్తమూ, ఆదర్శప్రాయమూ కూడా. రామకృష్ణుడి శిష్యవర్గమంతా ఈమె సంతానమే. జగన్మాత అపరావతారమైన ఈ సాధ్వికి లోకమంతా సంతానమే. అందుకే శారదాదేవి లోకమాత అయింది. ఉత్తమోత్తమ సతి, మాత, సంన్యాసిని, గురువు అయిన ఈ తల్లి జీవితం సర్వజనాదరణీయం. పూజ్యులు చిరంతనానంద స్వాముల వారన్నట్లు ఈమె జీవన విశేషాలు సముద్రాంతర్గత రత్నాలే గాని ఉత్తుంగ తరంగాలు కావు.

ఆధ్యాత్మిక ధార్మిక గ్రంథముద్రణం, తద్వారా నైతిక ప్రచారం చేస్తూ భారతీయ సంస్కృతిలోని మహోన్నత విలువల్ని జనావళి కందిస్తున్న తిరుమల తిరుపతి దేవస్థానముల వారు ఈ గ్రంథాన్ని ప్రచురించడం జరుగుతున్నది.

శ్రీ కె.టి.యల్. నరసింహాచార్యులవారిచేత లలితమైన శైలిలో రచించబడ్డ ఈ గ్రంథం పాఠకులకు ప్రయోజనకరం కాగలదని మా నమ్మకం.

యం.వి.యస్.ప్రసాద్,
కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు.

తిరుపతి,
జూన్ 20, 1991.

## విషయ సూచిక





కె.టి.యల్. నరసింహాచార్యులు:
సాహిత్యరత్న: భాషా ప్రవీణ

శ్రీమతే రామానుజాయ నమః

# లోకమాత

## 1. శిఖరారోహణము

నమః శ్రీ శారదాదేవ్యై యత్కటాక్షాభివర్ధితః,
కరోమి చరితం తస్యాః పరమానందసాగరమ్.

ప్రియమైన బిడ్డలారా!

"తల్లి సేవించిన దైవతార్చన మేల?
తండ్రి గల్గినఁ బెన్నిధాన మేల?"

అను శతకసూక్తి మీరెరిగినదే! తల్లి, తండ్రి, గురువు, దైవము --- ఈ నలుగురిని ప్రతివారును పూజింపవలెనను విషయముగూడ మీకు తెలియనిది కాదు. ముందు తల్లి--- తర్వాతనే తక్కిన ముగ్గురు---అని గూడ మన మెరుగుదుము. నవమాసములు గర్భమున మోసి, ప్రసవించిన తర్వాత మన· మలమూత్రములను కూడ ఏవగించుకొనకుండ, తన రక్తమాంసములనే మనకు ధారపోసి పెంచి, తల్లి మనలను పెద్దలుగా చేయును. కాననే తల్లిని పూజించినచో మరొకరిని పూజించ నక్కరలేదు. "న మాతుః పరదైవతం" అను అమరవాణి గూడ తల్లి కంటె వేరు గొప్పదేవత లేదని చాటుచున్నది గదా!

రెండవవాడు తండ్రి. అతడు బిడ్డలకై సంపాదించి తెచ్చిన ద్రవ్యమును తల్లి వారి యభివృద్ధికై వినియోగించును. కాననే తండ్రి యున్నచో ప్రతివానికిని పెన్నిధి యున్నట్లే. తల్లి బిడ్డల యిష్టమును మాత్రమే ఒక్కొక్కప్పుడు పాటించి వారి భవిష్యత్తుకు, సత్ప్రవర్తనకు విఘాతము కల్గింపవచ్చును. తండ్రి మాత్ర మెప్పుడును తన సంతానముయొక్క హితమును, ప్రయోజకత్వమును మాత్రమే కోరును. కాననే బిడ్డలు సదా తండ్రిని గౌరవింపవలెను.

గురువు స్థానము, వీ రిరువురి కంటె మిక్కిలి దొడ్డది సుమండీ! ఈ చర్చ కొంచెము శ్రద్ధగా విన్ననే గాని మీ కర్థము కాదు. గురువు

అను పదమునకు 'అజ్ఞానము అను అంధకారమును తొలగించువాడు' అని అర్థము. పుట్టుకతోనే యెవరును జ్ఞానము సంపాదించుకొనలేరు గదా! కాననే తల్లిదండ్రులు ప్రాచీనకాలమున తమ బిడ్డలను, గురువుల కడకు జ్ఞానార్జనకై పంపెడువారు. గురువులు పల్లెలలో నిర్మించుకొన్న పూరిగుడిసెలు, చెట్లనీడలు మాత్రమే ఆ కాలమున విద్యా సంస్థలకు నిలయములు. ఆ విద్యాసంస్థలకే గురుకులములని పేరు. గురువునకు ఆచార్యుడు, ఉపాధ్యాయుడు అని గూడ నామాంతరములు కలవు. ధర్మములను తా నాచరించి శిష్యులచే ఆచరింపజేయువాడే ఆచార్యుడు. విద్యార్థుల సమీపమున గూర్చుండి పాఠములు చదివి వారిచే చదివించు నాతడు ఉపాధ్యాయుడు. ఈ మూడు పనులు చేయువాడు కనుకనే తల్లిదండ్రులకంటె ఆతడు గొప్పవాడు.

గురువు అనగా గొప్పవాడు అని కూడ వేరొక అర్థము కలదు గదా! పూర్వపు విద్యార్థు లెంత కష్టములకైనను ఓర్చు కొనవలసినదే! గురువు శిక్షణలో పెరిగి; విజ్ఞానము, జ్ఞానము సంపాదించుకొన్న తర్వాతనే వారు బ్రహ్మచర్యము వీడి గృహస్థాశ్రమమున అడుగు పెట్టుచుండువారు. వేదము నేర్చుకొనుచు గురువువద్ద శిక్షితుడగుటయే బ్రహ్మచర్యము. ఆ గురువే వారి కా కాలమున తల్లియు తండ్రియు గూడ. అచట నున్నంతకాలము తమ పిల్లల దిగులు పెద్దల కెంత మాత్రము ఉండెడిది గాదు. విద్యార్థినీ విద్యార్థులు సానలుతీరిన జాతిరత్నములై వెలుగుచు గురుకులము వీడువారు.

ఆ కాలమున ఎంత గొప్పవాడైనను విద్యార్థి గురు శుశ్రూష విధిగా చేయవలసినదే! ఇంటి పనులతో బాటు దేవతాపూజకై అడవి కేగి పూలు, పండ్లు తెచ్చుటకూడ గురుశుశ్రూషలోని భాగమే! కాననే అప్పుడు పిల్లలకు చదువుతో పాటు కష్టముల నెదుర్కొని సహించు శక్తి, క్రమశిక్షణ, లోకజ్ఞానము మొదలగునవి అబ్బెడివి. సాక్షాత్తుగ శ్రీకృష్ణ భగవానుడు గూడ సాందీపని మహర్షికి శుశ్రూష చేసి గురుకటాక్ష పాత్రుడగుట మీ రెరిగియే యుందురు కదా!

గురు వెట్టివాడైయుండవలెనో, ఆతడు చెప్పు చదువు అనగా ఏదియో, తండ్రి యన నెవరో తెలిసికొనుటకు ప్రహ్లాదుని చరిత్రలోని యీ సూక్తి నర్థము చేసికొనుడు.



"తే.గీ. దేవదేవునిఁజింతించు దినము దినము
చక్రహస్తునిఁ బ్రకటించు చదువు చదువు
కుంభినీధవుఁ జెప్పెడి గురుఁడు గురుఁడు
తండ్రి హరిఁజేరుమనియెడి తండ్రి తండ్రి"

ఇహలోకమున కుపయోగించు శిల్పశాస్త్రాదుల యభ్యాసమే విజ్ఞానము. జ్ఞాన మనగా జన్మ మరణము లను పండ్ల చక్రమున చిక్కుకొనకుండ భగవంతుని చేరుమార్గము నన్వేషించుట. జ్ఞానవంతునికి మాత్రమే దేవుడనిన తెలియును. దేవుడనగా ఇతరుల సాయ మక్కరలేకుండ స్వయముగా ప్రకాశించువాడని అర్థము. ఈతడు సచ్చిదానంద స్వరూపుడు. సత్+చిత్+ఆనందములు=సచ్చిదానందములు; సత్=శాశ్వతమైనది; చిత్=జ్ఞానము; ఆనందము=మిక్కుటమగు సంతోషము. ఆరునెలల పసిబిడ్డ తల్లిపాలు బొజ్జనిండ త్రాగి కాలి బొటనవ్రేలు నోటవైచుకొని కేరింతలు కొట్టుటయే ఆనందమున కుదాహరణము! ఆద్యంతములు లేక జ్ఞానానందములు స్వరూపస్వభావములుగా గలవాడే భగవంతుడు. నీరును సంస్కృతమున 'నీరము', ఆంగ్లమున 'వాటర్', హిందీలో 'పానీ' అని పలుకునట్లే ఆ భగవంతుని గూడ వేర్వేరు పేర్లతో పిలుతురు. భగవంతుడు ఒక్కడే. అతనిని మనము "విష్ణు"వని, "శివు"డని అనుచుండగా ఆంగ్లేయులు "గాడ్" అనియు, మహమ్మదీయులు "అల్లా" అనియు పేర్కొనుచున్నారు. భగవంతుని స్వరూపస్వభావములు పోతనామాత్యు డెంత చక్కగా చిత్రించినాడో!

"ఉ. ఎవ్వనిచే జనించు జగమెవ్వని లోపలనుండు లీనమై
యెవ్వని యందుఁడిందుఁ బరమేశ్వరుఁ డెవ్వఁడు మూలకారణం
బెవ్వఁ డనాదిమధ్య లయుఁడెవ్వఁడు సర్వము దానయైనవాఁ
డెవ్వఁడు వాని నాత్మభవునీశ్వరు నే శరణంబు వేడెదన్."

సూర్యుడు తాను ప్రకాశించుచు ఇతర వస్తువులను గూడ నెట్లు ప్రకాశింపజేయునో భగవంతుడు గూడ నట్లే మనకు జ్ఞానానందము లొసగి సత్పురుషులను చేయుటకే ప్రయత్నించుచుండును. కాని ఆ దేవుడు మనకు కనిపించనంత మాత్రమున లేనేలేడని తలపరాదు సుమండీ! పంచదార నీటిలోవేసిన నీరు తీయనగునుకాని పంచదార అందులో కనుపించదుగదా! అంతమాత్రమున వేసిన పంచదార ఆ నీటిలో లేద నవచ్చునా! పంచదారయే గదా నీటిలో కరగి దానికి మాధుర్యము కల్గించినది! పానకములోని పంచదారవలెనే దేవుడుగూడ తల్లిలో,

తండ్రిలో, గురువులో, అతిథిలో ఉండి మనలను ప్రతిక్షణము కాపాడు
చుండును. విను డీ వేదసూక్తులు– 'మాతృదేవో భవ', 'పితృదేవో భవ',
'ఆచార్యదేవో భవ', 'అతిథిదేవో భవ'. ఈ సంస్కృత వాక్యములు
చూచి మీ రెంతమాత్రమును భయపడనక్కరలేదు. ఇతర భాషలలో
మన మెంతగా శ్రమపడినను పెద్దగా రాణింపలేము. కాని సంస్కృ
తము ఎంత కొద్దిగా నేర్చుకొన్నను, మన కెంతో లాభము కల్గును
సుమండీ! మన భారతీయ భాషలలో సంస్కృతపదములు, సూక్తులు
విరివిగా వాడబడుటయే దానికి కారణము. ముందుముందు మీ కా
విషయము బాగుగా తెలియుగలదు. కాన ఇకనైనను మీ పాఠ్య గ్రంథ
ములలో వచ్చిన సంస్కృత వాక్యములను ప్రతిపదార్థ తాత్పర్యములతో
మననము చేసికొనుట చాల మంచిది.

సరే! ఇంతవరకు మిమ్ము కొంత విసిగించితిని గదూ! ఈ పుస్త
కమున వివరింపబోవు శారదాదేవి సౌశీల్యము, పరోపకారపరాయణత,
పారమార్థికసంపద మొదలగు సద్గుణములను మీరు అర్థముచేసికొని
హృదయములపై హత్తించుకొనుటకు పై విషయములు తెలిసికొనుట
యెంతో అవసరము.

జాతి మతభేదములు పాటింపకుండ ఆమె కన్నతల్లి వలెనే దీనులకు,
అనాథులకు, రోగులకు సేవచేసి, అన్న వస్త్రములిచ్చి వారి నాదుకొను
టయే కాదు; వారి ఆత్మహితమున కవసరమగు దైవభక్తి మొదలగు
వానిని బోధించి వారికి మనశ్శాంతిని గూర్చుటగూడ ఆమె సుగుణ
ములలో ముఖ్యమైనది. తన ఆధ్యాత్మికసాధనచే హిమాలయశిఖరమంత
యెత్తున పెరుగుటచేత మాత్రమే ఆ తల్లి మన మూహింపరానన్ని
ఘనకార్యములు చేసినది.

ఈ మన తల్లి పిల్లలను కనలేదు. అసలు భర్తతో సంసారమే
చేయులేదు. అయినను కన్నతల్లికంటె గూడ నెక్కువగా ప్రజలకు సేవచే
సినది. తండ్రివలె వారికి సంపాదించి పెట్టి అన్నపూర్ణ యని బిరుదు
గొన్నది. శిష్యులకు గురువై జ్ఞానబోధ చేసినది. వైద్యునివలెనే ఆర్త
లకు రోగాదులను బోగొట్టి హితము గూర్చినది. కాన ఈమెకంటె
లోకమాత అనదగిన వారెవ్వరు?



ఈమె స్వరూపస్వభావములు పూర్తిగా ఎరుగవలెనన్న ఆమె తన
ఆధ్యాత్మికసాధనచే ఎట్టి మహోన్నత పర్వతశిఖరమున విరాజిల్లుచు
న్నదో తెలిసికొని తీరవలెను. ఆ మాత దివ్యదర్శనమును చేయుదలచిన
మీరు ఈ ప్రకరణమును బాగుగా అవగాహన చేసికొన్ననే నా యీ
శ్రమ సార్థకము కాగలదు.

## 2. వంశము

నిప్పులో వేసి కరగించినగాని బంగారము మెరుగెక్కదు. అట్లే
మహాపురుషులు కూడ కష్టములు పడిపడియే రాటుదేరి ఉజ్జ్వలముగా
ప్రకాశింతురు. బంగారము తనకై గాక యితరుల కెట్లుపయోగపడునో,
వారు కూడ నట్లే పరోపకారమునకే తమ యసువులను ధారపోయుదురు.
వారు తమ కుపకారము చేసిన వారికి మాత్రమే గాదు, అపకారము
చేసినవారికిగూడ ఉపకారము చేయుటకే పాటు పడుచుందురు.

"కం. ఉపకారికి నుపకారము
విపరీతము గాదు సేయ, వివరింపంగా
నపకారికి నుపకారము
నెప మెన్నక సేయువాఁడె నేర్పరి సుమతీ!"

అను పద్దెము మీరు మరచియుండరు గదా !

అట్టి మహాపురుషుల కోవకు చెందినదే మన ప్రస్తుత కథానాయకు
రాలు శ్రీ శారదామణీదేవి. ఈమె తన కరుణాహృదయముతో
భారతీయులకై మాత్రమేగాక యావత్ప్రపంచ ప్రజల యోగక్షేమముల
కొఱకును ఎట్లు పాటుపడి లోకమాత యను సార్థకనామము పొందెనో
ముందుముందు వివరముగా తెలిసికొందము.

కలకత్తా పడమట అరువది మైళ్ళ దూరమున బంకూరాజిల్లాలో
జయరాంబాటి యను గ్రామము మన యీ మాత జన్మస్థానము.
దామోదర్ అను జీవనది దాని కుత్తరమున ప్రవహించుచుండును. సింహ
వాహిని మున్నగు గ్రామదేవతల యుత్సవములు, దుర్గా కాళీపూజలు
నేటికిని ఆ గ్రామవాసుల కెంతో ఉత్సాహము ఆనందము కల్గించు
చుండును.

రామచంద్ర ముఖోపాధ్యాయు డా గ్రామమున పేరు మోసిన బ్రాహ్మణుడు. అతడు సౌజన్యరాశి; సుగుణ రత్నాకరుడు; దానశీలుడు; రామభక్త శిరోమణి; దానములు సంభావనలు పుచ్చుకొనుట కాత డెన్న డును ఇల్లు దాటి పోవువాడు కాడు. 1864 లో కాటకము వంగ దేశమంతటను ప్రళయతాండవము చేయసాగెను. అపుడు "అన్నమో రామచంద్రా" అని అలమటించు ప్రజల కాతడు అన్నదానము చేసి వారి ప్రాణములు నిలిపెను. పౌరోహిత్యము చేసి జందెములు వడకి యెట్టులో పొట్టనింపుకొను బీదబాపనికా ఇట్టి యౌదార్యశీలము! ఇంటి వారిని పస్తుండబెట్టి దానశీలుడని పేర్గాంచిన రంతిదేవుడను రాజర్షి కీ బ్రహ్మర్షి, యెంత మాత్రము తీసిపోడు సుమండీ!

శ్యామసుందరీదేవి సుగుణములన్నిటిలోను అతని కెంత మాత్ర మును తీసిపోని సతీశిరోమణి. సదా సంసారమునకై ఒడలువంచి పనిచేయు నీ సహధర్మచారిణి సీతామాతవలెనే ఉత్తమాదర్శముల నుపా సించుచుండెడిది. ఆమె మాయమర్మము లెరుగని సత్యకాలపు స్త్రీ. కాననే యెల్లవారికిని తన ప్రేమానురాగములను పంచిపెట్టుచుండెడిది. పదిమంది కన్నము పెట్టుట, పరులకై కష్టించుట యనిన ఆమెకు పరమానందము. పరోపకారమందు ఒకరిని మించినట్లుగా మరొకరిని- ఈ దంపతులను సృష్టించి-విధాత లోకమున కెంతో మేలు చేకూర్చి నాడు గదా! ఇట్టివారినే భర్తృహరి బహుశః-

"తమకార్యంబు పరిత్యజించియుఁ బరార్థప్రాపకుల్ సజ్జనుల్"

-అని ప్రస్తుతించి యుండును.

పాతివ్రత్యమున సీతారమణిని బోలిన యట్టి దీనజనరక్షామణికిని, శ్రీరామచంద్ర ముఖోపాధ్యాయునకును, మన భాగ్యరాశి పండగా బుట్టిన పుత్రికామణియే మన యీ శారదామణీదేవి. ఆ దంపతుల కీమె 1853 డిసెంబరు 23 వ తేదీన జన్మించెను.

# 3. బాల్యము

ప్రకృతి సౌందర్యమునకు నిలయము, పూర్వాచారములకు పట్టు గొమ్మ యనదగు ఆ పల్లెటూరులో మన మాతృదేవి ఎట్టి శిక్షణను విద్యాబుద్ధులను నేర్చెనో మనము ఆమె వంశమును వాతావరణమును



బట్టి యూహించవచ్చును. బాల్యమునుండి శారద ఇంటిపనులతో పాటు వంటపనులలో గూడ తల్లికి తోడుగా నుండెడిది. ఆమె వంట చేయ వలసి వచ్చినపుడు తండ్రి పెద్ద యన్నపుగూనను పొయ్యిమీదనుండి క్రిందకు దింపుటకు సాయపడుచుండెడివాడు. ఒక్కొక్కప్పుడు ఆమె కుత్తుకబంటి నీటిలో దిగి, పశువులకై గడ్డి కోయుచుండెడిది. తమ పొలములో పనిచేయువారికై అన్నమును గూడ తీసికొని పోవున దా తల్లి.

ఉత్తమాదర్శములలో పుట్టిపెరిగిన ఆమెకు అల్లరి చిల్లరి యాట లపై మనసు పోయెడిదికాదు. ఆమె కల్లకపటము లెరుగదు. ఆటలలో గూడ ఇతరులతో పోట్లాడదు. ఇతరులు కలహించుచుండగా వానిని తీర్చుటకే ప్రయత్నించుచుండును. ఆమెకు చిన్ననాటి చెలికత్తె అఘోర మణి. బొమ్మలతో ఆడుకొను వయస్సునుండి గూడ ఆమెకు కాళీపూజ మిగుల ఇష్టము. జగద్ధాత్రి యను దేవిని పూజించుచు ఆమె ఐదారేండ్ల పసితనమునుండియే నిశ్చలధ్యానమందు నిమగ్నయై ఒడలుమరచిపోవు చుండెడిది.

పసిబాలిక యేమి! పరమేశ్వరీ ధ్యాననిమగ్నత యేమి! బిడ్డలారా! చూచితిరా! ఆమెదైవభక్తి! ఇది ప్రహ్లాదుని తలపునకు తెచ్చుట లేదా!

"మ. పానీయంబులు ద్రావుచున్ గుడుచుచున్ భాషించుచున్ హాసలీ
లా నిద్రాదులు సేయుచున్ దిరుగుచున్ లక్షించుచున్ సంతత
శ్రీనారాయణ పాదపద్మయుగళీ చింతామృతాస్వాద సం
ధానుండై మఱచెన్ సురారిసుతుఁ డే తద్విశ్వమున్ భూవరా!"

మీ కింతవరకు రానిచో ఈ పద్యము కంఠస్థము చేసికొనుడు.

తల్లీ శారదా! ధ్యానము నీకు వెన్నతో బెట్టిన విద్యవలె క్రీడావస్తు వైనది. కాననే నీవు శ్రీ రామకృష్ణపరమహంసకు సహధర్మచారిణివి కాగలిగిన మహోన్నత పదవి నందుకొంటి వమ్మా! విశ్వమానవప్రేమ, సర్వభూతప్రేమ నీకు సహజకవచకుండలములు గదా!

ఏ మంచి గుణములైనను నేర్చుకొనుటకు బాల్యమే అనువయి నది. మామిడిచెట్టుకు అంటుకట్టుటకు లేతకొమ్మ మాత్రమే గదా

ఉపయోగపడునది! దైవభక్తి గూడ బాల్యముననే నేర్చుకొన దగినదని ప్రహ్లాదునితో బాటు ఈ మాత గూడ మనకు చాటుటలేదా?

## 4. విద్యాభ్యాసము

మన మాత తన తమ్ముల సంరక్షణలో చాలకాలము గడపు చుండెడిది. అపుడపుడు ఆమె వారితో గలసి ఆ యూరిబడికి పోవును. కాని ఆ కాలమున స్త్రీకి విద్య అవసరమని గుర్తించినవా రెందరు? బాలశారదకు విద్యపై ఆసక్తి యున్నను అందుకై పెద్దలు శ్రద్ధ పూనలేదు. కాలక్రమమున ఆమెయే బెంగాలీని స్వయంకృషిచే చదువ నేర్చెను. ఆమె కదియే మాతృభాష. కాని చక్కగా చదువుట వివాహమైన తర్వాతనే ఆమె యభ్యసించెను. తన భర్తయగు శ్రీరామ కృష్ణునకు అన్నకుమార్తె లక్ష్మితోగలసి ఈమె వంగీయ ప్రథమబోధిని కొంత చదివెను. హృదయుడను పేరుగల రామకృష్ణుని సహచరు డామె చదువును కొంత యడ్డగించినను ఆమె మానలేదు. ఆమెకూడ ఒక యణాపెట్టి ఆ పుస్తకమును కొనెను. బడిలో తాను నేర్చుకొన్న పాఠ మును లక్ష్మి యింటికి వచ్చి శారదకు నేర్పెడెది. కాని శ్రీరామకృ ష్ణుని యింటికి-దక్షిణేశ్వరమునకు- వెళ్ళిన తర్వాతమాత్రమే యామెకు చదువు సరిగా సాగినది. భర్త చికిత్స నిమిత్తము గ్రామాంతర మేగి నప్పు డామె ఒంటరిగా నుండెను. అపుడొక బాలిక గంగాస్నానమునకు, దేవీదర్శనమునకు ప్రతిదినము వచ్చుచుండెడిది. ఆమె వద్ద శారదాదేవి శ్రద్ధగా పాఠము నేర్చుకొనుచు ప్రతి ఫలముగా, కూరగాయలు తినుబం డారములు ఆ బాలిక కిచ్చుచుండెడిది.

ఈ విధముగా నామె చదువుట చక్కగా నేర్చెను. కాని వ్రాత నెన్నడును బాగుగా నభ్యసింపలేదు. కాలాంతరమున ఒక శిష్యుడు తన కేదైన వ్రాసియిమ్మని కోరగా తన పేరు వ్రాయబూనెను. విశ్వ ప్రయత్నము చేసిగూడ చదువ దగిన దేమియు వ్రాయజాలక తన యా ప్రయత్నమును విరమించివైచెను.

కాని పైజెప్పిన వృత్తాంతముచే ఆమెకు విద్యాభ్యాసమున కనువగు పరిస్థితులు ఆమె స్వగ్రామమున లేవని తలపకుడు. చదువుట, వ్రాయుట



మాత్రమే విద్య అనుకొనుట పొరపాటు సుమండీ! అక్షరములు నేర్వని వారుకూడ సద్విద్యను సంపాదించు విధానములను-దానిద్వారా జ్ఞానము, విజ్ఞానము నేర్చుకొను పద్ధతులను-అందరకు అలవరచుటయే భారతీయ నాగరకతకు పరమార్థము. చదువురాని వారికిగూడ మంచిగుణములు నేర్పుటయేగదా నాగరకత. ధర్మమును వదలని కుటుంబ జీవనము, స్వార్థత్యాగము, ప్రజాసేవాసక్తి-వీనిని బోధించు పెద్దల శిక్షణ, నోములు, వ్రతములు, దేవాలయోత్సవములు, పురాణకాలక్షేపములు, హరికథలు, భజనలు మొదలగునవి, నిరక్షరాస్యుల హృదయములందు గూడ నిజ మైన భారతీయ నాగరకతయొక్క బీజములు నాటునుగదా! చదువు వలని ముఖ్యప్రయోజన మిదియే సుమండీ!

భారతీయుల ఆదర్శములలో మిక్కిలి ముఖ్యము లైనవి త్యాగము, సేవ. వీనిని అందరకు చాటునదే మన సంస్కృతి. పరుల కుపకారము చేయుటయే సంస్కృతి. ఆదర్శమనగా అద్దము. అద్దమువలె ఇతరుల కుపయోగపడు నిర్మలమైన హృదయమునుండి వెలువడిన సుగుణములను గూడ ఆదర్శ మందురు. ఇతరుల సుఖమునకై తన సుఖమును, ధనమును, వినియోగించుటయే త్యాగము. అద్దములో ప్రతిబింబమును చూచి మన మొగమును చక్కదిద్దుకొనునట్లే మహాపురుషుల గుణములు అనునట్టి అద్దములో చూచి మనము గుణములు చక్కదిద్దుకొన వలెను. అపుడే మనము వారిని ఆదర్శముగా గ్రహించినా మనుట పొసగును.

వేయేల నాటి పల్లెటూరి వాతావరణము మన శారదను భారతీయ విజ్ఞానమున సుశిక్షితురాలిని చేయబట్టియే ఆమె భవిష్యత్తులో లోకమాత కాదగిన సుగుణములను ఆధ్యాత్మిక సంపదను సంపాదించుకొనగల్గినది. బాల్యమున తాను వీథినాటకములను చూచుటచే తన హృదయ పట ముపై ముద్రితములైన పద్యములను, సూక్తులను, పాటలను, ఆమె తన శిష్యులకు బోధనసమయములో సమయస్ఫూర్తితో ఉదాహరించుచుండెడిది. ఆమె పరిజ్ఞానము, ధారణాశక్తి, గనిన శిష్య లెంతో ఆశ్చర్యపడుచుండు వారు. ఏ విషయమునైనను ఒకమారు విని, లేక చదివి, మనసునకు హత్తించుకొనుటయే ధారణ. శీలవంతులు దైవభక్తులు అగు తన తల్లి దండ్రులనుండి ఏ పాఠశాలయందును నేర్చుకొనజాలనంతటి విద్య నామె

గ్రహించెనని చెప్పుటలో పైనజూపిన యుదాహరణములనుబట్టి సందేహము లేదు గదా! ముమ్మందు ఈమె చరిత్రలో ఇట్టి యుదాహరణలు కోకొల్లలు.

కాని పైజెప్పిన యన్నింటికంటెను, జ్ఞానమూర్తి శ్రీరామకృష్ణుని సాహచర్య మను మహాభాగ్యము- పసితనముననే ఆతని సహధర్మచారిణి కాగలిగిన సౌభాగ్యము-మన మాతృదేవికి లభింపగా సమస్త విద్యల సారమును ఆమెకు కరతలామలక మగుట అబ్బురమా!

## 5. వివాహము

బ్రహ్మచర్య గృహస్థ వానప్రస్థ సంన్యాసాశ్రమములలో మన పూర్వులు గృహస్థాశ్రమమునే మిక్కిలి ముఖ్యమైనదిగను, మిగిలిన మూడాశ్రమము లను గూడ పోషించునదిగను వర్ణించినారు. గృహస్థులకు మాత్రమే తమపై ఆధారపడిన వారికిగాని అతిథి అభ్యాగతులకుగాని పట్టెడన్నము పెట్టునవకాశము గలదు. కాననే గృహస్థుడు తాను పస్తుండియైనను అతిథులను గౌరవింపవలెను.'అతిథిదేవో భవ' అని లోగడ మనము నేర్చుకొన్న వేదసూక్తి ఇచటనే సార్థకమగుచున్నది. దేవుడే అతిథి రూపమున వచ్చి గృహస్థులను పరీక్షించుననుటకు నిదర్శనములు మీరు ముమ్ముం దీ పొత్తముననే చూడగలరు.

భారతీయులైన స్త్రీ పురుషులు యజ్ఞకార్యములను వేదమంత్రము లతో ఆచరించుటకే వివాహము ఉద్దేశింపబడినది. పత్నియనగా పతితో కలసి యజ్ఞకార్యములను నిర్వహించునది అని అర్థము. ఈమెనే అర్ధాంగి సహధర్మచారిణి అని గూడ అందురు. భర్త శరీరములో సగపాలు పంచుకొనదగినది అర్ధాంగి. ధర్మ కార్యములను భర్తతో కలసి యాచరించునది సహధర్మచారిణి. గృహమనగా ఇల్లు కాదు; గృహ యజ మానియగు పురుషు డంతకంటె గాదు; గృహిణియే గృహము. ఇల్లాలే ఇల్లని పెద్ద లనిరి గదా !

బాల్యవివాహములను ప్రస్తుత పరిస్థితులనుబట్టి మన మేవగించుకొ నుట సహజమే. కాని పూర్వులు సృష్టించిన ఈ బాల్య వివాహముల యాదర్శము కొంతమందికి ఆశ్చర్యకరమగు ఫలితములను గూడ ఇచ్చును. శ్రీ శారదా శ్రీరామకృష్ణుల వివాహముకంటె మించిన నిదర్శనము దీని కేమి యుండగలదు !



రామకృష్ణుని అసలు పేరు గదాధరుడు. తండ్రి క్షుది రామచట్టోపా ధ్యాయుడు. తల్లిపేరు చంద్రమణీదేవి. ఈమెను చంద్రాదేవి అని గూడ పిలుచువారు. ఈ దంపతులు కూడ సుగుణమణులు- మహాభక్తులు. జయరాంబాటికి ఎనిమిది మైళ్ళ దూరముననున్న కామారిపుష్కరము (కామార్ పుకుర్) అను గ్రామమున ఈతడు ఆ తలిదండ్రులకు మూడవ కుమారుడుగా 1836లో అవతరించెను.

గదాధరుడు తల్లికడుపున నుండియే హరిభక్తిని పుణికి పుచ్చుకొన్న పుత్రరత్నము. భక్తశిరోమణి యగు నీయన గూడ బాల్యమునుండి శార దాదేవి వలెనే ప్రహ్లాదునే దైవభక్తిలో తలపించుచుండెను. ఆతని వలెనే ఈ బాలభక్తుడు గూడ—

"అడుగడ్గునను మాధవానుచింతనసుధా
మాధుర్యమున మేను మఱచువాడు,
అంభోజగర్భాదు లభ్యసింపఁగలేని
హరిభక్తి పుంభావ మైనవాఁడు"

—కాననే ఆతని హృదయమును ఐహికసుఖములు ఏ మాత్రము ఆకర్షింపలేకపోయెను. పొట్టకూటి చదువులతో ఆతడు జోక్యము పెట్టుకొ నలేదు. బ్రహ్మజ్ఞానమే తన తరణమునకు, ఇతరులను తరింపజేయుటకు గూడ సాధనమని ఆతడు నిర్ణయించుకొనెను. అందుచే పరమేశ్వర సాక్షాత్కారమునకే ఆతడు పరితపింప సాగెను.

"తే.గీ. ఇను మయస్కాంత సన్నిధి నెట్లు భ్రాంత
మగు హృషీకేశు సన్నిధి నా విధమునఁ
గఱగుచున్నది దైవయోగమున చేసి
బ్రాహ్మణోత్తము చిత్తంబు భ్రాంతమగుచు."

—అని భాగవతమున పోతనార్యుడు ప్రహ్లాదుని చిత్తవృత్తిని పేర్కొ న్నట్లు, మన గదాధరుని హృదయముగూడ క్రమముగా పరిపక్వమై హరికీర్తనమునునట్టి అయస్కాంతముచే బలవత్తరముగా ఆకర్షింపబడసా గెను. చిత్తము ఆ రామునిపై ఆ కృష్ణునిపై పూర్తిగా హత్తుకొన్న తర్వాతనే ఆతడు రామకృష్ణుడయ్యెను.

బాలబాలికలారా! మీరు గూడ అవకాశము కల్గించుకొని భాగవ తములోని గజేంద్రుడు, ధ్రువుడు, ప్రహ్లాదుడు, అంబరీషుడు మొదలగు

భక్తుల కథలను చదివి అర్థము చేసుకొని నరజన్మ మెత్తినందుకు మీ జీవితమును దైవభక్తితో ధన్యము జేసికొనుడు. అందుకే సుమండీ నా యీ రచనా ప్రయత్నము.

శ్రీరామకృష్ణుడు కడు బీదకుటుంబమున జన్మించెను. అందుచే అతడు 1836న కలకత్తాలో దక్షిణేశ్వరమున కాళికాదేవి ఆలయమున అర్చకుడుగా కుదిరెను. ఈ సంఘటనచే అతని పని "బూరెల గంపలో పడిన" ట్లయ్యెను. కాని ఆలయమున సక్రమముగా దేవీ పూజాదులు నెరవేర్చుటగూడ ఆతనికి కష్టసాధ్యమయ్యెను. తన శరీరమును గూడ మరచి అతడు పరమేశ్వర సాక్షాత్కారమునకే పరితపింపసాగెను. ఆలయ నిర్వాహకు డా సంగతి గ్రహించి ఆత్మసాధనకు వలయు సమస్త సౌకర్యములు ఆతనికి సమకూర్చెను. శ్రీ రామకృష్ణుడు అఖండ భగవత్పరితాపముతో, అపూర్వాశయముతో ధ్యానాది సాధనలలో నిమగ్నుడాయెను. నిద్రాహారములను గూడ ఆతడు పాటింపలేదు.

అర్థికచింతయేగాని పారమార్థికచింత యననేమో యెరుగని లోకులు ఆయనకు మతిపోయినదని చెప్పకొనసాగిరి. ఆ వాదులకు భయపడి తల్లియు, సోదరుడు రామేశ్వరుడును ఆతనిని 1858లో దక్షిణేశ్వరము నుండి స్వగ్రామమునకు పిలిపించుకొనిరి. తల్లి యాతని వైరాగ్యముచూచి మిగుల విచారపడెను. ఆతనికి దయ్యము సోకినదని కొందరు పలుకసాగిరి. ఆమె భూతవైద్యము చేయించెను. కాని లాభము కలుగలేదు. పెండ్లిచేసినచో ఆతని మనస్సు సంసారముపై లగ్నమయి కుదుటబడవచ్చునని తలచి వారు వధువును వెదుక నారంభించిరి.

తగిన ధన మీయనిదే ఆ కాలమున వధువు లభించుట కష్టము. దీనినే కన్యాశుల్కము అనువారు. ఆ శక్తి తమకు లేనందున వారు చాల విచారించిరి. ఎట్లో రామకృష్ణున కీ విషయము తెలిసినది. జయరాంబాటిలో రామచంద్ర ముఖోపాధ్యాయుని కన్య తనకై నిర్దిష్టమైయున్నదని ఆతడు పలికెను. వెంటనే రామేశ్వరు డచటకు కబురుపంపెను. ఆ పిల్ల అయిదేండ్లుమాత్రమేగల బాలిక అని తెలిసెను. అప్పటికి రామకృష్ణున కిరువదిమూడు సంవత్సరములు. ఈడు చాలదేమో అని సందేహించికూడ మరొక సంబంధము మంచిది దొరకనందున తల్లి దానికే అంగీకరించెను. శ్రీశారదా శ్రీరామకృష్ణులకు అతి సామాన్యముగా 1859లో జయరాంబాటిలో వివాహము జరిగెను.



చంద్రాదేవి నగలను అరువు తెచ్చి తాత్కాలికముగా కన్యకు పెట్టెను. పెండ్లి అయిన తర్వాత బాలిక నిద్రపోవుచుండగా రామకృష్ణుడు నెమ్మదిగా వానిని తీసి పంపివైచెను. నిద్రలేచి యామె తన నగలు పోయినవని కండ్ల నీరుపెట్టుకొనెనట!

ఆటలలో మైమరచియుండు పసితనముననే ఆమె తన హృదయము పతి కర్పించెను. వధూవరులు ఒకరిండ్లకొకరు ఆనాటి ఆచారమునుబట్టి పండుగలకు పబ్బములకు వచ్చిపోవుచుండువారు. పరస్పర సంభాషణలచే వారి ప్రేమాంకురము దినదినాభివృద్ధి నందసాగెను. రామకృష్ణు డట అఖండ సాధనలతో దివ్యానుభవము లందుచుండగా స్వగ్రామమున ఈమె ఆయనకు తగిన అర్ధాంగిగా ఆత్మవికాసము పొందుచుండెను.

## 6. అత్తవారింటికి ప్రయాణము

ఈ రీతిగ చాల సంవత్సరములు గడచెను. కాని పెండ్లియైన తర్వాతగూడ రామకృష్ణుని మనసు సంసారజీవితమువైపు మరలలేదు. శారదాదేవి పుట్టినింటనే కాలము గడుపసాగెను. పదునెనిమిదేండ్లు గలదైనందున ఆమె సర్వావయవ సౌష్ఠవముతో పదునారవవన్నె బంగారమువలె మిలమిల మెరసి పోవుచుండెను.

నాల్గుసంవత్సరములకు పూర్వ మామె రామకృష్ణుని ఇంట మూడు నెలలు గడపెను. ఆ సమయమున ఆమె పతియొక్క నిర్మల ప్రేమానురాగములను చూరగొనెను. పతికి దైవభక్తితోబాటు బంధుప్రేమ గూడ అపారమని యామె ఆతని ప్రవర్తనచే తెలిసికొనెను. సతీశీలము నుగ్గుబాలతో నేర్చుకొనిన యా బాలికకు లోకమంతయు పతిభక్తిమయముగనే కనుపింపసాగెను. పతిసన్నిధి నెప్పుడు చేరుదునా యని యామె యువ్విళ్ళూర సాగెను.

ఊరిలోని అమ్మలక్కలు తలకొకరీతిగా 'శారదా మగడు దిగంబరుడై పిచ్చివాడై 'హరి' 'హరీ' యని పల్కుచు వీథులవెంట తిరుగుచున్నా' డని, 'ఈ పుత్తడిబొమ్మనాతని కెట్లు అంటగట్టిరోగదా' యని, ప్రలాపింపసాగిరి. ఈ మాటల నామె మొదట నెంతమాత్రము లెక్కచేయులేదు. కాని వినివిని ఆ మాటలు సత్యముకానిచో భర్త

తనను తన ఇంటికేల తీసికొని పోడని సంశయింప సాగెను. దక్షిణే శ్వరమునకు పోయి అతని స్థితిగతులు తెలిసికొన్న మంచిదని యామె తలచెను.

అందుకు తగిన అవకాశముకూడ ఆమెకు త్వరలోనే లభించెను. ఆమె దూరపు చుట్టములు కొందరు గంగాస్నానమునకై కలకత్తా పోవు చుండిరి. కుమార్తె యుద్దేశ్యము తెలిసికొని రామచంద్రు డామెను వెంటనిడికొని ఆ యాత్రికులతో కలసి ప్రయాణమయ్యెను. కాని సుకుమారి యగుటచే శారద నడువలేకపోయెను. దారిలో ఆమెను విషజ్వరము పట్టుకొనెను. ఎట్లో ఒక పల్లకిపై ఆమెను దక్షిణేశ్వరము చేర్చిరి.

వెంటనే ఆమె తమ భర్త ఇంటికి వెళ్ళెను. పరమహంస తన భార్య నెంతో గౌరవించెను. ఆతురతతో జ్వరమునకు తగు చికిత్స వెంటనే చేయించెను. జ్వరము తగ్గిన తర్వాత ఆమె తన యత్తగారున్న నవాబత్ గదిలో నివసించుటకు వెళ్ళెను. దేవాలయ నిర్వాహకులు రామ కృష్ణున కిచ్చినదే యా గది. అది సరిగా బొమ్మరిల్లంత మాత్రమే యుండెను.

భర్త ప్రేమను చూరగొన్నందుకు ఆమె అమితముగా ఆనందిం చెను. "పంది బురద మెచ్చు పన్నీరు మెచ్చునా" అన్నట్లు లోకులు తన భర్త విషయమున ఆడినమాటలు అసూయాగ్రస్తములని ఆమెకు దృఢపడెను. అచటనే యుండి తన అత్తగారిని భర్తను సేవించుట తన కర్తవ్యమని ఆమె నిర్ణయించుకొనెను.

## 7. అగ్నిపరీక్ష

గానుగలోవేసి ఆడించినకొలది నువ్వులనుండి నూనె వెలువడును. కఠిన పరీక్షలకు లోనయినపుడు మాత్రమే మహాత్ముల సౌశీల్యము లోక మునకు ప్రత్యక్షమగును. ఈ సందర్భమున—

"ఉ. అతనికి వార్ధి కుల్య యగు, నగ్ని జలం బగు, మేరుశైల మం
చిత శిల లీల నుండు, మద సింహము జింక తెఱంగు దాల్చుఁ, గో
పిత ఫణి పూలదండ యగు, భీష్మ విషంబు సుధారసంబగున్,
క్షితిజనసమ్మతంబగు సుశీల మదెవ్వనియందు శోభిలున్."

అను భర్తృహరి సూక్తి మిారు కంఠస్థము చేయుదగినది.



శీలవంతునకు సముద్రము పిల్లకాలువ. అతడు తాకినచో అగ్నికూడ చల్లగనే యుండును. మేరుపర్వత మాతనికి కాలిబంతితో సమానము. సింహము నాతడు జింకవలె మచ్చికచేసుకొనగలడు. పడగవిప్పిన సర్పమును పూలమాలవలె నాతడు ధరించెను. విషమునుగూడ నాతడమృతమువలె అరగింపగలడు. శీలవంతున కసాధ్యమేది?

ఐహిక సుఖములం దాసక్తివదలిన మన రామకృష్ణుడు కాళికాపూజ యందు, ఆమె ధ్యానమందు సదా కాలము గడపుచుండెను. అతడు బాల్యమునుండి ప్రతి స్త్రీని తల్లిగా ప్రేమించుట, గౌరవించుట మాత్రమే నేర్చుకొనెను. నవయౌవనముతో తన మనస్సునెంతో కలవరపెట్టుచున్న భార్యను చూచి కూడ అతనిమనస్సు ఆమె శరీరసౌందర్యము ననుభవిం పగోరలేదు. సహధర్మచారిణిని తన దివ్యాశయములతో సుశిక్షితురాలిని చేయుటయే అతడు తన లక్ష్యముగా, పవిత్ర కర్తవ్యముగా భావించెను. తన యింద్రియ నిగ్రహమును పరీక్షించుకొనుటకై ఆమె తన వద్ద ఏకాంతమున నుండుట అవసరమని అతడు భావించెను.

పరమహంసకు జ్ఞానబోధ చేసినవాడు తోతాపురి యను గురువు. ఆయన రామకృష్ణుడు పెండ్లియాడెనని విని ఇట్లు పలికెను: 'బ్రహ్మ జ్ఞానికి భార్యవలన కొంచెముగూడ ప్రమాదముండదు.' సామాన్యముగా ఆధ్యాత్మిక సాధకులు స్త్రీలు సమీపమున ఉన్నచో తమమనస్సు చెద రిపోవునని తలచి తమ భార్యలకు గూడ దూరముననే యుందురు. కాని ఈతడట్లుగాక భార్యచే ఉపచారములు చేయించుకొనుచు గూడ జితేంద్రియ సాధనకై కృషి చేయసాగెను.

చంద్రునకైన మచ్చగలదుగాని శారదా రామకృష్ణుల అనురాగమున కామము అను కళంకము మాత్రము అంటలేదు. ఒకనా డా తల్లి ఆయనప్రక్కనే శయనించియుండెను. రామకృష్ణు డిట్లు తలచెను-'మ నసా! మానవులు స్త్రీ సుఖమునకే గదా సదా తాపత్రయపడుచుందురు. కాని అట్టివారు భగవంతుని చేరలేరు సుమా! చెప్పు, నీకీ స్త్రీ శరీరము కావలెనా, భగవంతుడు కావలెనా?' తరువాత మాతృదేవి శరీరమును తాకబోయెను. కాని అతని శరీరము మనస్సుకూడ విద్యుత్తంత్రిని తాకినట్లయి ఆమెనుండి భగవద్ధ్యానముపైపునకే మరలిపోయెను. అతడా రాత్రియంతయు సమాధిలోనే నిమగ్నుడైయుండెను. ఇంతకంటె వారి దాంపత్యజీవితమున కగ్నిపరీక్ష యేమి కావలయును?

"ఉ. మానవతీ కటాక్ష శర మార్గణముల్ వికలింపజాల వె
వ్వాని మనంబు, క్రోధమను వహ్నిఁ గలంపదు, లోభపాశ సం
తానము మోహ్య జేయదు వితానములు న్నైత సేయవోప వె
వ్వాని వశంబుగన్ మెలగు, వాఁడె జయించు జగంబులన్నియున్ న్నై."

—భర్తృహరి యీ సూక్తికి లక్ష్యభూతుడయిన మన పరమహంస త్రిలోక విజేతకాగలుగుటకే పుట్టుకే ప్రారంభము సుడీ! కామినీ కాంచనములకు లొంగనివాడే గదా త్రైలోక్యవిజయము గాంచును. ఈయన మహోన్నత భావసంపదను విశ్వమందు చాటిన ధీరుడు వివేకానందుడు. "అమ్మను బ్రొక్క నేల కాలు కడుగనేల"యని తలచి పెండ్లియే వలదని అఖండ బ్రహ్మచర్య మవలంబించిన బ్రహ్మజ్ఞాని.

శారదాదేవి ఒకనాడు పతి పాదముల నొత్తుచు పరమహంసను 'నన్ను గూర్చి మీరేమని తలచెదరు?' అని చిరునవ్వు మొగమున చిందగా అడిగెను. 'ఆలయమున ఏ తల్లి దర్శనమిచ్చుచున్నదో, నా మాత రూపమున నహబత్తులో ఏ తల్లి నివసించుచున్నదో, ఆ తల్లియే యిపుడు పాదము లొత్తుచున్నది-లోకమాతవే నీవు' అని రామకృష్ణు డామెకు సమాధానమిచ్చెను.

సంసార సుఖమే యెరుగని ఆ దంపతులకు బిడ్డలెట్లు కలుగుదురు! బిడ్డలు లేని తల్లి గొడ్రాలని కదా మన మనుకొనుట. స్త్రీని 'అమ్మ' అను పదముతో కంటె మరి దేనితో గౌరవింపగలము. సంతానము కొరకే వివాహమని మన పెద్దలు పల్కుదురుగదా! మరి బిడ్డలను కనని శారదాదేవిని 'అమ్మా'యని పల్కదగునా?

ఆమె తల్లిగారు ఒక్కొక్కప్పుడు 'అయ్యో, మన శారదను పిచ్చి వానికిచ్చి పెండ్లిచేసినాము గదా, అమ్మా యని తన బిడ్డలచే పిలిపించు కొను భాగ్యము నా తల్లికి లేదుగాదోలు' అని అనుకొనుచుండెడిది. రామకృష్ణు డామె మాటలు విని ఒకసారి ఇట్లనెను. 'అత్తా, మీరు దిగులు పడకండి. 'అమ్మా' 'అమ్మా' యని రాత్రింబవళ్ళు వేధించు నంత మంది బిడ్డలు మీ బిడ్డకు లభింపగలరు.' ఆ మాటకంటె ఆధ్యాత్మిక పుత్రపౌత్ర సంపదలు బడసినవా రెవరైన గలరేమో ఈ చరిత్ర చదివిన తర్వాత మీరే చెప్పండి.



తన భర్త నిర్బంధముచే ఆమె బ్రహ్మచర్య జీవితమవలంబింపలేదు. స్వబుద్ధితోనే అతని ఆదర్శములతో ఏకీభవించెను. ఆమె తలచినచో ఏ క్షణమందయినను భర్తదీక్షను భగ్నముచేయగలిగియుండెడిది. ఒకపరి రామకృష్ణు డామెను 'నన్ను మాయలోనికి లాగుట నీకు ఇష్టమా' అని అడిగెను. అందు కామె 'ఏల! పారమార్థిక మార్గమున మీకు సాయపడుటయే నా లక్ష్యము. అందుకే నేను మీవద్దకు వచ్చితిని. మీ కోరికకు వ్యతిరేకముగా సంసారము చేయుటకు రాలేదు' అని పలికెను.

పరమహంసయొక్క జీవితము అను మహోద్యమములో మాతృదేవిది ఎంతటి ప్రధానపాత్రయో లోకమింకను గుర్తింపలేదు. నిర్మల మనస్సుతో స్వార్థము వదలి అడుగడుగున ఆమె అతని ననుసరించుట వల్లనే అతడు తన దివ్యాదర్శమున అఖండ విజయము నందగలిగెను. ఆత్మ సాధనలో ఆమె తనకు చేసిన సాయమెంతటిదో ప్రథమమున పరమహంసయే తెలిసికొనగలిగెను. ఆత్మస్వరూపమును చక్కగా గుర్తించినవాడే పరమహంస. గొప్ప ఆత్మగలవాడని పరమహంస యను పదమున కర్థము. అతని దివ్యసాధనల మహాఫలము మన తల్లికి అంతకుముందే-వివాహకాలమునుండియే-పుష్కలముగా సంక్రమింపనారంభించెను.

## 8. దివ్య దాంపత్యము

సంసారసుఖమును కోరకుండ భార్యాభర్తలు పరస్పరమును దైవముగా భావించి పూజించుకొనుటయే దివ్యదాంపత్యము. ఈ సత్యమును శ్రీ శారదారామకృష్ణులు తమ పవిత్ర జీవితముచే నవయుగమునకు చాటినారు.

అది ఫలహారిణీ యను కాళిని పూజించునట్టి సుదినము. 1873 మేనెల 25వ తేది. కాళీమాత ఆలయము వివిధ కోలాహలములతో గన్నులపండువై యొప్పుచుండెను. వేనవేలు భక్తు లా యుత్సవమును చూచుటకు అచట గుమికూడిరి. షోడశీపూజ నీ దినముననే శ్రీ రామకృష్ణుడు చేయ నిర్ణయించుకొనెను. పదునారేండ్లు వయసుగల సుందరిలో బాలా త్రిపురసుందరి నావాహనచేసి చేయు పూజయే షోడశీ పూజ. జగన్మాత యీ పూజ చేసినవారికి ఆధ్యాత్మిక సంపదను ఇనుమడింపచేయును.

శ్రీ రామకృష్ణుడు శారదను పిలిపించి తన గదిలో పీఠమున కూర్చుండ బెట్టెను. పవిత్ర గంగాజలమును ఆమెపై జల్లి 'ఓ బాలా త్రిపురసుందరీ, మాతా! నాకై సిద్ధిద్వారమును తెరువుము. ఈమె మనస్సును, శరీరమును పవిత్రముచేసి యీమెయం దావిర్భవించి లోకకళ్యాణమును కల్గింపుము' అని ఆవాహనము చేసెను. మాతృదేవిని పరమేశ్వరీస్వరూపముగా భావించి షోడశోపచారములతో పూజించెను. ఆమె పాదములకు పారాణిపూసి నుదుట తిలకముంచి క్రొత్తబట్టలు కట్టబెట్టెను. తాంబూల మిచ్చెను. గురుదేవు డీ యుపచారములు చేయునప్పుడు ఆమె మాట్లాడకుండ ఆతడు చెప్పినట్లు చేయసాగెను. పూజ ముగియగనే ఆమె సమాధిలో నిమగ్నురాలయ్యెను. గురుదేవుడుగూడ గాఢసమాధిలో మునిగెను.

ఆ విధముగ ఆ దంపతులకు కొన్నిగంటలు గడచిపోయెను. శ్రీరామకృష్ణుడు తన యెదుటనున్న మాతృదేవియం దావిర్భవించిన లోకేశ్వరి కాత్మసమర్పణచేసి సమస్తసాధన ఫలమును ఆమెకు సమర్పించెను. సమాధి భంగమైన తర్వాత ఆమె నహబత్తుకు వెడలిపోయెను. ఈ షోడశీపూజ వీరి దాంపత్యము నెంతో విలువగలదిగను మహిమాన్వితముగను చేసెను. ఈ పూజతో పరమహంస దివ్యసాధనలు పరిపక్వము కాసాగెను. మాతృదేవి జీవితమునగూడ ఈ పూజ ఆమె మానసికపరిణామమునకు నాందియై పారమార్థికజీవితమునకు ప్రాణప్రతిష్ఠయై యొప్పెను. శ్రీరామకృష్ణుని సహధర్మచారిణియై తా నికమీద నిర్వహింపబోవు మహోద్యమమునకు ఆమె పూర్ణాధికారమును, అర్హతను సంపాదించెను.

## 9. గురు శుశ్రూష

సీత, సావిత్రి, అరుంధతి మొదలగు పతివ్రతలవలె ఆమె పతినే తన సర్వస్వముగా భావించెను గదా! సేవ దివ్య ఫలితముల నీయువలెనన్న దానిని త్రికరణశుద్ధిగా శ్రద్ధాభక్తులతో చేయవలెను. ధ్యానాదులిందుకు సాధనములు మాత్రమే.

ఆ దినములలో గురుదేవు 'డామెకు వివిధదేవతా మంత్రములను వాని నుపదేశించు విధానమును బోధించెను. ఆమెకూడ "నివురుగప్పిన



నిప్పు"వలె రామకృష్ణుని వలె వివిధ మహిమలకు నిలయమై, విరాజిల్లసాగెను. ఆయనవలెనే ఆమె సమాధినిమగ్నయై దైవసాక్షాత్కారము నందసాగెను. ఒకనాడు మన మాత యోగేన్ మాయి అను రామకృష్ణుని శిష్యురాలితో 'ఠాకూర్‌వలె నేను గూడ సమాధిస్థితి పొందగోరుచున్నాను. ఆయనతో చెప్పి నా కోర్కె తీర్పుము' అని పలికెను. రామకృష్ణుని ఆమె 'ఠాకూర్' అని పేర్కొనుచుండెడిది. అపుడు శిష్యురాలు రామకృష్ణునికి మాత కోర్కెను నివేదించెను. ఆమె మాటలు విని ఆయన గంభీరత వహించెను. తర్వాత యోగేన్‌మాయి నహబత్తుకు వెళ్ళి చూడగా శారదాదేవి నిత్యపూజకై ఆసనమున కూర్చుండెను. ముసిముసినవ్వులు నవ్వుచు అంతలో విలపించుచుండెను. క్రమముగా ఆమె తన్మయతనంది నిశ్చేష్టురాలయ్యెను. ఆమె సమాధినిమగ్న యయ్యెనని యోగేన్‌మాయి గ్రహించెను. తనను ధన్యురాలిని చేయుటకే ఆమె యట్లుచేసెనని గూడ యోగేన్‌మాయి తెలిసికొనెను.

గురుదేవుని సాహచర్యముచే మాతృదేవి యిట్టి దివ్యానుభవముల నెన్నో పొందెను. కాని తమ యౌన్నత్యము నా దంపతులు అనర్హులవద్ద నెన్నడును ప్రదర్శింపలేదు. పింగళి సూరనార్యుని పల్కులు వినుడు-

"క. తమ విద్య నెవ్వ రేమా
త్రము గనఁజాలుదురు వారిదండను తన్మా
త్రమ ప్రకటింతురు బుధు లు
త్తముల మహిమ నీరుకొలఁది తామర సుమ్మా."

ఉత్తము లెప్పుడును అయోగ్యుల వద్ద పాండిత్యము ప్రదర్శింపరు. ఎదుటివారి అర్హతలను బట్టి అవసరమైనంత వరకు మాత్రమే మాట్లాడుదురు. తామరకాడ నీరుకొలది కొలనులో నాటుకొనును గదా!

గురుదేవు డామెకు పారమార్థిక సాధనలను గూర్చి మాత్రమే కాక వ్యావహారిక ప్రవర్తనలో గూడ శిక్షణ నిచ్చెను. లోకజ్ఞానమును, సంసార కృత్యములను, ఇల్లు చక్కబెట్టుకొనుటను, ఆమె శుశ్రూషకు ప్రీతుడై ఆతడు బోధించెను. ఒకచోటనుండి తీసిన వస్తువును తడవుకొనకుండ చీకటిలోగూడ గుర్తించుటకై తిరిగి యథాస్థానమున పెట్టుట నేర్పెను. దీపములకు వత్తులుచేయుట, కూరలు తరుగుట, వంటచేయుట, తమల పాకుల చిలుకలు చుట్టుట మొదలగు పనులన్నియు తీరుగాచేయు టామె నేర్చుకొనెను.

మాతృదేవి వసించు నహబత్తు రెండంతస్తుల చిన్న కట్టడము. పైయంతస్తులో అత్త చంద్రాదేవి నివసించును. క్రింది గది యామె నివాసము. తనగదిలోనే భర్తకును, అత్తకును వంటచేయును. ఒక ప్రక్క కూరల బుట్టలు, మరొక వేపు బియ్యపుసంచులు వేరొకదిక్కున ఇతరవస్తువులు ఆ గది నావరించియుండగా ఉట్టిపై గురుదేవుని కవసరమైన ఆహారపదార్థములుగల కుండ వ్రేలాడుచుండును. అందే ఆమె పరుండును, కూర్చుండును. ద్వారబంధమునకు తగిలి ఆమెతల మొదటిరోజులలో బొప్పి కట్టెడిది. క్రమముగా తలవంచి నడచుట ఆమె కలవాటయినది.

గురుదేవుని భోజనము సిద్ధముచేసి ఆమె ఆలయమందలి యాతని గదికి కొనివచ్చును. ఈ విధముగ ఆయనను దర్శింపనిదే ఆమెకు తోచె డిదికాదు. అయినకూడ ఆమె యోగక్షేమముల నెరుగుటకు ప్రతిదిన మొక్కసారి యామె గదికివెళ్ళి సాయంకాలము లోపుగా తన గదికి చేరుకొనెడివాడు.

గురుశుశ్రూషలోనెల్ల ప్రధానమైనది ఆమె ప్రత్యేకముగ పరమ హంసకు వంటచేసిపెట్టుట. అతని జీర్ణశక్తి సరియయినదికాదు. భోజనమున ఏ మాత్రము వ్యత్యాసము కల్గినను త్రానువంటి అతని ఆరోగ్యము చెడిపోవును. ఆమె దక్షిణేశ్వరమునుండి తప్పనిసరిపనిమీద ఎచ్చటకైన వెడలినచో బాధపడి వెంటనే రమ్మని యామెకు కబురంపు వాడు. మన మాత యీ విధముగ తన భర్తకును అత్తకును సేవలు చేయుయుండెడిది. ఆ యిద్దరిని గురువులగను, ప్రత్యక్షదైవములుగను భావించుచుండెడిది. పతిదేవుని తల్లిని తన తల్లిగా సేవించుటయే గదా భారతీయధర్మ లక్షణము. చూచితిరా మన స్త్రీల సంస్కారము! తన తల్లిదండ్రులను చుట్టపక్కములను వదలి పతిగృహమునే సర్వస్వముగా భావించి ఆమె యెట్లు ఇహపరములను సంపాదించుకొనుచుండెడిదో!

తానెంత ఒత్తిడిపనిలో ఉన్నను ఆమె, వృద్ధురాలు చంద్రాదేవి ఓపి కలేక చిన్న కంఠస్వరముతో బిలిచినను, ఆ పిలిపు పూర్తికాకముందే పరుగుతో సమానముగ మిద్దెఎక్కి ఆమెవద్దకు పోయెడిది. ఆ తొంద రలో ద్వారబంధము తగుల వచ్చునని యోగేన్‌మాయి ఒకసారి పల్కగా 'అట్లు జరిగినను పరవాలేదు. ఆమె నాకు గురువు తల్లి; సకాలమున



నే నామెవద్దకు వెళ్ళలేకపోయిన ఆమె యెంత బాధపడునో గదా!' అని మనతల్లి జవాబిచ్చెను.

గురుదేవునికి శిష్యబృంద మభివృద్ధి చెందుచున్న కొలది ఆమెకు వంటపనిగూడ పెరుగసాగెను. ఎవరి కిష్టమయిన పదార్థములు వారికి ఆమె ప్రీతితో వండిపెట్టుచుండెడిది. వంటపనికై ఆమెకు ఒక్కొ క్కప్పుడు రాత్రింబగళ్ళుకూడ చాలెడివికావు. ఒకసారి లాటు అను బాలశిష్యుడు (అభేదానందస్వామి) ధ్యానమునకు గూర్చొనియుండెను. రామకృష్ణు డాయనతో 'నాయనా, ఆ పరతత్త్వము-నీ ధ్యానమునకు లక్ష్యభూతమైన దేవత-నహబత్తున చపాతీలు చేయుచున్నది. వెళ్లి పిండి కలిపి చపాతీలను ఒత్తి ఆమెకు సాయము చేయుము' అని పలికెను. ఆహా! ఎట్టి కర్మయోగరహస్యము!!

నిత్యకృత్యములం దామె నియమబద్ధురాలు. తలపై మేలిముసుగు లేనిదే ఆమె భర్తకు కూడ కంటబడెడిది గాదు. తెల్లవారుజామున మూడుగంటలకే లేచి గంగాస్నానము చేసి పూజాధ్యానములు చేయును. తర్వాత వంట చేయును. శిష్యబృందము వద్దలేనిచో గురుదేవుని శరీ రమునకు తైలము మర్దించును. అతడు స్నానము చేయుచుండగా తమలపాకుల చిలుకలు చుట్టును. సకాలమున తల్లివలె లాలించి రామకృష్ణునికి భోజనము పెట్టును. మధ్యాహ్నము ఒంటిగంట కామె భుజించి కొంచెము సేపు విశ్రమించును. తర్వాత నహబత్ మెట్లపై ఎండలో గూర్చొని కురుల నారబెట్టుకొనును. ఇంతలో మరల సాయంకాలపు వంట సిద్ధము. మరల ధ్యానాదులు. ఆపై రాత్రికి తన అత్తగారికి భర్తకును భోజనము పెట్టుట. ఇదియే ఆమె దినచర్య. కాని ఇట్టి పనులు రాట్నమువలె గిరగిర తిరుగుచు ఎన్నిచేయుచున్నను రామకృష్ణుని సన్నిధి నుండుటచే ఆమెకు అలసటయే కలిగెడిది కాదు.

అలౌకికమగు వీరి ప్రేమానురాగములను గూర్చి రామకృష్ణుని శిష్య రాలు గౌరీమాయి ఇట్లు పలికెను. 'ఏబదిగజముల దూరమున నివసించు ఈ వ్యక్తు లిరువురును నెలలకొలది కలసికొనకున్నను అఖండప్రేమానురాగబద్ధులే.' ఒకప్పు డమ్మకు తలనొప్పి రాగా రామ కృష్ణు డంతమాత్రమునకే ఎంతో ఆందోళన చెందెను. అలంకారములపై మనసని గ్రహించిన అత డీమెయానందమునకై మూడువందల రూప్య ములతో నగలు గూడ చేయించెను.

ఒకసారి శరీరచ్ఛాయను గూర్చి ఒక పోటీ పరీక్ష జరిగెను. శ్రీ రామకృష్ణులును మరొకవ్యక్తియు అందు అభ్యర్థులు. గురుదేవుడు మన తల్లినే మధ్యవర్తిగా ఎన్నుకొనెను. అభ్యర్థు లిద్దరును ఒకరిప్రక్కనొకరు నిలువసాగిరి. శారదాదేవి నిష్పక్షపాత బుద్ధితో రెండవ వ్యక్తికే విజయపతాక నిచ్చెను.

కలలోనైనను గురుదేవు డామెను ఎన్నడును తృణీకరింప లేదు. ఆమె మనోభావములనే ఆత డనుసరించువాడు. బాలశిష్యులను గురుదేవుడు చాల లఘువుగా భుజింపనియమించెను. దీనికి భిన్నముగా ఆమెవారికి కడుపునిండుగా మెక్కబెట్టెను. అపు డామె నాతడు వారల భావిదశను పాడు చేయుచున్నదని మందలించెను. అందుకు మనతల్లి 'వారి శ్రేయము నేను గమనింపగలను లెండు. భోజనవిషయమున మీ రా బాలురను మందలింపనక్కరలేదు' అని వినయముగా సమాధానమిచ్చెను. చూచితిరా! ఆమె మాతృవాత్సల్యము!

భర్త సాహచర్యములో ఆమె కామమును మాత్రమే గాక కాంచనమును గూడ తృణప్రాయముగ నెట్లు వదలెనో చూడుడు- శ్రీ రామకృష్ణుని శిష్యుడు లక్ష్మీనారాయణు డను మార్వాడీవర్తకుడు గురువునకై పదివేలరూపాయలు సమర్పింపబోయెను. కాని దానిని ఆత డంగీకరింపలేదు. బహుశః మన తల్లి బుద్ధిని పరీక్షించుటకే కావచ్చును- శారదాదేవి కభ్యంతరము లేకపోయినచో ఆ డబ్బు నామె కీయవచ్చునని అతనికి తెలిపెను. కాని ఆ తల్లి-'ధనము అనునది గురుసేవకే వినియోగింపబడవలసి యున్నది కాన దాని నతడు గ్రహించు టొకటియు, తాను గ్రహించుటొకటియుగా'దని తెలిపి ధనము నిరాకరించెను.

## 10. పతి నిర్యాణము

శ్రీ రామకృష్ణునితో మన మాత ఎంత ఆనందకరముగా కాలము గడపెనో వర్ణించుట కీ చిన్న పొత్తములో తావు లేదు గదా యని విచారము కలుగుచున్నది. కాని నిజమంతే! ఆయనతో ఆమె పదమూడు సంవత్సరములు గడపెను. కాని ఆమె కవి పదమూడు రోజులుగ గడచిపోయెను. ఎడతెగకుండ శిష్యకోటికి బోధచేయుటకే



అతని శక్తియంతయు ఖర్చయిపోయెను. నిరంతర ధ్యానసమాధులతో ఆయన శరీరము లోలోననే గుల్ల అయిపోయెను. ఆరోగ్యము పూర్తిగ క్షీణింపసాగెను. రోజున కిరువదిగంటలు ఆధ్యాత్మిక సాధనలో కాలము గడుపుచున్న పరమ హంసకు భగవంతునినుండి పిలుపు వచ్చెను. ఆ పిలుపే ఆయనకంఠమున కలిగిన ప్రబల వ్రణము. దానికి చికిత్స చేయించుటకు శిష్యు లాతనిని కలకత్తాలో వేరొకచోటుకు మార్చిరి. అమ్మ దక్షిణేశ్వరములోనే ఉండవలసివచ్చెను. ఆమె కపుడు ఒకబాలిక తన చదువుకు తోడ్పడగా ఆమె చక్కగా చదువుట నేర్చుకొన్నదని, కూరగాయలు, తినుబండారములు ప్రతిఫలముగా ఇచ్చెనని మనము లోగడనే తెలిసికొన్నాము గదా!

అది 1885 వ సంవత్సరము. ఆమె తర్వాత భర్తవద్దకే వెడలి శుశ్రూష చేయసాగెను. వైద్యు లెంత ప్రయత్నించినను రామకృష్ణుని తీవ్రబాధను గాని వ్యాధిని గాని నివారింప లేకపోయిరి. తన హృదయేశ్వరుని ప్రాణదీపము మినుకు మినుకు మనుచుండ ఆమెకు దుర్భర దుఃఖము పెరుగసాగెను. అన్నపానీయములు వదలి రెండుదినములు అహోరాత్రములు తనకు పతిభిక్ష పెట్టుమని భగవంతుని ప్రార్థించెను. హఠాత్తుగా ఆమె కీ దివ్యానుభవము కల్గెను. 'భర్త ఎవరు? భార్య ఎవరు? లోకమున ఎవరి కెవరు?' ఈ ఆలోచనతో ఆమెకు భర్తపై గల అనురాగము మాయమయ్యెను. మరునా డుదయము గురుదేవుడు ఆమెతో అనెను 'సరి, నీ కేమైన లభించెనా? అంతా మిథ్య, అంతే గదా!' దీనితో తన పతి దివ్యపురుషుడని, కాని విధివిలాసమున కెవరును ఎదురీదలేరని ఆమెకు పూర్తిగా నమ్మకము గలిగినది.

మన మాతృదేవిని, శిష్యకోటిని మాత్రమేగాక లోకమంతటిని దుఃఖసముద్రమున ముంచి శ్రీరామకృష్ణపరమహంస 1886వ సంవత్సరమున, ఆగష్టు 16వ తేదీన పరబ్రహ్మలో ఐక్యముచెందెను. చందన కర్పూరాదులతో అతని దేహమునకు దహనసంస్కారములు జరిగెను. నాటి యాచారము ననుసరించి యామె తన సొమ్ములను తీసివేయబోయెను. కాని శ్రీ రామకృష్ణు డామెకు సాక్షాత్కరించి యిట్లు పలికెను- 'ఏమి చేయుచున్నావు, నేను చనిపోలేదు సుమీ! ఒక గదిలోనుండి మరొక గదిలోనికి వెళ్ళినాను. అంతే.' మాత కీ దివ్యా

నుభవము ఉపశాంతి కల్గించెను. వితంతువులు కాగానే ఆ దేశపు స్త్రీలు మురుగులు, అంచుల చీరెలు ధరింపరు. కాని రామకృష్ణుని ఆజ్ఞచే ఆమె మురుగులను, ఎఱ్ఱంచు చీరెలను తాల్చసాగెను.

## 11. బృందావన యాత్ర

మునీశ్వరులు, మహాభక్తులు తపములుచేసిన పుణ్యస్థలములందు వారి పారమార్థిక భావములు ఘనీభూతములయి యుండునని, తాను దర్శింప లేని ప్రదేశములు తన తర్వాత దర్శింపు మని పరమహంస మన మాతతో పల్కియుండెను. అందుచే పతి నిర్యాణమయినవెంటనే ఆమె ఆయన కోర్కి తీర్పబూనెను.

యోగానందస్వామి (యోగేన్), అభేదానందస్వామి (కాళీ), అద్భుతానందస్వామి (లాటూ), లక్ష్మీదేవి, గోలప్‌మాయి అను శ్రీ రామకృష్ణుని శిష్యులు తనవెంట రాగా మాతృదేవి 1886 ఆగస్టు 30వ తేదీన బృందావనయాత్రకై బయలుదేరెను. దారిలో వారు వైద్యనాథము, కాశీ, అయోధ్యలను దర్శించిరి. తర్వాత బృందావనము చేరిరి. శ్రీకృష్ణుని అసంఖ్యములయిన బాలలీలలచే పవిత్రమయిన దీ పుణ్యక్షేత్రమే! మధుర ప్రేమభావముతో రాధ మాధవు నిచటనే యుపాసించెనుగదా!

ఆ యూరిలో ఆమెకు ధ్యానప్రార్థనలలో ఒక సంవత్సరము తెలియకుండగనే గడచిపోయెను. ఆమెయు యోగేన్ మాయియు జపమున తన్మయులయి యుండ ఈగలు తమ మొగములపై వ్రాలి పుండ్లను చేయుటకూడ వారు ఎరుగ లేకుండిరి. ఆలయమున బద్ధాంజలితో ఆమె రాధాకృష్ణుల నిట్లు ప్రార్థించెను. 'ఒరుల దోషమును గమనించు దుర్గుణము నా హృదయమునుండి తొలగింపుము. ఒరుల నెన్నడును నిందింపకుందునుగాక.' ఈ సందర్భములో మన యీ ఆంధ్రమహాభారత సూక్తి స్మరణీయము గదా!

"ఒరులే యవి యొనరించిన
నరవర! అప్రియము తన మనంబున కగుఁ దా
నొరులకు నవి సేయకునికి
పరాయణము సకలధర్మపథముల యందున్."



—ఆమె యీ ప్రార్థన తర్వాతజీవితములో పూర్తిగా ఫలించెను. తర్వాత నామె పరుల గుణములను మాత్రమే గ్రహింపగల్గెను.

అచ్చటనున్నప్పుడే మాతృదేవి అనేక దివ్యానుభవములను పొందెను. కాని ఆమె నిరాడంబర స్వభావము వాని నితరులకు తెలియనిచ్చెడిదికాదు. ఒకనాడు మాతా గంటలతరబడి సమాధి నిమగ్నయైయుండెను. యోగేన్ మాయి ఆమె చెవిలో భగవన్నామముచ్చరించినను లాభము లేకపోయెను. చివరకు యోగానందస్వామి ప్రయత్నముచే నామె కెట్లో తెలివివచ్చెను. రామకృష్ణు డట్టిసమయమున పల్కునట్లుగనే ఆమె 'నాకేమైన తినుటకు కావలెనని' పల్కెను. కొన్ని భక్ష్యములు తాంబూలము, నీరు, ఆమెకు సమర్పించిరి. గురుదేవునివలెనే యామె వానిని కొలది కొలదిగా ఆరగించెను. ఈ దివ్యభావములో నుండియే ఆమె యోగానందుని కొన్ని ప్రశ్నలకు, సమాధాన మొసగెను. అవి వినువారి కచ్చముగా గురుదేవు డిచ్చుచున్నట్లే తోచెను. పూర్తిగా స్మృతి కలిగిన తర్వాత పరమహంస తన మనమున ఆ సమయమున భాసించుచుండెనని శిష్యులతో ఆమె పలికెను. లోకమున కామె యొనర్చిన జ్ఞానదాన మిచటనే యారంభమాయెను. గురుదేవు డొకనా డామెకు ప్రత్యక్షమై యోగేన్‌కు మంత్ర ముపదేశింపుమని పలికెను. కాని అప్పుడే గురువు పదవి పూనిన దేమా అని జను లనుకొందురేమో అని ఆమె జంకెను. కాని వరుసగా మూడు రాత్రులు ఆమెకు శ్రీరామకృష్ణుడు కనిపించి 'యోగేన్‌కు నేను మంత్ర ముపదేశింపలేదు, నీ వుపదేశింపుము' అని పలుకగా వినెను. చివర కామె యందు కంగీకరించి అతని తన సమీపమున గూర్చుండ నియోగించెను. పూజగావించుచు సమాధిస్థితిని బొంది యా దివ్యస్థలమందే యామె యోగేంద్రునకు మంత్ర ముపదేశించెను. పంచాగ్ని మధ్యమున మహాతప మొనర్చిన ఆ యోగిని యోగేంద్రునకు మంత్ర ముపదేశించుటతోనే ఆమె పారమార్థిక ప్రతిభాప్రభావములు దశదిశలందు వ్యాపింపసాగెను.

## 12. దివ్యదర్శనము

అరుగదీసినకొలది చందనపుచెక్కనుండి పరిమళము వెలువడునట్లే మహాపురుషుల శీలము గూడ కష్టకాలముననే దివ్యతేజస్సుతో వెలు

గొందును. మాతృదేవిగూడ ఎన్నో బాధలుపడి పతిదేవుని చాలసార్లు
దర్శింపగల్గెను. అది ఎట్లు జరిగెనో తెలిసికొందము.

భర్త పరమపదము చేరిన తరువాత శారదామాత బృందావనము
నుండి దక్షిణేశ్వరమునకు తిరిగివచ్చెను. వెంటనే తన భర్త స్వగ్రామమగు
కామారిపుష్కరమున నివసింప నేగెను. వితంతువైన తరువాతగూడ
ఆమె మురుగులు, ఎఱ్ఱంచు చీరెలు ధరించుచున్నదని చూచినవారు
గుసగుసలాడ దొచ్చిరి. ఆ మాటలకు వెరచి ఆమె మురుగులను తీసి
వైచెను.. గంగాస్నాన మనిన ఆమెకు ప్రాణము. దూరమందున్న
గంగానదికి ఆమె పోయిరావలె ననుకొనుచుండెను. ఒకనాడు పరమహంస
కాలువ తట్టునుండి తన యింటివైపునకు వచ్చుచుండుటను చూచి ఆమె
ఆశ్చర్యపడెను. నరేన్ (శ్రీ వివేకానందస్వామి), బాబూరామ్ (ప్రేమా
నందస్వామి), రాఖాల్ (బ్రహ్మానందస్వామి) ఇతర భక్తులనేకులు గూడ
ఆయన వెనుక వచ్చుచుండిరి. అంతకంటె గూడ ఆశ్చర్యమేమన గురు
దేవుని పాదపద్మమునుండి ఒక దివ్యనది బయలుదేరి అలలతో ఆయన
ముందు పారుచుండెను. 'సమస్తము ఈయనయే గదా! ఈయన పాద
పద్మములనుండియే గంగామాత పుట్టినది' అని శారదాదేవి తనలో
అనుకొనెను. త్వరగా పుష్పములు తెచ్చి ఆమె ఆ ప్రవాహమున
సమర్పించెను. అపుడు రామకృష్ణుడు 'మురుగులు తీసివేయకు. నే
నెప్పుడును నీ హృదయకమలనివాసినే గదా! గౌరీమాయి నీ వద్దకు
వచ్చి కొన్ని వైష్ణవతంత్రములు ఉపదేశించును' అని పలికెను. దీనికి
నిదర్శనముగా గౌరీమాయి రాగా మన తల్లి, 'పతి సతికి చిన్మయుడు
(జ్ఞానస్వరూపుడు)' అని ఆమె వలన తెలిసికొనెను. దివ్యదర్శనమన
నిదియే!

గురుదేవుడు జీవించియున్నపు డామెతో 'నాతరువాత నీవు మన
స్వగ్రామము కామారిపుష్కరమునకు వెళ్ళి నివసింపుము. నీకు జీవిత
ములో అన్నవస్త్రములకు లోటు కలుగదు. పట్టె అన్నమును ఆకుకూర
లతో నైనను భుజించి హరినామ స్మరణలో కాలము గడపుకొనుము'
అని పలికెను. ఆయన ఆజ్ఞను పాలించుటకై శారదామాత ఇపు డిచట
నివసింపసాగెను. ఆకుకూరలు పండించుటకై ఆమె పారను చేపట్టి
నేలను త్రవ్వి బాగుచేసి విత్తనములు చల్లెను. అవి మొలచి కూరకు
వచ్చువరకు తన గాదెలోని వడ్లను దంపుకొని అన్నము వండెడిది. గురు



దేవునకు నివేదించి ఏ ఆదరువు లేని పట్టె చప్పడి అన్నమును ఆమె
తినసాగెను.

తన హృదయమును పరమేశ్వరునకే అర్పించిన ఆమె తన కష్టస్థితి
తల్లికిగూడ తెలియనీయకుండెను. ఆమె ఒకపరి తల్లిని చూచుటకు
జయరాంబాటికి పోయెను. బికారి వేసముననున్న కుమార్తెను చూచి
శ్యామసుందరీదేవి దుఃఖముతో విలవిలలాడెను. తన ఇంటనుండుమని
ఆమె బ్రతిమాలినను నిరాకరించి శారదాదేవి స్వగ్రామమునకు మరలి
పోయెను.

ఆపద లెంతటి యోగులకైనను అలజడి కలిగింపక పోవు. బాధలు
పడలేక ఆమె ఒకసారి మాత్రము ఇట్లనుకొనెను: 'నాకొక బిడ్డడైనను
లేడే; నా యనుకొనదగినవారు లోకమున నా కెవరును లేరు. నా
గతి ఏమగునో గదా?' వెంటనే పతిదేవుడు ప్రత్యక్షమై ఆమెతో నిట్లు
పలికిరి. 'పుత్రుడు లేడని నీకు విచార మేల? నీ కనేక పుత్రరత్న
ములను ఒసగియున్నాను. క్రమముగా వారేగాక యింకను చాలమంది
నిన్ను 'అమ్మా' యని పిలుచుటయేగాక నీకు దివ్యసేవ చేయగలరు
సుమీ.' ఈ విధముగా ఆమెకు చాలసార్లు గురుదేవుని దివ్యదర్శ
నము లభించుటచేతనే తానిక గురుదేవుని మహోద్యమమును అచంచల
దీక్షతో కొనసాగింపవలెనని ఆమె నిర్ణయమునకు వచ్చెను.

సరిగా ఇదేసమయమున నరేంద్రుడను పూర్వనామము గల శ్రీ వివే
కానందస్వామి సనాతన ధర్మప్రచారము అను మహోద్యమమును-పరమ
హంసయొక్క పరమాదర్శమును- ఖండఖండాంతరములందును వ్యాపింప
జేయుటకు ప్రారంభించిన షుముహూర్తముగూడ సంఘటిల్లెను. లోక
మాతకు వలెనే వివేకానందునకు గూడ తన గురువు దివ్యదర్శనము
ఎన్నోమార్లు లభించియుండెను. ఆమె దివ్యోపదేశములచే ఆత్మవికాసము
నందుటకై అనేకభక్తులరుదెంచి మన తల్లి శారదను ఆశ్రయింపసాగిరి.

ప్రసన్నమయి అను పరిచారిక రాత్రులందు తల్లిని చూచి వెళ్లెడిది.
ఆ దాదిద్వారా మన మాతస్థితిగతులు బంధువులకును, కలకత్తాలో
రామకృష్ణుని శిష్యులకును తెలిసెను. గోపాల్ మాయి అను శిష్యురాలు
చందాలు ప్రోగుచేసి పంపి ఆమెను కలకత్తాకు పిలిపించెను. ఆమెకు
జ్యేష్ఠపుత్రుడనదగిన శారదానందస్వామి గొప్ప కృషిచేసి 1909లో

కలకత్తాలో బాగ్‌బజార్‌లో ఆమె నివసించుటకై 'ఉద్బోధన కార్యాలయము' అను దివ్యభవనము నిర్మింపజేసెను. ఆమె ఇక అచ్చటనే నివసింపసాగెను.

## 13. జడభరతునకు లేడిపిల్లా!

మన తల్లి కలకత్తాలోని దక్షిణేశ్వరమునుండి అపుడపుడు పుట్టింటికి వెళ్లి ఉండవలసివచ్చెడిది.

శ్యామసుందరీదేవి కాలుసేతు లుడిగిపోయెను. నలుగురు సోదరులకును భార్యలు కాపురమునకు వచ్చిరి. కాని వారు చిన్నవయసువారగుటచే గృహకృత్యములు సరిగా నిర్వహింపలేకుండిరి. తన తల్లిశ్రమ చూడలేక శారదామాతయే ధాన్యము దంపి, వంటచేసి సమస్తకార్యములలో ఆ యింటికి సాయపడుచుండెడిది. పారమార్థిక జీవనమున పండిపోయిన మాతృదేవిచే అంతటి సేవలు పొందుటకు ఆమె సోదరులు పూర్వజన్మమున ఎట్టి తపముచేసిరో గదా!

ఆమెసోదరులకు అర్థికచింతయేగాని పారమార్థికచింత యిసుమంతయును గూడ లేదు. డబ్బిమ్మని వారు తనను పీడించుచుండగా 'ఎంతసేపు డబ్బుకోసమే గదా వారి ప్రాధేయత. భక్తిజ్ఞానముల నిమ్మని వారు న న్నడుగరు గదా!' అని ఆమె తనలో ఎంతో బాధపడుచుండెడిది.

సోదరులలో చిన్నవాడు వైద్యవృత్తిలో పట్టభద్రుడు. అభయ చరణుడని అతని పేరు. అతడు విషూచి వ్యాధిచే 1889లో అకాలమరణమునందెను. తన యవసాన కాలమున గర్భవతియగు తన భార్య సురబాలను మాతృదేవి కప్పగించి చనిపోయెను. అభయుడన్న మన తల్లికి మక్కువ మిక్కుటము. భర్త యకాలమృతిచే సురబాలకు మతిచెడిపోయెను. ఆ స్థితిలోనే ఆమె ఒక ఆడుబిడ్డను కనెను. ఆ బిడ్డయే మన తల్లి పాలిటి విషమసమస్యగా పరిణమించినది. దిక్కులేని యీ తల్లిబిడ్డల భారము శారదామాత వహింపవలసి వచ్చినది. ఆమె వారికొక దారి నేర్పరచి, సమస్త సదుపాయములు కల్పించి దక్షిణేశ్వరము వచ్చివేసెను.



కాని ఆమె ఆ మాతాశిశువులను తలచుకొని లోలోన కుమిలిపోని దినములేదు. ఒకనాడు మాతృదేవి ఆలయమున పూజచేయుచుండెను. సురబాల కుమార్తె రాధ మహాబాధల పాలగుట నాటకములో తెరపై వలె ఆమెకు స్పష్టముగా గోచరించెను. ఇక ఆమె అట నిలువలేక జయరాంబాటికి తిరిగి వెళ్ళి తానే ఆ బాలికయొక్క సమస్త భారములు వహించెను. ఆ పిల్లను చూడనిచో ఈమెకు అన్నపానములు రుచించెడివి కావు. ఆ బిడ్డప్రక్కన పడుకొననిదే నిద్రపట్టెడిది కాదు. ఇది ప్రేమయా లేక మోహమా అని చూచువారికి సంశయము కలుగునంతగా రాధాదేవిపై ఆమెకు నానాటికి తగులము పెరుగసాగెను. కాని యీ రాధమూలముననే ఆమె పూర్వమెన్నడును పడని దురంత దుర్భర బాధలకు గూడ లోను కావలసి వచ్చెను.

అర్భకురాలగు రాధి రోగములకు పుట్టినిల్లు. మాతృదేవి యీమెకు మందులిప్పించుచుండగా సురబాల తన పిల్ల నామె చంపివేయుచున్నదని అరచెడిది. ఒరసారి సురబాల పొయ్యినుండి మండుచున్న కొఱవి తెచ్చి శారదాదేవి నెదుర్కొనెను. ఆ బాధలకు తట్టుకొనలేక విసిగిపోయి ఒకప్పుడు మాతృదేవి యిట్లు దురపిల్లెను. 'బహుశః నేను ముండ్లుగల మారేడు పత్రితో పరమశివుని పూజించియుందును. కాననే నా కీ ముల్లు సంప్రాప్తమైనది.' వింత యేమన సురబాల ముల్లుమాత్రమే కాగా తా నబ్బురముగా ప్రాణపదముగా పెంచిన రాధ శారదామాత ప్రాణమునకు మొనదేరిన ముల్లుగా పరిణమించెను. వయస్సుతోబాటు రోగములు, వానితోబాటు అవివేకము ఆ పిల్లలో దినదినాభివృద్ధి కాసాగెను. అమాయకురాలే యైనను, ముంగోపము, పెంకెతనము, వెట్టిధోరణి సదా ఆ పిల్లలో తాండవించుచుండెడివి. మాతృదేవి తాపత్రయపడుచున్నకొలది ఆ పిల్లబుద్ధి కుక్కతోకవలె మరింత వక్రము కాసాగెను.

మాతృదేవి మాట ఆ పిల్ల ఎంతమాత్రము వినెడిది కాదు. పరుల యెదుట గూడ ఆమెను వెక్కిరించును; దూషించి శపించును; వస్తువుల నామెపై విసరివేయును.

రాదికి మాతృదేవి వివాహము చేసి అల్లుని గూడ యింటిలో పెట్టుకొనెను. ఆ పిల్ల గర్భవతి యయ్యెను. శరీరముతోబాటు మనస్సు

గూడ దుర్బలమయ్యెను. ఆమె యెట్లో ప్రసవించెను. బిడ్డ కారు నెలలు వచ్చినవి. రాధి నల్లమం దలవాటు చేసికొనెను. మాతృదేవి కూరలు తరుగుచుండగా ఒకనాడు నల్లమందుకై ఆమె సమీపించెను. ఈ పాడు అలవాటును మానుకొనమని మాతృదేవి యామెను కంట గించుకొనెను. రాధి ఒక వంకాయ నామెపై విసరి వేసెను. అది వెన్నుకు తగిలి ఆమె బాధతో గిలగిల లాడిపోయెను. వెంటనే తగిలిన చోట పెద్ద బొప్పి కూడ కట్టెను. ఆమె బాధతోనే గురుదేవుని పటమువద్దకు పోయి 'ప్రభూ, ఈ అవివేకురాలిని క్షమింపుడు' అని ప్రార్థించెను. తర్వాత తన పాదధూళి రాధితలపై ఉంచి ఇట్లు పలి కెను 'రాధీ, ఈ తనువును గూర్చి రాకూరు ఒక్క పరుషవాక్కుగూడ పలికియుండలేదు. అట్టి దీనిని నీ వింతగా హింసించున్నావు గదా! నా ఘనతను మీరెప్పటికి తెలిసికొనుట!'

రాధి సంరక్షణకు, మాతృదేవి యితర బంధువులకు, వలయు ధనము శిష్యులు కలకత్తానుండి పంపుచుండిరి. వారిలో శరత్ ప్రధా నుడు. అతడే శారదానందస్వామి. అతడు కుటుంబముకాని తన కుటుంబమునకై యెంతో కష్టపడుచుండుట కామె చాల బాధపడుచుం డెను. బిడ్డలను మించి తనపై చూపుచున్న శిష్యవరుల భక్తి శ్రద్ధలకు మరొక ప్రక్క ఆమె శరీరము పులకరించుచుండెడిది.

ఆమె పరార్థజీవితమునకు, పారమార్థికజీవితమునకు ఈ ఘట్టము సంఘర్షణస్థానము. ఇదియే ఒరపిడిరాయి కూడ. ఇంత అసాధారణ ప్రేమతో పెంచిన రాధినికూడ ఆమె అవసానకాలమున తనవద్దనుండి జయరాంబాటికి తరిమివేసెను. అంత్యకాలమున ఎవరిమీద మక్కువ పెట్టుకొన్నను తన మోక్షమునకు బంధహేతువని తెలిసికొన్న దా మహా యోగిని. చూచితిరా ఆమె వైరాగ్యనిరతి!

శ్రీ రామకృష్ణుడు సంన్యాసి గాని ఆమె గృహస్థురాలే సుడీ! పసి తనమునుండియే పరమహంసకు సహధర్మచారిణియై స్వార్థరహితముగా సేవచేసి గృహస్థజీవనముననే పూర్ణమైన ఆత్మవికాసము కాంచిన దా తల్లి! అట్టి స్త్రీరత్నము రాధిమోహజాలమున చిక్కుకొనుటా! దీనికి ప్రబలకారణము కలదు. ఆమెయే విరక్తిచే పరమహంసతో బాటు జీవి తము చాలించియుండినచో ఆమెవలన లోకమున కింతటి పరార్థము,



పరమార్థము ఎట్లు చేకూరియుండెడివి? ఆమె నీ లోకమున నిలిపి యుంచుటకు గురుదేవుడే యీ బంధము సృష్టించెను. ఆమె తన ఐహికజీవితమును అంతము చేసికొనదలచిన సమయమున పరమహంస ప్రత్యక్షమై ఒక బాలిక నామెకు చూపుచు "అదిగో, అది నీ జీవగఱ్ఱ, దానిని వదలకు; చాల మంది బిడ్డలు దాని మూలముననే నీవద్దకు వత్తురు" అని పలికెను.

సురబాలకు పూర్తిగా మతిపోయెను. ఆమె కొన్ని చింపిరి గుడ్డలు చంకనిడుకొని పోవుచుండ రాధి ఆమె వెనుక ప్రాకుచుండెను. అది చూడగనే మాతృదేవి గుండె చెఱువయ్యెను. తత్క్షణమే ఆమె ఆ బిడ్డ నెత్తుకొని గుండెలకు హత్తుకొనెను. రాకూ రామెకు కనపడి యిట్లనెను— "ఈమెయే ఆ పిల్ల; నీ జీవగఱ్ఱయిదియే. ఈమె యోగ మాయ." పరమహంస ఇంత నొక్కిజెప్పిన తర్వాతనే మాతృదేవి ఈ బిడ్డభారము చేపట్టినది.

బిడ్డలారా! ఇపుడైన మీ కర్థమైనదా మాతృదేవికి రాధపై మమ కారమెందుకో! అదియే లేనిచో పతిమృతి తర్వాత లోకమాత మనకై జీవించి యుండెడిదా!

## 14. గురుత్వము

పరిమళము, మకరందము అను వానిచే ఆకర్షింపబడి తేనెటీగలు కుసుమముల నెట్లు చేరునో ఉపదేశామృతమును గ్రోలుటకు శిష్యులు గూడ గురువులవద్ద కట్లే యేతెంతురు. ఇట్టివారు శిష్యుల హృదయ తాపము తీర్చుటకే సదా కృషి చేయుచుందురు. అంతేగాదు, వారి శరీరతాపము తీర్చుటకూడ తమ పవిత్రధర్మముగా భావింతురు. కాని చాలమంది దీనికి వ్యతిరేకముగా వారి తాపములు తీర్చుటకు బదులు తమ తాపత్రయము తీర్చుకొనుటకే శిష్యులను పలుబాధలకు పాలు చేయుచుందురు; మొదటి వారిని బోధగురువు లని, రెండవ వారిని బాధగురువు లని పల్కుటలో దోషమేమి?

సర్వగ్రంథసారము దివ్యజ్ఞానస్వరూపమును ధరించి సద్గురువు నాశ్ర యించి యుండును. వారు గూడ మనవలెనే సంసారతాపత్రయముతో

బాధపడుచున్నట్లు కనుపింతురు; కాని వారి అంతరంగమున మాత్రము అలౌకికశాంతి నాట్యము చేయుచుండును. మన లోకమాత జీవితమే యిందుకు మచ్చు తునక. ఒకవైపు బంధుజాలము— మరొకవైపు శిష్యవర్గము— ఆమె నాశ్రయించెను గదా! శరీరతాపము పోగొట్టు కొనుటకు బంధువు లామెను జేర, అంతరంగతాపము బోగొట్టుకొని ఆత్మజ్ఞానము నందుటకై శిష్యులామె నాశ్రయింపసాగిరి. శిక్ష అనగా దండన, చదువు చెప్పుట అని రెండర్థములు. అవసరమైనచో గురువు యొక్క దండన పొందియైనను మంచి చదువు నేర్చుకొనుటకే శిష్యుడు ప్రయత్నింప వలెను. శిక్షతోబాటు చక్కని శిక్షణ — జ్ఞానబోధచేయు వాడే గురువు. అతనిచే శిక్షింపదగినవాడే శిష్యుడు. వైద్యు డిచ్చు మందు చేదుగనున్ననేగాని మనకు పట్టీయుడు సుమండీ! అట్లే గురువు పరుషవాక్కులతో దండింపనిదే మన కాతని యెడ భయభక్తులెట్లు కలుగును?

దైవమానవ ప్రకృతులు నేను ముందు నేను ముందు అని పందెము వైచుకొని మన మాతలో ప్రవేశించెను. దైవప్రకృతితో శిష్యుల కామె యొక ప్రక్క ఆత్మబోధ చేయుచు మానవప్రకృతితో మరొకప్రక్క వారి శరీరములకు అవసరమయిన ఆహారాదులకై పాటుపడుచుండెడిది. మానవప్రకృతితో తన బంధువులకు సర్వసేవలు చేయుచు గూడ దైవ ప్రకృతితో శిష్యుల ఆత్మోన్నతికై అవిరత కఠోరదీక్ష పూనెడిది. తమ బిడ్డలకంటె నెక్కువగా శిష్యులను ప్రేమతో చూచుట గురువుల విధి యని ఈ ప్రకరణమున మనము గమనింతుము. శిక్షించకయే మన తల్లి తన శిష్యులకు చక్కని శిక్షణ యిచ్చుట చిత్రాతిచిత్రము!

గురుశిష్యబంధము దివ్యము, అనగా అలౌకికము. గురువులు డబ్బుకు తమను పీల్చి పిప్పిచేయు శరీరసంబంధులకంటె తమపై సదా భక్తిప్రపత్తులు కలిగియుండు శిష్యులను త్రికరణశుద్ధిగా ప్రేమించుట అత్యంత సహజము. గురువు పావనాత్ముడు, కామినీకాంచనముల కతీతుడు, బ్రహ్మవేత్తయునై యుండవలెను. అట్లే శిష్యుడు గూడ గురువునే సర్వస్వముగా భావించి గురువుయొక్క శరీరపోషణభారము వహింప వలెను. పూర్వము కులగురువులు వచ్చి తరచుగా జ్ఞానబోధ చేయుచుండుట, వారికి శక్తికొలది భోజనసామగ్రి పంపి శిష్యులు పూజించి సంభావనలిచ్చి గౌరవించుట జరుగుచుండెడిది. ఇప్పుడట్టి గురువులున్న



గదా శిష్యులు పూజించుటకు; శిష్యు లట్టివారున్నగదా గురువులు వారి వద్దకు వచ్చుట! తన గురువును కేవలము మానవునిగా తలంచువాడెన్ని జపతపములు చేసినను వ్యర్థమే గదా!

జ్ఞానోపదేశము చేయు గురువు గొప్ప బాధ్యతవహించవలెను. గురువు శక్తి మంత్రరూపమున శిష్యునియందు ప్రవేశించును. దానిద్వారానే శిష్యుని పాపములను గైకొని గురువు మిక్కుటమైన శరీరబాధ ననుభవించును. తన శిష్యుల పాపసమూహమే కంఠమున వ్రణమై బాధించెనని శ్రీ గురుదేవు డంతిమ సమయమున శిష్యులతో బల్కెను గదా! కొందరు శిష్యులు వారి పూర్వజన్మ కర్మల ననుసరించి శీఘ్రముగా పాప నిర్ముక్తులై ఆత్మవికాసము పొందుదురు. తమ పూర్వజన్మ పాపము లడ్డుపడగా మరికొంద రెంతకాలమునకైనను ఫలితము నొంద లేరు. తానునుభవించిన తీవ్ర శరీరబాధలు, వ్యాధులు, శిష్యులనుండి తాను గ్రహించిన పాపములకు ప్రతిఫలములే యని మాతృదేవి గూడ పల్కుచుండెడిది. పాపులగు జను లామె పాదములు తాకవచ్చినపుడవి చప్పున వెనుకకు బోయెడివి. ఒకవేళ అట్టివారు తాకిన ఆమె శరీరము మంటలెత్తెడిది.

1916లో బేలూరు మఠమున ఆమె దుర్గాపూజ గావించినపుడు చాలమంది ఆమెపాదములను స్పృశించి నమస్కరించిరి. గంగాజలముతో ఆమె పాదము లెన్నిసార్లు కడుగుకొన్నను ఆమె తాపము శాంతింప లేదు. దీనికి వ్యతిరేకముగ పుణ్యాత్ము లామె పాదములు తాకినపుడు శరీరమున మంచిగంధము పూసికొనినంత హాయిగా నుండెడిది!

పరులకై బాధపడుట యామె తన ప్రత్యేక హక్కుగా భావించి గర్వ పడుచుండెడిది. లోకాతీతము, లోకవ్యాప్తము అగు దివ్యమాత కుండదగు ప్రేమానురాగములచే, సర్వజనకారుణ్యముచే ఆమె తన నర్థించినవారంద రకు వారి వారి మతానుసారము మంత్రము లుపదేశించెడిది. సద్గురువుచే ఉపదేశము పొందుటతోబాటు జపతపాది సాధనలతో మాత్రమే శిష్యునకు చిత్తశాంతి లభించునని ఆమె పల్కుచుండెడిది.

భక్తుల కుపదేశించుటయే గాక వారికి భోజనాది సమస్త సదుపాయములు కల్పించుటలో లోకమాత వాత్సల్యము మరింత ప్రస్ఫుట మగుచుండెడిది. ఆమె ప్రేమాదరములు చూచి శిష్యు లానందబాష్ప

ములు రాల్చువారు. బాల్యమున తల్లిని పోగొట్టుకొన్నవారు, అసలు తల్లి ప్రేమ చవిచూడని వారు, ఆమెను చూడగానే "ఆహా! ఈమెయే మా తల్లి. మమ్ముగన్న తల్లి యీమెయే" అని బ్రహ్మానందమందు వారు. కన్నతల్లి గూడ ఈమెవలె తమపై ప్రేమచూపలేదని కృతజ్ఞత చూపిన శిష్యులు గూడ చాలమంది గలరు. "నావంటి పుత్రులు మీ కెందరో గలరు. కాని మీ వంటి తల్లి నాకు లే" దని యొక శిష్యుడామెతోనే పల్కెను.

శిష్యులకు, భక్తులకు ఆమె వండి వడ్డించి, వారల యెంగిలి ఆకులు గూడ ఎత్తి వేయుచుండెడిది. ఇందులో జాతిమత భేదములు గూడ నామె చూడలేదు. అతిథులు రాగానే విసరి, ప్రక్షాళనకై పాదములపై నీరు పోయుగా, కొంతమంది— సాక్షాత్తుగ త్రైలోక్యమాత లక్ష్మీదేవి యీ రూపమున నవతరించినదని నమ్మినవారు— అందుకు వ్యతిరేకించెడి వారు. అపుడామె ప్రేమతో "మీకు నే నేమి చేసితిని- మీ అమ్మను కానా నేను! తన బిడ్డలకు సర్వవిధములుగా సేవచేయుట— తుదకు స్వయముగా వారి మలమూత్రములను గూడ ఎత్తుట తల్లికి హక్కు గదా" అని పల్కెడిది. అప్పుడప్పుడు తన యింటికివచ్చినవారి బిడ్డల మలమూత్రములను ఎత్తి పారవేయుటలో గూడ నామె వెనుకాడెడిది కాదు.

టీ త్రాగుట కలవడిన యే శిష్యుని కొరకో, వ్యాధిగ్రస్తుడైన యే భక్తుని కొరకో, ఆమె యింటింటికి దిరుగుట సాధారణ దృశ్యము. చేతిలో కురుపులు లేచిన యొక శిష్యున కామె స్వయముగా చాల దినములవరకు అన్నము తినిపించెను. భోజనవేళ వచ్చిన అతిథి నామె భుజింపనిదే పోనిచ్చెడిది కాదు. ఇతర సమయములందు వచ్చువారికి మిఠాయిలను, పండ్లను, పాలను ఒసగి వారి నానందసాగరమున ముంచి తేల్చెడిది. భక్తులు సమర్పించు వస్తువులను ఇసుమంతయు భుజింపక తన శిష్యులకై దాచియుంచుట ఆమె యలవాటు. సదా పరుల కిచ్చుటయేగాని తాను మిగుల్చుకొనుట యెరుగ దా తల్లి! ఆహా, ఎట్టి ధన్యాత్మురాలామె! అట్టి మాత జన్మించిన యీ భారతవసుంధరపై, రత్నగర్భపై, జన్మించుటయేగాక ఆమెతో బాటు రెండు మూడు సంవత్సరము లీ పుడమితల్లిపై జీవించి యుండి, యిప్ప డిట్టు లామెచరిత్ర వ్రాయదగిన మహాభాగ్యమునకు నోచుకొన్న నేను గూడ ధన్యుడనే సుమండీ! మరి



మీరుగూడ ఈమె పవిత్రచరిత్ర చదివినందున ఆమె సుగుణములలో ఏ కొన్నియైన అలవరచుకొని ధన్యత గాంచుడు!

## 15. వ్యక్తిత్వము

మిసమిసలాడు బంగరుపొడి తెచ్చి, మార్దవము, మాధుర్యము, సౌశీల్యము అను చూర్ణములు పాళముగా మేళవించి, స్నేహరసాయనముతో చక్కగా మెదిపి, విధాత ఒక విగ్రహమును, తన యపూర్వ శిల్ప చాతుర్యముతో సృష్టించెను. దానిలో ఆత్మజ్ఞానమును ప్రాణప్రతిష్ఠ చేసెను. అలౌకిక సౌందర్యలావణ్యాదులతో లక్ష్మీదేవిని బోలిన ఆ పుత్తడి బొమ్మయే మన లోకమాత శారదాదేవిగా రూపొంది నడయాడసాగెను. అట్టి ఆ మాతను దర్శింపవచ్చిన వారి కామె ముఖమండలమున మాతృభావమే సాక్షాత్కరించుచుండెడిది. ఆమె సాన్నిధ్యమున చనవేగాక మహిత భావములు కూడ చూపరుల మనసులందు సంచరించుచుండెడివి. ఆమె దివ్యమూర్తి భక్తులకు శ్రద్ధాభక్తులను, దుర్బలమానసులకు ఆత్మవిశ్వాసమును, దుఃఖితులకు శాంతిని, చేకూర్చెడిది.

ఆమె దెంత గొప్ప వ్యక్తిత్వమో గమనింపుడు— ఒక శిష్యుడు చెడునడత నడచెనను కారణముచే నాతనిని సన్నిధికి రానీయవద్దని అప్తులు చెప్పగా మాత ఇట్లనెను. "నా బిడ్డ ధూళిలో బొరలాడుచుండ నేను దానిని దులిపి యెత్తుకొనుట నా ధర్మము గాదా." వేరొకపు డొక స్త్రీ తానొనర్చిన పాపములకై పశ్చాత్తాపముచెంది తన దోషములు తెలిపెను. ఆమెను కౌగలించుకొని తల్లి "అమ్మా! నిరాశ చెందకు. నీ పాపములనుండి తప్పక విముక్తి చెందగలవు" అని అభయమిచ్చెను. ఒకనా డామె ధ్యానముననుండగా పొరుగున నొకడు తన భార్యను చావగొట్టసాగెను. మాతృదేవి ధ్యానమాపి వెంటనే పరుగిడి మిద్దెపైకి బోయి వానికి వినబడునట్లు "ఓయీ పశువా! ఆ పిల్లను చంపివైచెదవా యేమి?" అని అరచెను. ఆమెను చూడగానే పాము వలె భార్యపై బుసకొట్టుచు పగబట్టియుండి కూడ అతడు అటనుండి పిల్లియై పారిపోయెను.

శిష్యు డంపిన కూరగాయ లొక వనిత తెచ్చి యీమె కిచ్చెను. రాత్రి ప్రొద్దుపోయినందున ఆమె మాతయింటనే బసచేసెను. ఆ కూలి యీమె జ్వరముతో వాంతి చేసుకొనెను. తల్లి యది చూడగానే తానే

దాని నెత్తివైచి ఆ స్థలమును నీటితో శుభ్రము చేసెను. అమ్జద్ అను మహమ్మదీయున కామె యింట నన్నము పెట్టిరి. భోజనము ముగియగనే అతడు భుజించిన యాకు నెత్తి వైచి ఆ చోటును తానే శుద్ధి చేసెను. చూచితిరా ఆమె విశ్వమానవప్రేమ!

బృందావనమందును కాశీయందును ఎందరో సాధువులు భిక్షాటనము చేయుచుండుట ఆమె చూచెను. వెంటనే ఆమె "శ్రీరామకృష్ణుని తలచుకొని మీ శిష్యులయిన యెందరో సాధువులు చెట్లక్రింద వాసము చేయుచు ఇంటింట తిరిగి బిచ్చమెత్తుకొనుచు గూడ కడుపుల నిండక అల్లాడుచున్నారు. మీ నిమిత్తమై తమ సర్వస్వము ధారవోసిన నా బిడ్డలు పట్టెడన్నమునకై మొగమువాచుట నేను చూచి సహింపలేను. స్వామీ! వారి కన్నవస్త్రములకు లోటురాకుండ అనుగ్రహింపుడు. మిమ్ములను, మీ బోధలను ఆశ్రయించుకొనియున్న నా బిడ్డలు కలిసిమెలిసి జీవింతురుగాక! సంసారపీడితులగు జనులు వారివద్దకు వచ్చి వారివలన మీ దివ్యవాణి విని ఆత్మశాంతినంది ధన్యతగాంచెదరుగాక!" అని విలపించెను.

వాల్మీకి మహర్షి క్రౌంచపక్షిదంపతుల విలాపము చూచి ప్రకటించిన శోకమే శ్లోకమై శ్రీమద్రామాయణమునకు నాందియై యొప్పెను. అట్లే మన లోకమాత శోకము గూడ సార్థకనాముడు శ్రీ వివేకానందస్వామి, ఖండఖండాంతరములందు సంచరించి శ్రీరామకృష్ణ సేవాసంస్థలు స్థాపించుటకు బీజమై శ్లోకముగ రూపొందెను. ఈ విధముగా అతడు తన తల్లిదండ్రులు శ్రీ శారదారామకృష్ణుల ఋణమును వడ్డీతో తీర్చుకొనెను. ఆనాటి లోకమాత పరితాపమే నేడు నిస్వార్థ మానవసేవలో విశ్వఖ్యాతివహించిన ఈ మహాసంస్థలకు మూలమని యెందరెరుగుదురు?

ఆమె నిద్రాహారము లత్యల్పము. రాత్రి పదకొండుగంటలకు నిద్రించి యామె మూడుగంటలకే మేల్కొనును. వెన్నెలరాత్రులలో ఆమె నిద్ర రెండు మూడు గంటలు మాత్రమే. భుజించు ఆహారము గూడ చాల తక్కువ. సాదుగాటి సామాన్యపు చీరెమాత్రమే ఆమె ధరించెడిది.



# 16. తీర్థయాత్రలు

ఆమె తన జీవితమును తరచు తీర్థయాత్రలలో గూడ గడుపుచుండెడిది. అట్లు యాత్రలు చేసినకాలము ఇరువది యైదు వత్సరములు. ముందామె గయకు వెడలి తన గురుదేవుని యాజ్ఞానుసారము చంద్రాదేవికి పిండము వేసెను. బుద్ధగయలో సుప్రసిద్ధ బౌద్ధమఠము చూడగానే ఆమె హృదయమున దివ్యప్రేమ తరంగములు పొంగిపొరలెను. ఆమె విలపించుచు పరమహంస నిట్లు ప్రార్థించెను- "దేవా, నా బిడ్డలు తలదాచుకొనుటకు తావు, నివసించుటకు పూరిగుడిసె, ఈ మాత్రము భాగ్యమునకు గూడ నోచుకొనలేదా? వారికి గూడ నిట్టి మఠము సంప్రాప్తించుగాక!" అచిరకాలముననే శ్రీ రామకృష్ణుని అనుగ్రహముచే కలకత్తాలో బేలూరు మఠము శ్రీ రామకృష్ణ మఠసంస్థలన్నిటికి ప్రధాన కేంద్రముగా తలమానికముగా అవతరించెను.

తర్వాత నామె జగన్నాథయాత్ర చేసెను. శిష్యబృందముతో గూడ అక్కడ ఆమె యొక భక్తునింట బసచేసెను. ఆలయార్చకుడు మాతృదేవి నెక్కించి స్వామి సన్నిధికి కొనిపోవుటకై పల్లకిని తెచ్చెను. జగన్నాథునివద్దకు వాహనమెక్కి పోవుటయా యని పలికి తల్లి నిరాకరించి, వారివలెనే నడచిపోయి ఆ స్వామిని సేవించెను.

1909 లో ఆమె రామేశ్వరయాత్రకై వెడలి, తన యనుచరులతో చెన్నపురి చేరెను. దక్షిణదేశమున ప్రథమముగా ఆ నగరమున శ్రీ రామకృష్ణమఠము స్థాపించిన మహాత్యాగి శ్రీరామకృష్ణానందస్వామి మన లోకమాతకు భక్తిపూర్వకముగా అఖండస్వాగత మొసగెను. ఆమె అటనొక నెల గడపి మధుర దర్శించి రామేశ్వరము చేరెను.

ఉత్తరదేశమందువలె గాక దక్షిణమున దేవాలయములలో అర్చకులు తప్ప ఇతరులెవ్వరును గర్భాలయమున ప్రవేశింప రాదు. విగ్రహములు తాకరాదు. కాని వివేకానందస్వామి భక్తుడగు రామనాథరాజ మూలమున మాతృదేవియు అనుచరులును గర్భాలయమున కేగి రామలింగేశ్వరుని పూజింపగల్గిరి. ఆమె బెంగుళూరు చేరెను. రామకృష్ణాశ్రమ మంతకు ముందే అచట స్థాపితమయ్యెను. రైలు దిగగానే జను లామె నెరుగకున్నను ఆ మాతపై పుష్పవృష్టి గురిపించిరి. బాటలపై ఒత్తుగా పూలు పరచిరి. గురుదేవుని సందేశ మచట గూడ వ్యాపించెననుట కిది

తార్థ్యాణముగదా యని ఆమె ఎంతో సంతోషించెను. తిరుగుప్రయాణ ములో రాజమహేంద్రవరమున నొక్క దినమాగి గోదావరిలో గ్రుంకులిడి కలకత్తా చేరెను.

1912 లో కడసారి యా తల్లి కాశీయాత్ర చేసెను. అట నామె రెండు నెల లుండెను. అన్నపూర్ణా విశ్వనాథులను పూజించి రామకృష్ణాశ్రమము దర్శించెను. ఇది యావద్భారత దేశమందును వైద్యసేవకు పేరందినది. ఆ యాశ్రమవాసుల సేవను ప్రశంసించి పదిరూపాయల నా సంస్థకు విరాళముగా నిచ్చిన దా లోకమాత! ఈ యాత్రలలో గూడ తన పెంపుడు బిడ్డ రాధాదేవి నామె వీడలేదు సుడీ!

## 17. స్త్రీ సముద్ధరణము

గృహస్థజీవనమునకు గృహిణియే ప్రధానము. ఆమె ప్రేమ సహనము లచే మాత్రమే ఆ కుటుంబమున శాంతి, సంఘీభావము, నెలకొనును. గృహిణి స్వార్థరహిత సేవలే గృహమును స్వర్గతుల్యము చేయును. ఇట్టి గృహధర్మములను సమర్థతతో నిర్వహింపదగిన పరిజ్ఞానమును బోధించు విద్య బాలబాలికలకెంతో అవసరమని మన మాతృదేవి ఆశయము. తన పెంపుడుబిడ్డ రాధాదేవిని చేతిపనులతోబాటు ఉత్తమ విద్యను బోధించు బడికి ఆమె పంపెను. స్త్రీ విద్యచే తాను బాగుపడుటయేగాక తన బంధువులకు, ఇతరులకు గూడ జ్ఞానదానము చేయవచ్చునని ఆమె వల్కెడిది.

ఒకప్పు డామె యనెను—"పిల్లలు సదా పనిపాటలలో కాలము గడుపవలెను. ముఖ్యముగా బాలికలు ఊరక ప్రొద్దుపుచ్చరాదు. పనిలేకపో యినను వ్యర్థసంభాషణలతో తమ శక్తి సామర్థ్యములు దుర్వినియోగము చేసికొనరాదు. సోమరితనము చెడుగునకు పుట్టిల్లు. పోయినకాలము తిరిగి రాదు కదా!

తమ జాతికి సహజమైన యింటిపనులు స్త్రీలు నిర్వహించవలెనని ఆమె యుద్దేశ్యము. స్త్రీ విద్యకై స్త్రీ సముద్ధరణకొరకై, గౌరీమాయి, సోదరినివేదిత నెలకొల్పిన సంస్థలు, ఆమె యీ యాశయములకు



కార్యరూపములే సుమండీ! నివేదిత తర్వాత ఆమె యుద్యమమును కొనసాగించుటకు మాతృదేవి సుధీరను ప్రోత్సహించెను. స్త్రీల వసతి గృహము నిర్వహించుటకై కుటుంబములలో పిల్లలకు పాఠములు నేర్పి ధనము సంపాదించుటకు ఒక స్త్రీ నీమె యనుమతించెను. ఒకప్పు డొక శిష్యురా లాసుపత్రిలో మంత్రసానిపని నేర్చుకొన గోరగా గోలాప్‌మాయి మున్నగువా రగ్రజాతి స్త్రీల కిది తగదని ఆక్షేపించిరి. 'పలువురు దీనులకు సేవచేయు వీలుకలిగించు నాపని మంచిదే' యని మాతృదేవి ఆశీస్సులతో ఆమె కనుమతి నిచ్చెను. అర్హతగల స్త్రీలను బ్రహ్మచర్యదీక్షకై గూడ ప్రోత్సహించెడిది. పూర్తిగా స్వార్థరహితముగా ప్రజాసేవచేయుట కీ దీక్ష యొక్కటియే గదా అవకాశమిచ్చును.

"స్త్రీ సహజధర్మమగు మాతృత్వమును, అనగా బిడ్డల పెంపకమును చూచుకొనుచు, స్వజాతీయ సంస్కృతిని పోషించుచు మహిళలు తమ ఆశయమందును వర్తనమందును గూడ ఆత్మవ్యక్తిత్వమును ప్రేమను ప్రకాశింప జేయవలెనని ఆమె ఆకాంక్ష. అంధప్రాయముగా పురుషుల ననుకరింపరాదు. స్త్రీలు నిజముగా గృహలక్ష్ములై వెలయవలెను" అను తన లక్ష్యములను, స్త్రీ సంస్కృతియందలి విశిష్టతను ఉపదేశముల చేతకంటె తన ప్రవర్తనచేతనే మాతృదేవి ఋజువు చేసినది గదా!

పరమహంసకు ప్రాణములతో సమానమయిన శిష్యురాండ్రు గోలాప్ మాయి, గౌరీమాయి, యోగేన్‌మాయి, లక్ష్మీదేవి అనువారు. మాతృ దేవిని యావజ్జీవము ఆశ్రయించి ఆమె ఆదర్శములు నాచరణలోనికి తెచ్చిన వీరు మనకు, ముఖ్యముగ స్త్రీలకు, మిగుల సంస్మరణీయులు. గోలాప్‌మాయి 36 సంవత్సరములు ఆ మాతకు సర్వవిధముల తోడు పడుచు, ఆమె గృహకృత్యములు తానే నిర్వహించెను. యోగేన్‌మాయి కూడ ఇట్లే సేవచేసి మాతృదేవితో తీర్థయాత్రలు చేసెను. ఈమె సర్వసంగములు వదలి జపధ్యానములందును, మాతృదేవిని సేవించుట యందును మాత్రమే కాలము సార్థకము చేసికొన్న మహిళామణి!

ఆమె సాంగత్యమున మెలగిన మరొక ధన్యురాలు గౌరీమాయి. ఈమెకుగల పారమార్థికసంపదకు వ్యవహారదక్షత వన్నె పెట్టెను. వివా హము రోసి చిన్ననాటనే హిమాలయమున తపస్సు చేయనేగిన యీ

ధన్యురాలు, అది చాలించి వచ్చిన తర్వాత మాతృదేవితో సహబత్తుననే నివసించుచు శారదారామకృష్ణులను భక్తితో సేవించెడెది. మాతృదేవి యెడ తన గౌరవమునకు చిహ్నముగా శ్రీ శారదేశ్వర్యాశ్రమము కలకత్తాలో స్థాపించిన ఉదారచరిత్రురా లీమె. ఈ బాలికా విద్యాసంస్థ నేడు మూడుపూవు లారుకాయలుగా వర్ధిల్లుచున్నది. బాలికల కావశ్యకములగు కళలు, విద్యలు నేర్పుటయేగాక త్యాగము, భక్తి, పవిత్రత మున్నగు భారత జాతీయాదర్శములను వెల్గొందజేయు గృహశిక్షణమును ఇందు తపస్వినీమణులు గరపుచుందురు.

## 18. సందేశము

మాటలకంటె చేతలతోనే మహాత్ములు లోకమునకు ఎక్కువగా మంచిని బోధింతురు. ఆచరణలో గూడిన యుపదేశముల నిచ్చువారే గదా ఆచార్యులు! ఆమె మహోన్నతమగు ఆధ్యాత్మిక సమస్యలను అరటిపండొలిచిన రీతిని వివరించెడిది. మచ్చునకు కొన్ని మాత్రమే ఇందు ఉదాహరింతును.

బ్రహ్మవిద్యను గ్రహింప నర్హత సంపాదించుకొనుట చాల కష్టము. భక్తి మార్గమే జ్ఞానమార్గముకంటె సులభము. నీ యిష్టదైవమును గూర్చి ధ్యానింపుము, జపింపుము, ప్రార్థింపుము. మంత్రములందును శాస్త్రములందును ఏమున్నది? భక్తిచేతనే సర్వము సాధ్యమగును. తైలధారవలె సంతతము భగవంతునిపై ప్రవహించు ప్రేమయే భక్తి.

భగవానుని శరణుజొచ్చుటయే జీవులకు తరణోపాయము. మానవుని తెలివి ఏపాటిది? తన కొకటి కావలసియుండ దేవు నాతడు మరొకదానికై యర్థించును. కాని "అన్యథా చింతితం కార్యం దైవ మన్యత్ర చింతయేత్", "తానొకటి తలచిన దైవమొకటి తలచును" గదా! సమస్త వాంఛలను భగవత్పాదారవిందముల మ్రోల సమర్పించుటయే సర్వోత్తమము. మన కేది మేలో భగవంతుడే చేయును. కాని భక్తిజ్ఞానవైరాగ్యముల నిమ్మని మాత్ర మాతనిని ప్రార్థింపవచ్చును.

భగవానుని నైజము పసిబాలుని వంటిది. పసివాని చేతిలో పటిక బెల్లము ఉన్నదనుకో. అడిగినవారి కీయక వాడు దానిని మరొకరికి సులభముగా ఇచ్చివేయును. భగవంతుడు గూడ యావజ్జీవము తపస్సు



చేయువానికి మోక్షమీయక ఏ ప్రయత్నమును చేయనివాని కిచ్చును. ఇదే భగవదనుగ్రహము.

ఐనను మానవుడు కృషి మానరాదు. ఈశ్వరుడు తన సంకల్పమును మానవుల కార్యములద్వారానే వ్యక్తీకరించును- నెరవేర్చును గూడ. పూర్వజన్మకర్మముల ననుసరించియే ఫలితములు కల్గుచుండును. తీవ్ర సాధనలచే వానిని గూడ పరిహరింపవచ్చును. అంతయు స్వప్రయత్నము చేతనే ఫలించుననికాని, అట్లని ప్రయత్నమక్కరలేకయే భగవంతుడనుగ్రహించునని గాని తలపరాదు. ప్రతిపనియు ఫలితమును భగవంతునికే వదలి వేసి చేయవలెను. పని సానుకూలమయిన మన ప్రయోజకత్వమని విఱ్ఱవీగరాదు. అది చెడిపోయిన నేను పూజించుచున్న దేవుడే యీ దుష్ఫలిత మెందు కిచ్చినాడని నిందింపరాదు.

మనోనిగ్రహము, నిర్మలత్వము, పూనిక, నిష్ఠ అవలంబించి యే పని చేసినను విజయము తప్పదు. ఆత్మసాక్షాత్కారమునకై జపధ్యానములతో బాటు లోకహితకార్యాచరణము గూడ అవసరము. ధ్యానప్రార్థనలు కర్మాచరణమునకు చుక్కానివంటివి. పాండిత్యము, సాధనతో సమన్వయ మందినపుడే అది సార్థకము. కష్టములు కేవలము భగవత్ప్రసాదములు. మనపై దేవుని కరుణ కవి చిహ్నములు.

జీవితము **మూడునాళ్ళ**ముచ్చట. నేడున్న శరీరము రేపుండదు. బ్రదికి బట్టకట్టిన ఆ కొలది కాలము గూడ తాపత్రయ నిలయము గదా! ఈ విధముగా వివేచించి వివేక వైరాగ్యముల నలవరచుకొనినచో నిజమైన భగవద్భక్తి హృదయమున ఉదయించును.

## 19. నిర్యాణము

రాధాదేవి ప్రసవించు సమయమయినందున మన లోకమాత 1919 లో జయరాంబాటి వెళ్ళి ఒక సంవత్సరముండెను. ఆమెకు తరచుగా జ్వరము వచ్చుచుండెను. అందుచే శారదానందస్వామి ఆమెను చికిత్సకై కలకత్తాకు పిలిపించెను. యోగేన్‌మాయియు, గోలాప్ మాయియు ఆమెను గూర్చి "అయ్యో, అమ్మ జ్వరముచే ఎంత నల్లబడిపోయినది.

చర్మావృతమైన అస్థిపంజరము మాత్రమే మిగిలినది గదా!" అని దుఃఖించిరి.

ఒక ఆయుర్వేద వైద్యుడు మందిచ్చుచుండెను. అది భరింపరానంత చేదు. అందుచే నోరు పాడై ఆహారముగూడ చేదుగనే మారిపోయెడిది. రెండు నెలలు చికిత్స చేసినను గుణము కనుపింపలేదు. 103 డిగ్రీల జ్వరము. శరీరమంతయు మంటలు. ఈ భయంకర దీర్ఘవ్యాధి సమయమున ఆమె స్వభావము అచ్చముగా పసిపిల్లలవలె మారిపోయెను.

ఒకసారి శారదానందస్వామి అటకు వచ్చెను. తరచు మేలిముసుగుతో మాత్రమే అతనితో సంభాషించు తల్లి ఆతని చూడగనే సంబరముతో తనవద్ద కూర్చుండబెట్టుకొనెను. గడ్డముపట్టుకొని "చూడు నాయనా, వీరు నన్నెట్లు హింసించుచున్నారో? ఎంతసేపును తిను తినుమనుటయే"అని పలికెను. అతడు పాలు తెప్పించి తానే మంచిమాటలచే బుజ్జగించుచు ఆమెనోట కొంచెము పోసెను. తల్లి సంతసముతో "చూడు అతడెంత చక్కగా మాట్లాడుచున్నాడో, అబ్బ! దగ్గరనున్నవారు నన్నెంత తిప్పలు పెట్టుచున్నారు" అనెను.

ఇట్టిస్థితిలో ఉండి గూడ ఆమె అతిథిమర్యాద ఏమర లేదు. ఎవ్వరైన తన్ను జూడవచ్చిన భుజింపనిదే పోనిచ్చెడిది గాదు. ఒక నెలకు అంత్యదశ సమీపించుచుననగా తన గది నుండి ప్రక్కగదికి గురుదేవుని పటము మార్పించెను. నేలపైననే ప్రక్క వేయించుకొనెను. గురుదేవునికి నివేదింపని ఆహార మిట్టి స్థితిలో గూడ భుజింపలేదు.

ఏ బంధముతో ఇన్ని యేండ్లు మాతృదేవి తన్ను సంసారమున బంధించుకొనెనో ఆ రాధ బంధమును గూడ ఆమె చాలతేలికగా ఛేదించుకొనెను. ఆమె జీవితములో ఈ రాధోపాఖ్యానము మరువరానిది గదా! కొన్ని దినములకు తానుగతింతుననగా ఆమె రాధను గూర్చి పట్టించుకొనుటగూడ మానివేసెను. రాధ పిల్లను గూడ తనవద్దకు రానీయకుండ గట్టి కట్టడి చేసెను. ఒక శిష్యురాలు "అమ్మా, ఇంత వరకు రాధను మీరు వదలి యుండలేకపోతిరి గదా! రాధ లేనిదే మీ రెట్లు జీవింపగలరు?" అని పలుక లోకమాత కఠినముగా



"నా మనస్సు ఆమెనుండి మరలించుకొన్నాను. ఇక ఆమె ప్రసక్తి నెత్తవలదు" అని మందలించెను. దీనికి కారణము శారదానంద స్వామి తెలిసికొని నిర్విణ్ణుడై యిక మాతృదేవి జీవితాశ మనకు లేదని గ్రుడ్ల నీరు గ్రుక్కుకొనెను.

ఐదు దినములకామె సమాధి నొందుననగా అన్నపూర్ణ మాయి అను భక్తురాలామె వద్దకు వచ్చి పాదాభివందనము చేసి "ఇక మా గతి ఏమి" అని వాపోయెను. మాత వినబడీ వినబడని పలుకులతో "నీకేమి భయము, ఠాకూరును చూచితివి గదా. కాని మనశ్శాంతి గోరినచో పరుల నిందింపకు. నీ దోషములు గుర్తించుకో. లోకమున నీ కన్యు లెవ్వరును లేరు. సమస్త విశ్వము నీదే" అని ఆమె నొదార్చెను. ఇదియే మన మాత లోకమున కిచ్చిన చరమ సందేశము, పరమసందేశముగూడ.

తుది మూడుదినములలో ఆమె అంతర్ముఖురాలయ్యెను. శారదానందుని ప్రక్కకు పిలిచి "శరత్, నేను వెళ్లుచున్నాను. యోగేన్, గోలాప్ మరి ఇతరులను కాపాడు" అని అప్పగించెను.

మహాసమాధి నొందుటకు ముందు ఆమెకు శ్వాస యాడుట కష్టమయ్యెను. ప్రాణము వెడలిపోవునపుడు ముఖము, శరీరము చాల నల్లబడి సంకోచమందెను. కాని మహాసమాధి నందగనే యామె రూపము వికసించి మోము దివ్యతేజముతో ఢెలుగొందెను. దుర్గాదేవి విగ్రహమునకుగల బంగారుఛాయ, అనంతశాంతి, నైర్మల్యములు ఆమె ముఖమండలమున భాసించెను. 1920 జూలై 20వ తేదిన మన లోకమాత అఖండపరబ్రహ్మైక్యము నందెను. గంగాతీరమున బేలూరులో శ్రీ రామకృష్ణ మఠావరణమున మాతృదేవి శరీరమున కంత్యక్రియలు జరిగెను. శంఖ ఘంటాది ధ్వనులతో హారతినిచ్చిరి. దివ్యవాహనమున ఆమె శరీరముంచి భక్తులు భుజములపై వహించి నడచుచుండ శ్రీ రామకృష్ణశిష్యులు, వేలకొలది భక్తులు అనుసరించగా చందన కర్పూరములతో మాతృదేవి శరీరము అగ్నిజ్వాలలకు అర్పితమయ్యెను.

పలు దేశములలో నే డామె శిష్యులు వృద్ధిచెందుచున్నారు. పలు భాషలలో ఆ మాత చరిత్రలు వెలువడుచున్నవి. ఖండఖండాంతరములలో ఆమె జన్మదినోత్సవములు జరుపబడుచున్నవి. ఆమె పేర దేశమంతట అనేక బాలికా పాఠశాలలు గూడ స్థాపింపబడుచున్నవి.

మాతృదేవి యాలయములు మూడు మన దేశమున గలవు. అట మాతకు సమంత్రకముగా ప్రతిదినము పూజాదులు జరుగుచున్నవి. ఆమె దహనసంస్కారము జరిగిన తావున ఒక దివ్యాలయము గలదు. ఉద్బోధనకార్యాలయ పూజామందిరమున దేవిరూపపటము గలదు. ఈ రెండును కలకత్తాలోనివే. ఆమె జన్మస్థానము జయరాంబాటిలో ఆశ్రమముతో గూడిన ఒక ఆలయమును శారదానందస్వామి ప్రతిష్ఠించెను. ఇక్కడ తైలచిత్రితమగు నిలువెత్తు రూపపటము జీవకళలతో ఒప్పారుచు చూచువారికి ఇప్పుడు గూడ మన లోకమాత యచ్చటనే కూర్చుని మన యోగ క్షేమముల నరయుచున్నదా యని అనిపించును. ఎప్పటికైనను అటకు వెళ్ళి ఆ మాతను దర్శించుభాగ్యము మనలో ఎవరికో గదా!

## 20. మంగళము : మన కర్తవ్యము

బిడ్డలారా! విధిలేక లోకమాత జీవితచరిత్ర అను పర్వతమునుండి మనము దిగి భూమిపైకి రావలసిన సమయము వచ్చినది. ఎంత రమ్యమైనను కొండదిగి స్వస్థానమును చేరక తప్పదు గదా! కాని "ఎవ్వాడు జీవింప ననేకులు జీవింతు రట్టి వాని మనుగడయే మనుగడ." శారదాదేవిని బోలినవా రీ విశాల విశ్వమున ఒక్కరు జీవించినను చాలును.

"తే.గీ. పౌరుష జ్ఞానకీర్తులఁ బఱ గె నేని
వాని సంపదయొక పూటయైనఁ జాలు,
నుదరపోషణ మాత్రకై యుర్విమీఁదఁ
గాకి చిరకాలమున్న నే కార్య మగును!"

—భర్తృహరి యోగీంద్రుడు.

మనుష్యమాత్రున క- త్యవసరమైనవి పౌరుషము, జ్ఞానము, కీర్తి. పురుషకారమే అనగా మనుష్యప్రయత్నమే పౌరుషము. ఈ మూడు గుణములును పరోపకారము చేత మాత్రమే వృద్ధి పొందును. కాకికి మనకు భేదమిచ్చటనే గదా!

నే నెక్కువగా పద్యములు పేర్కొన్న భర్తృహరి తన సుభాషిత రత్నావళియను సూక్తి నిధిలో మూడు శతకములు రచించినాడు. అతడు గొప్ప చక్రవర్తి. భోగియైయుండిగూడ తుదకు విరక్తుడై సంన్య



సించి మహాయోగియైనాడు. తన అనుభవములన్నియు ఆచంద్రార్కము నిలచునట్లుగా పద్యరత్నములద్వారా మన కందించి కవిచక్రవర్తియైనాడు. ఆయన సూక్తులు మనమందరము కంఠములందు ధరింపవలసిన రత్నహారములు సుమండీ! అర్థతాత్పర్యములతో గూడ కంఠతః రావలసినవే! కాననే ఈ చరిత్రలో అక్కడక్కడ వానిని కూర్చుట జరిగినది. ఈ మాత చరిత్ర మేలిమి బంగారము. దానికి వన్నెగూర్చునట్టి వీ సూక్తి రత్నములు. ఈ మహాపురుషునివంటి వారే మన యీ శారదా రామకృష్ణులు.

లోకములో ప్రతివాడును తనకు, తన కుటుంబమునకు మాత్రమే సదా పాటుపడుచుండును. అందుకే ధనసంపాదన చేయుటకూడ సహజమే. "ధనమూలమిదం జగత్" గదా! అయినను ధనమే మనకు సర్వస్వము కారాదు. పరోపకారమున కుపయోగించినపుడు మాత్రమే ఆ ధనము సార్థకమగును. ధనము దొంగలపాలు కావచ్చును. కాని విద్యాధనము ఇతరులకు పంచియిచ్చిన కొలది పెరుగును సుమండీ! ముఖ్య విషయములు; శిఖరారోహణము అను మొదటి ప్రకరణములో స్థూలముగా చర్చించిన—తల్లి, తండ్రి, గురువు, దేవుడు—అను వానిని తెలిసికొనుటయే విద్య. ఒక్క తల్లిని గూర్చి తెలిసికొన్నను చాలును. కాని అట్టి తల్లి గూడ కేవలము తానుకన్న లేక పెంచిన బిడ్డల యోగ క్షేమములకై మాత్రమే పాటు పడుచుండుట లోకములో మనము చూచుచున్నాముగదా! తల్లిదండ్రులే బిడ్డలయెడ అంత శ్రద్ధ పూననిచో బిడ్డల గతి యేమగును?

కాని శ్రీశారదా శ్రీరామకృష్ణుల సంగతి లోకాతీతమయినది. తల్లికి గల గుణములన్నియు లోకమాతకు గలవు గాని లోకమాతలో గల గుణములలో నూరవవంతయినను కన్న తల్లికుండవు. లోకమాత లోకమంతయు తన బిడ్డలే యని నమ్మి దయాదాక్షిణ్యములతో వారి సేవ చేసిన విషయము మనము చక్కగా తెలిసికొన్నాము గదా! ఇన్ని మంచి గుణము లీమె కెట్లబ్బినవి? మంచినేలలో మొలచిన విత్తనమునకైనను త్రవ్వుట, నీరుపోయుట, కుదురుగట్టుట అను పనులు; అది చక్కగా మొలచి, దృఢముగా పెరిగి, పుష్పించి, ఫలించుట కవసరముగదా! వీనినే దోహదక్రియలు అందురు. శ్రీశారదాదేవి గూడ తల్లి దండ్రులనుండి సుగుణములతోనే పుట్టినను శ్రీరామకృష్ణుని చెట్ట

బట్టుట చేత మాత్రమే లోకమాత కాగల్గినది. ఇతరులవలె ఆమె తన భర్తను సంసారము చేయుటకే ఆకర్షించియుండిన ఆమె ఇప్పుడున్న మహోన్నత పర్వతశిఖరమున విరాజిల్లగలిగి యుండెడిదా? శ్రీరాముడు, శ్రీకృష్ణుడు దేవుని అవతారములే. కాని శ్రీరామకృష్ణుడు పరిపూర్ణ మానవుడై మెలగికూడ అవతారపురుషుడైనాడు. పోతనార్యుని యీ సూక్తికి మచ్చలేని యుదాహరణ మీ యోగిపుంగవుడు!

“తే.గీ. చేతులారంగ శివునిఁ బూజింపఁడేని
నోరు నొవ్వంగ హరికీర్తి నుడువఁడేని
దయయు సత్యంబు లోనుగాఁదలపఁడేనిఁ
గలుగ నేఁటికిఁ దల్లుల కడుపుచేటు!”

—సద్గుణ కల్పతరు వనదగు పరమహంస తన సహధర్మచారిణి యైన మన యీ తల్లిని తన ఉదారాశయములకు తగిన రీతిగా తీర్చిదిద్దు కొనగల్గుటలో ఆశ్చర్య మేమున్నది? ఆతడు లోకమునకు ప్రసాదించిన ప్రేమామృతకలశమే మన యీ మాత.

ఈ చరిత్ర చదివిన తర్వాత మన కర్తవ్య మేమి? మనము సాధింపదగినవి స్వార్థము, పరార్థము, పరమార్థము అను మూడు విషయములు. స్వార్థము అనగా స్వలాభము. ఇది ప్రతివానికి అవసరమే. కాని స్వార్థమునకు భంగము లేకుండ మనము చేతనయినంతవరకు పరార్థమునకు అనగా పరోపకారమునకు గూడ కృషి చేయవలెను. పరమార్థమనగా గొప్ప ప్రయోజనము. దీనినే కొద్దిగా వివరింతును—అర్థము అనగా హితము, ప్రయోజనము అని గూడ అర్థములు గలవు గదా! తనకు అనగా ఆత్మకు హితము కూర్చుకొనుటయే పరమార్థము. జన్మ మరణ దుఃఖములనుండి దూరమగుటకు ప్రయత్నించుటయే పరమార్థ చింత. ఆత్మ మోక్షముతో బాటు లోకకల్యాణముగూడ పరమార్థములో భాగమే సుమండీ! తన మోక్షమునకే గాక యితరుల మోక్షమునకు పాటుపడుట గూడ జ్ఞాని చేయుదగిన పని. జపము, తపము, భక్తి మొదలగు సాధనలు మన మోక్షమునకు తోడ్పడును. కాని ఈ లోకమున ఉన్నంతవరకు చేతనయిన రీతిగా ప్రజాసేవ చేసినపుడు మాత్రమే మనము మానవుల మనిపించుకొనగలము. ఈ గుణములు లేకపోగా దురాచారులగుటచేతనే గదా రావణాదులు రాక్షసులగుట సంభవించినది.



లోకమాత గావించిన బోధలను మన మాచరించి లోకమాతను మనము జీవింపచేసికొనవలసియున్నది సుమండీ!

వందే త్రైలోక్య జననీం, శారదాం ధీవిశారదామ్,
యస్యా స్సంకల్పమాత్రేణ గ్రంథోఽయం రచితో మయా.

బోలో భగవతీ శ్రీశారదామాతా కీ జయ్!
బోలో భగవాన్ శ్రీరామకృష్ణ కీ జయ్!!

* * *

# శ్రీ శారదా ప్రసంగములు

## (తృతీయ భాగము)

## పారమార్థిక సాధన

శిష్యుడు: అమ్మా! యోగాసనములను, ప్రాణాయామమును అభ్యసించుట మంచిదియా?

అమ్మగారు: ఈ సాధనల వలన అమానుష మహిమలు కలుగును. వానివలన సాధకుని పారమార్థికాభివృద్ధికి అంతరాయము కలుగును.

శిష్యుడు: ఒక పుణ్య స్థలము నుండి మఱియొక పుణ్య స్థలమునకు పోవుచుండుట మంచిదియా?

అమ్మ: ఏదైనా నొకానొకచోట మనస్సునకు నిలుకడ కలిగెనేని, తీర్థయాత్ర కవసరమే లేదు.

శిష్యుడు: ధ్యానము నాకసాధ్యముగా నున్నది. దయయుంచి నా కుండలినీ శక్తిని ప్రబోధింపుడు.

అమ్మ: కాలక్రమమున అదియే మేల్కొనును. జపమును ధ్యానమును చేయుచుండుము. కుండలినీ శక్తికి స్వయం వికాసము లేదు. ఎడతెగకుండ ధ్యానము సాగిన కొలది, మనస్సు చాల నిశ్చలమగును గనుక, ధ్యానమును విడిచిపెట్టుటకు నీవు ఇష్టపడవు. ధ్యానము చేయుటకు మనస్సు సుముఖముగా లేనిచో ధ్యానమునకు దానిని నిర్బంధపఱుపకుము. అట్టి స్థితిలో ప్రణామము లొనర్చి, ధ్యానాసనము నుండి లెమ్ము. నిజమగు ధ్యానము దానంతటదియే కలుగవలెను.

శిష్యుడు: అమ్మా! ఎందుచే మనస్సు స్థిరముగా నిలువదు? నేను భగవంతుని దలంప బ్రయత్నించినపుడు, మనస్సు ఇతరేతర విషయముల పైకి పోవుచుండును.

అమ్మ: మనస్సు ఐహిక విషయముల పైకి పోవుట తప్పు. 'ఐహిక విషయములు' అనగా ధనము, కుటుంబము మొదలగునవి. కాని మనస్సు సహజముగా మనము చేయుచుండు పనిని గూర్చి తలపోయుచుండును. ధ్యానము సాధ్యము కాని యెడల జపము చేయుము. జపము వలన పరమార్థము సిద్ధించును. మనస్సు ధ్యానమునకు సుముఖముగా నున్న

(1)

శ్రీ శారదా ప్రసంగములు
(తృతీయ భాగము)
పారమార్థిక సాధన

శిష్యుడు: అమ్మా! యోగాసనములను, ప్రాణాయామమును అభ్యసించుట మంచిదియా?

అమ్మగారు: ఈ సాధనల వలన అమానుష మహిమలు కలుగును. వానివలన సాధకుని పారమార్థికాభివృద్ధికి అంతరాయము కలుగును.

శిష్యుడు: ఒక పుణ్య స్థలము నుండి మఱియొక పుణ్య స్థలమునకు పోవుచుండుట మంచిదియా?

అమ్మ: ఏదైనా నొకానొకచోట మనస్సునకు నిలుకడ కలిగెనేని, తీర్థయాత్ర కవసరమే లేదు.

శిష్యుడు: ధ్యానము నాకసాధ్యముగా నున్నది. దయయుంచి నా కుండలినీ శక్తిని ప్రబోధింపుడు.

అమ్మ: కాలక్రమమున అదియే మేల్కొనును. జపమును ధ్యానమును చేయుచుండుము. కుండలినీ శక్తికి స్వయం వికాసము లేదు. ఎడతెగకుండ ధ్యానము సాగిన కొలది, మనస్సు చాల నిశ్చలమగును గనుక, ధ్యానమును విడిచిపెట్టుటకు నీవు ఇష్టపడవు. ధ్యానము చేయుటకు మనస్సు సుముఖముగా లేనిచో ధ్యానమునకు దానిని నిర్బంధపఱుపకుము. అట్టి స్థితిలో ప్రణామము లొనర్చి, ధ్యానాసనము నుండి లెమ్ము. నిజమగు ధ్యానము దానంతటదియే కలుగవలెను.

శిష్యుడు: అమ్మా! ఎందుచే మనస్సు స్థిరముగా నిలువదు? నేను భగవంతుని దలంప బ్రయత్నించినపుడు, మనస్సు ఇతరేతర విషయముల పైకి పోవుచుండును.

అమ్మ: మనస్సు ఐహిక విషయముల పైకి పోవుట తప్పు. 'ఐహిక విషయములు' అనగా ధనము, కుటుంబము మొదలగునవి. కాని మనస్సు సహజముగా మనము చేయుచుండు పనిని గూర్చి తలపోయుచుండును. ధ్యానము సాధ్యము కాని యెడల జపము చేయుము. జపము వలన పరమార్థము సిద్ధించును. మనస్సు ధ్యానమునకు సుముఖముగా నున్న

(2) సరి. కాని బలవంతముగా దానిని ధ్యానమునకు నియమింపకుము.

శిష్యుడు: ఏకాంత స్థలమున గాక మఠములోనో, కాని నగరములోనో యుండి పారమార్థిక సాధనలను చేయుట ఎక్కువ ప్రశస్తమా?

అమ్మ: ఋషీకేశము వంటి యేకాంత స్థలమున పారమార్థిక సాధనలను చేయుచూ నీ మనస్సు బలీయమై, అటుపిమ్మట నీ వెచ్చట నున్నను, నెట్టి సమాజములో నున్నను అది మాత్రము చలింపదు. మొక్క లేతగా నున్నప్పుడు దానికి కంచెయో తడికయో రక్షణకై యుండవలయును. కాని పెరిగి పెద్ద చెట్టయిన తరువాత, పశువుల వలన దానికెట్టి హానియు కలుగజాలదు. ఏకాంత స్థలమున పారమార్థిక సాధన బహు ముఖ్యము. ఆత్మ వికాసమునకై(?) ఏదైన సందేహముగాని చిక్కుగాని కలిగినప్పుడెల్ల, బయలు దేరినప్పుడెల్ల కన్నుల నీరు నించి భగవంతుని నీ హృదయమారా ప్రార్థింపుము. పరమేశ్వరుడు నీ మనోవేదనను నివారించి నీ సంశయము తీర్చివైచి, ఆత్మ వికాస మొసంగును.

శిష్యుడు: పారమార్థిక సాధనలను పొందజాలని నరుడను. మీ పాదపద్మములే శరణముగా గ్రహించితిని. నా యుద్ధరణమునకు అవసరమగు దానినెల్ల మీరే యొసగవలెను(?).

చేతులు జోడించి "శ్రీ గురుదేవుడు నీ త్యాగ శక్తిని కాపాడును గాక!" అని ప్రార్థించి, అమ్మగారిట్లు చెప్పిరి: "ఆయన నిన్ను జాగరూకులై(?) రక్షించుచున్నారు. నీవు భయపడ నక్కరలేదు. శ్రీ గురుదేవుల కార్యమును నిర్వహించుచూ, పారమార్థిక సాధనలను కూడ చేయుచుండుము. పని చేయుచున్నచో వ్యర్థాలోచనలెవియు కలుగవు. ఏ పనియు లేనివానికి అట్టి ఆలోచనలు కుప్పలు తెప్పలుగా బయలు దేరుచుండును.

శిష్యుడు: నా ఆరోగ్య రక్షణకై కొన్నాళ్ళనుండి నేను యోగాసనములు అభ్యసించుచున్నాను. ఆహారమును తగ్గించుకొనుటను, బ్రహ్మచర్య వ్రతావలంబనకును యోగాసనములు తోడ్పడును.

అమ్మ: ఆ విషయమున నీవింక జాగరూకుడవై యుండుము. నీవట్టి పనులను చాల కాలము చేయుచుండుచో,

(3) నీ మనస్సునకు శరీరమునందు సత్తువ కలుగవచ్చును. ఇట్టి నిత్యాభ్యాసములను విడిచి పెట్టినచో నీ యారోగ్యమునకు భంగము కలుగవచ్చును. కనుక నీవీ విషయమున వివేకముతో ప్రవర్తింపవలెను.

శిష్యుడు: అమ్మా! నేను సాధనకు దినమునకైదు లేక పది నిమిషములవరకు మాత్రమే దీర్ఘశక్తి(?) కొరకు చేయుచున్నాను.

అమ్మ: మంచిది. యోగాభ్యాసము కొంత కాలము చేసి పిమ్మట విడనాడుచో, చివరకు నీ యారోగ్యము చెడవచ్చునని హెచ్చరిక చేసితిని. నాయనా! నీకు బ్రహ్మజ్ఞానము కలుగుగాక యని ఆశీర్వదించుచున్నాను.

శిష్యుడు: నేను ప్రాణాయామము కూడ కొంచెము చేయుచున్నాను. నేనా సాధనను చేయుచుండవచ్చునా?

అమ్మ: చేయుము. కొంచెముగా చేయవచ్చును. కాని ఎక్కువగా చేసినచో, మెదడును నరములను, [illegible] ములను. మనస్సు దానంతట అదియే స్థిమితపడుచో, నిత్యప్రాణాయామమెందుకు?

శిష్యుడు: అమ్మా! కుండలిని శక్తి మేల్కొనకపోయినచో, లాభమేమియు లేదు.

అమ్మ: నాయనా! అది యెంత నిజము. కుండలిని శక్తి క్రమక్రమముగా మేల్కొనును. భగవన్నామోచ్చారణము వలన నీకు సర్వమును లభించును. మనస్సు స్థిరముగా నిలువకున్నను కూడ, నీ నాలుకతో గూర్చుండి భగవన్నామమును పదిలక్షల సార్లు జపించవచ్చును. కుండలిని మేల్కొనుటకు పూర్వము అనాహత నాదము వినబడును: కాని (శ్రీ) విశ్వేశ్వరి కటాక్షము లేనిచో యేదియు సిద్ధింపదు (నేటి వేకువజామున బహుశా శివదర్శన ప్రాప్తి నాకు కలుగునని తలంచుచుంటిని)

శిష్యుడు: అమ్మా! శిలావిగ్రహముతో మాకు తృప్తి కలుగదు.

అమ్మ: ఎంతమంది పాపులు కాశీకి వచ్చి, ఆ శివవిగ్రహమును తాకి ముక్తులగుచుండుట లేదు? ఆ మహాదేవుడు కొంచెమైన గొణుగుకొనకుండ అందరి పాపములను తన మూపున మోయుచున్నాడు.

భక్తుడు: పారమార్థిక సాధనలకెట్టి స్థలము తగినది? సాధకుడా సాధనలనెట్లు చేయవలయును?

అమ్మ: నీకు తగిన స్థలము కాశి. మనస్సును భగవంతుని పాదారవిందములందు స్థిరముగా నిలుపుటయే, భగవ [illegible] లను యోజనలందు మనస్సు తగిలి యుండు

(4) నట్లు చేయుటయే పారమార్థిక సాధనల ప్రయోజనము.
ఆ పావన నామస్మర~~ణ~~ణను చేయుచుండుము.

భక్తుడు: జీవిత లక్ష్యమేమి?

అమ్మ: భగవత్సాక్షాత్కారము బడసి, తదేక ధ్యాననిమగ్నులై యుండుటయే మానవుల జీవిత లక్ష్యము. మీరు సన్న్యాసులు, భగవంతుని సొంతమని చెప్పదగినవారు. ఇహమందును పరమందును కూడ మీ ఆధ్యాత్మిక శ్రేయస్సును పరమేశ్వరుడు కాపాడుచుండును. మీరిక దేనిని గూర్చి ఆందోళన పడవలయును.

- నిరంతరము భగవంతుని ధ్యానము చేయుట సాధ్యమగునా? కొంతకాలము పని చేయుడు. తీరిక వేళల భగవంతుని ధ్యానింపుడు.

అమ్మ * నీవెల్లప్పుడును భోగవిషయముల చెంత నుండుచూ, వానికి వశుడవు కావచ్చును.

* దురహంకారులై జనులు తామే స్వతంత్రులుగ సర్వము చేయుచున్నట్లు తలంతురు. భగవంతునిపై ~~[illegible]~~ వారాధారపడనే పడరు. పరాత్పరుడు తనపై నాధారపడువారిని రక్షించును.

* సాధకుడెంతగా పారమార్థిక సాధనలను చేసిన నంత త్వరితముగా భగవత్సాక్షాత్కారమును బడయును. అట్టి ఆధ్యాత్మిక సాధనము కూడ చేయక పోయినను, చిట్టచివరకు ముక్తి నొందును. ఇది నిజము. కాని ధ్యాన ప్రార్థనలను చేయక కాలమును వృథా చేయువారికి, పరమార్థానుభూతి కలుగుటకు ఆలస్యమగును. పారమార్థిక సాధనలనే చేయుటకై నీవు సంసారమును పరిత్యజిం~~[illegible]~~ [illegible]. కాని నీవీ సాధనల నెల్లప్పుడు చేయజాలవు కనుక సత్కర్మ లొనర్చుట యావశ్యకము. ఆ కర్మలను శ్రీ గురుదేవుడే నీకు నిర్ణయించెనని నీవు భావింపవలయును. కఠిన నియమ బద్ధమైన జీవితము నీకు మంచిది కాదు, కడుపునొప్పిచే బాధపడుచుందువు. నీ యాహారము విషయమై జాగ్రత్తగా నుండుము.

- గాలి మేఘముల నెగుర గొట్టునట్లు, భగవన్నామము సంసార విషయజాలమను మబ్బును పటాపంచలు చేయును.

- కేవలము పుస్తకము చదువుట వలన నెవరికైన భగవంతుని యందు నమ్మకము కలుగునా? అమితముగ గ్రంథపఠనము వలన, చిత్త విభ్రమము మాత్రము కలుగును. బ్రహ్మమే సత్యము, సంసార మనిత్యమను విషయమును గ్రహించుటకు మాత్రమే మానవులు మతగ్రంథములు చదువవలయును. కొన్ని వస్తువులను నా కొరకు తీసికొని రమ్మని నీకొక యుత్తరము వ్రాసితి ననుకొనుము. ఆ యుత్తరము నీ కెంత కాలము అవసరము? దానిలోని సంగతులు నీకు తెలియునంత వరకే కదా!

(5) అందలి విషయములు నీకు తెలిసిన తరువాత, నీకా యుత్తర
* మెందుకింక? అప్పుడు నీవా వస్తువులను సేకరించి నా కడకు వత్తువు. అట్లు కానిచో నా యుత్తరమును రేయింబవళ్ళు చదువుట వలన లాభమేమి.

- మానవుని బుద్ధి అత్యల్పము. తనకు కావలసిన దొకటియై యుండ, వేరొకటి కోరును. వినాయకుని చేయబోయి చివరకు కోతి బొమ్మను చేయును. కనుక కోరిక లన్నిటిని భగవంతుని పాదారవిందముల కడ సమర్పించుటయే యుత్తమము. మనకు బహు శ్రేయస్కరమైన దేదియో ఆ పరమేశ్వరుడే మన కొసగును. కాని మానవులు భక్తి, వైరాగ్యముల కొరకు భగవంతుని ప్రార్థింపవచ్చును. ఇవి కోరికలలో చేరవు.

- నిజముగా భగవత్సాక్షాత్కారమును కోరువారెందరు కలరు. అందుకు కావలసిన శ్రద్ధ యెక్కడున్నది.

- నాయనా! ఈ సంసారము అగాధమైన బురద మడుగు వంటిది. అందొకసారి చిక్కుపడినవారు మరల బయటకు వచ్చుట బహు కష్టము: బ్రహ్మ, విష్ణువు లంతటివారికి గూడ మతులు పోవును. ఇక మానవులను గూర్చి చెప్పుటకేమున్నది! భగవన్నామస్మరణ చేయుచుండుము. నీవట్లు చేయుచో, ఆ పరమేశ్వరుడెప్పుడో యొకనాడు బంధవిముక్తుని గావించును. నాయనా! పరాత్పరుడే యీ బంధములను తొలగింపకున్న, నెవరికైన ముక్తి లభించునా! భగవంతుని యందు పరిపూర్ణమైన నమ్మకము నీ కలిగి యుండుము. పసిబిడ్డ లెట్లు తమ తల్లిదండ్రులే తమకు దిక్కని భావింతురో, భగవంతుని అట్లే భావింపుము.

- ధ్యాన, జప, ప్రార్థనలను గూడ చేయుట మిక్కిలి యావశ్యకము. ఉదయమునను, సాయంకాలమునను, ఈ సాధనలను చేయవలయును. [illegible] ఈ సాధన మానవ జీవితమునకు మిక్కిలి యుపకరించును. సాయంకాల ప్రార్థనకై కూర్చుండునప్పుడు, సాధకుడా పగలంతయు తాను సత్కర్మలు చేసెనో, పాపకర్మల నాచరించెనో వివేచన చేయవచ్చును. పిమ్మట నా[illegible]నాటి తన మానసిక స్థితిని, ముందటి నాటి తన మానసిక స్థితితో పోల్చి చూచుకొనవలయును. ఇంతేకాక, అతడు జపమొనర్చునప్పుడు తన యిష్టదైవ మూర్తిని ధ్యానింపవలెను. ధ్యానమునందు మనకు మొట్టమొదట

⑥ తను పడునదిమన ఇష్టదేవత ముఖము. అంతలో
తృప్తిపడక మన మా మూర్తి నాపాద మస్తకము
ధ్యానింపవలయును. మా మా పనులతోపాటుగా
నుదయమునను, సాయంకాలమునను మూల ధ్యానము
చేసినచో తప్ప, మూల చేయునది సత్కర్మంబో,
పాపకర్మంబో మాకెట్లు తెలియగలదు.

ప్ర:- పారమార్థిక జీవితమున ధ్యాన జపముల వలననే
కృతార్థులము కాగలము, కాని కర్మ వలన మనకేమి
దియు సిద్ధింపదని కొందరందురు.?

జ:- ఏ కొలదినాళ్ళ ధ్యాన జపము లభ్యసించు సాధ
కునకు సర్వము లభించునా? మహామాయ దయ
యుంచి, పరమార్థసిద్ధికి గల అడ్డంకులను
తొలగించినచో తప్ప ఏవరికి, ఏమియు లభింపదు.
బలవంతముగా మరి మరి ధ్యానము, ప్రార్థనలను
చేయుటచే నొకనికి మతి చెడిపోవుటను మీరు
చూడలేదా? మతి చెడిన తరువాత మనిషి జీవిత
మే నిరర్థకమగును. మానవుని మనస్సు ఒక సూక్ష్మ
మైనది. ఏ మాత్రము లోపము జరిగినను వెంట
వానిపైన సున్నాదుని చేయును. భగవంతుని నెల్లప్పుడు
స్మరించుచు సరియైన జ్ఞానము కొరకెల్లరును వాని
ప్రార్థించుచుండవలయును. నిరంతరము ధ్యాన
జపములను చేయగలవారెందరున్నారు. కొందరారం
భమందు పట్టుదలతో ఈ సాధనలను చేయుదురు
కాని, ఎల్లప్పుడును బిట్రాసనములపై కూర్చుండుట
వలన, వారి తల ~~...~~ వేడెక్కి, గర్వాంధులై వివిధ
విషయముల పైకి మనస్సు పోయి అనేక చింతలతో
బాధపడుచుందురు. యథేచ్ఛగా మనస్సును తిరుగ
నిచ్చుట కంటె పని చేయుచుండుటయే చాల మంచిది.
అటులగ నిలుకడలేక తిరుగుటకు అవకాశమిచ్చిన
మనస్సు వలన కలవరము కలుగును. ఈ విష
యము లన్నిటిని నాలోచించియే [illegible]
జనులకు నిష్కామ కర్మ చేయుటకై వేలను,
సంస్థలను నిర్మించెను. ఒకబాటుతో ఎల్లప్పుడు

⑦ కూర్చుండుటచే నతడు తన మనస్సు నెట్లు మలిన
పరచుకొనుచున్నాడో నీవు చూచుచునే యున్నావు.
అతని చాంధస భావములును, మూఢ విశ్వాసములును
నానాటికి హెచ్చు పెరుగుచున్నవి. అతడెల్లప్పుడును తన
మనోవ్యథలను గూర్చి మొఱపెట్టుచుండును. అంత చింత
యెందుకుండవలయును? ఈ యనుభవము
లన్నిటివలన నతనికి జ్ఞానోదయము కలుగజాలదా?

- నిరంతరము ధ్యానము వలన మనస్సున కేకాగ్రత
కలుగును. ఎల్లప్పుడును నిత్యానిత్య వస్తువివేచన
చేయుచుండుము. ఎప్పుడైన నే విషయముపైనను
నీ మనస్సు పోవుచున్నట్లు తోచెనేని, ఆ విషయా
నిత్యతను గూర్చి తలపోసి నీ మనస్సును దాని
నుండి భగవంతుని వైపునకు మరలింప బ్రయ
త్నింపుము. ఒక మనుష్యుడు గాలము వేసి
చేపలు పట్టుచుండెను. ఆ మార్గమున నొక
పెండ్లి యూరేగింపు తాళమేళములతో పోవుచుం
డినను కూడ, వాని దృష్టియంతయు గాలము ముల్లు
పైననే నిలచియుండెను. ఊరేగింపును కొఱకంటి
తోనైన నతడు చూడకపోయెను.

ఆధ్యాత్మిక సాధనలు చేయుటకు తగిన
చోటు నేర్పరచుకొనవలయును.

- ఏకాగ్రముగ నీ మనస్సు నిలచినను సరే, నిలువకు
న్నను సరే, భగవన్నామ స్మరణ చేయుచుండుము.
ప్రతి దినము నిర్ణీత సంఖ్య(ప్ర)కార మీ నామజపము
చేయుచుండుట నీకు శ్రేయస్కరము.

- జపసంఖ్యయందే దృష్టియుంచి జపము చేయుచో
నీ మనస్సు సంఖ్యపైననే నిలువ వచ్చును. కనుక సంఖ్య
కు ప్రాధాన్యమున పాటింపక, నీవు భగవన్నామ జప
ము చేయుట మంచిది.

- జపము చేయునప్పుడు మనస్సు క్రమముగా లీనమ
గును. ఏకాగ్రముగా మనస్సు నిలువకున్నను, నామ
స్మరణ మానవలదు. విధాయకముగా నీవు చేయు

(8) వలె ఒనపని చేయుచుండుము. నామస్మరణ చేయు
నప్పుడు మనస్సు [illegible], గాలి తగులకుండ
ఒకచోట నుంచిన కొవ్వొత్తి దీపము వలె, భగవం
తుని పై స్థిరముగ నిలుచును. దీపము గాలికి చలించి
కొట్టుకొనును. ఇట్లే మన కర్మలును కోరికలును
మనస్సును చెదరగొట్టును. మంత్రోచ్చారణ సరిగా
లేని యెడల కోరిన చిత్తమున ~~[illegible]~~ కోర్కెలు
చేకూరుట ఆలస్యమగును. వెనుకటి కాలస్త్రీకి,
రుక్మిణీ నాథాయ అను పవిత్ర నామము నుచ్చరింప
గురువు బోధించెను. కాని ఆమె అంత పెద్దమాట
నుచ్చరింపలేక 'రుమిణి, లమిణి' అని స్మరణ
చేయుచుండెను. అందువలన నామెకు కొన్నాళ్ల
వరకు అభివృద్ధి కలుగలేదు. కాని కొంతకాల
మైన తరువాత భగవదనుగ్రహము వలన నామెకు
సరియైనమాట స్ఫురించి, జపము ఫలించెను.

- స్వగృహము నందున్నపుడు సాధకుడు భగవన్నామ జపము
ను చేయుటకు ముందు సాత్త్వికంగా తన నోటను కదుప
కానవలయును. పరస్థలమున ఉన్నప్పుడు, [illegible]
[illegible], ఉచ్చరింపవలయును.
మనో నిగ్రహము తో భగవన్నామమును నాలుకతో
జపించుట, భగవచ్చరణము కాని మనస్సులో [illegible]
జపించుట కంటె చాల మేలు. అన్య విషయముల పై
మనస్సునుంచి నేను దినమంతయు నామ జపము
చేసినను దాని వలన విశేష లాభము కలుగదు.
మనస్సు నేకాగ్రముగా నిలిపి జపము చేసినప్పుడే
మనకు భగవదనుగ్రహము కల్గును. భగవత్సాక్షా
త్కారము కాలక్రమమున కలుగును. భగవాని నియం
ను శక్తి కలిగి వారి పాదారవిందముల యందే
శరణాగతము. నిన్ను నిరంతరము రక్షించుచున్న
తల్లిగాని తండ్రిగాని యెవరో [illegible] కున్నారని
జ్ఞప్తియుంచుకొనిన చాలును.

(9)
- పారమార్థిక సాధన వలన నియమిత కాలము లేదు.
సాధకుడు తప్పక సాధన చేయవలయును.
- పనిలో మునిగి తేలుచున్నను, మన మనము భగవం
తుని స్మరించి నమస్కరించుచుండవలెను.
- సాధన కుత్తమ కాలము: రేయుంబవళ్ళ సంధ్యా
కాలము భగవద్ధ్యానమునకు మిక్కిలి యనుకూలము.
రాత్రి యంతరించి పగలు ప్రారంభమగును; దినమస్త
మించి రాత్రి ప్రారంభమగును — ఇదియే దివారాత్ర
ముల సంధి. ఈ సమయములలో మనస్సు నిర్మల
ముగా నుండును.
- మనో దౌర్బల్యము: ఇది ప్రకృతి నియమము. పూర్ణిమ,
అమావాస్యలను సముద్రము పొంగుచున్నది కాదా? ఇట్లే
మనస్సు కొన్ని వేళలందు మంచి సంస్కారములతోను,
~~[illegible]~~
మరికొన్ని వేళలందు చెడుసంస్కారములతోను ఊగను
చుండును.
- మానసికముగా మంత్రము నుచ్చరింపుము. [illegible]
నాలుకయును క్రమక్రమముగా పనిచేయుట మాని
వేయును. మనస్సు మాత్రమే పని చేయుచుండును.
చివరకు మనస్సు నణగును.
- విడువకుండ జపము భ్యసించువారికి భగవత్సాక్షాత్కా
రము కలుగును.
- అపారనిష్ఠ నభ్యసించుచున్నంత మాత్రమున నెవరికైన
భగవత్సాక్షాత్కారము తప్పక కలుగవలెనను నియమమే
దియు లేదు. పూర్వకాలమున ఋషులు వేలకొల
దియేండ్లు తలక్రిందుగా, నడుమున నగ్నిజ్వాల
నుంచికొని ఘోర తపము చేసిరి. అట్లయినను వారి
లో ~~[illegible]~~ నే కొందరికి మాత్రమే భగవత్సాక్షాత్కారము
కలిగెను.

ప్ర — (భగవత్సాక్షాత్కారము) భగవద్దర్శనము ఎట్లు కలుగును?
జ: కేవలము భగవంతుని దయవలననే. కాని సాధ
కుడు ధ్యానమును, జపమును చేయుచుండవలెను.
అందువలన చిత్త శుద్ధి కలుగును. ఆరాధనాది

పారమార్థిక సాధనలను ముముక్షువులు చేయుచుండవలెను. పుష్పము చెట్టు కొమ్మ కాని ఆఘ్రాణించువారికి దాని పరిమళ మెట్లు తెలియును? సానపై గంధపు చెక్క నరగదీయువారికి మంచి గంధపు వాసన యెట్లనుభవైక వేద్యమగునో అట్లే నిరంతరము భగవంతుని దలంచుచుండువారికి ఆధ్యాత్మిక వికాసము కలుగును. కోరికలన్నియు విడనాడుడు వేని, నీవే క్షణముననే భగవత్సాక్షాత్కారము బడయగలవు.

- ఉదయము, సాయంకాలము నను ధ్యానమునకు కూర్చుండుము. ఉద్రేక మేమియు లేని చల్లని మనస్సుతో, ధ్యాన ప్రార్థనల నభ్యసింపుము. ఇట్లు చేయుట బహు కష్టము. ఇదికంటె నాకాశ పుష్పు కోసి మట్టిని త్రవ్వుట యెంతయో సులభము. భగవంతుని దయలేక నీ కేమియు లభింపదు.
- కొంత కాలమైన తరువాత నీ మనస్సే నీకు గురువై జ్ఞాన వికాసము కలుగజేయునని గ్రహింపగలవు.
- ఓ! మానవులారా! భగవంతుని శరణు జొరుడు. సర్వము వానికి సమర్పించి వాని శరణు జొరుడు! ఆపుడే మహామాయ కనికరించి ముక్తికి దారి చూపును.

ప్రశ్న: సంసార మందేమి సుఖమున్నదో స్వానుభవము వలన నీవు గ్రహించిన విషయమే కదా! సంసార మందేల ఇంత వ్యామోహము? ఇంత పశుప్రవృత్తి యేల? దీనివలన నీకు కలుగుచున్న సుఖమెట్టిది? ఆదర్శనీయమైన పవిత్ర జీవనమును నీవు కలలోనైన నూహించుతెవా? నీవును నీ భర్తయు నిప్పటికైన సోదరి సోదరులవలె జీవింపలేరా? పందులకు తగిన జీవనముపై నింత భ్రమ యేల? ఈ ప్రపంచ దుఃస్థితి జూడ నాకు మరణవేదన వలె నున్నది. "బ్రహ్మచర్య మవలంబించి పవిత్ర జీవనము గడుపువారికి, వారు ప్రార్థించినను సరే, ప్రార్థింపక పోయినను సరే భగవత్సాక్షాత్



కారము చాలా త్వరితముగా కలుగును. ఇతరులు సంసార పాశ బద్ధులగుటచే, భగవంతుని ధ్యానింప బ్రయత్నించినను వారికి కాపని కష్టమనిపించును."

సన్యాసి తల్లికి హితోపదేశము:- "సన్యాసికి తల్లిగా నుండుట అనన్య సామాన్యమగు మహాభాగ్యము. చూచి చూచి జనులొక యిత్తడిగిన్నెను కూడ విడిచిపెట్టలేరే! దానిపై వారికి మమకారము పోదే? ఇట్టి స్థితిలో సంసారమును విడిచిపెట్టుట సులభమా? అటువంటి సుపుత్రుని తల్లివి నీవు. నీవెందుకు చింత పడవలయును? అతడు సాధువైనను నీ యోగక్షేమము కనిపెట్టుచుండును.

- ఈ కలియుగములో మానసిక పాపము పాపమేం కాదు. ఈ విషయమున చింతల నెల్ల విడనాడుము.
- గృహస్థులకు బహిరంగ త్యాగము క్కర లేదు. అంతరంగిక త్యాగము వారికి దానంతటదియే లభించును. కాని కొందరికి విషయములలో బహిరంగ త్యాగ మావశ్యకము.
- మనసున సహజముగ పాపకార్యములు చేయ కోరుచుండును. సత్కర్మాచరణయందది నేమరి. సత్కర్మలను జయప్రదముగ నాచరింపవలయునని, నోరిమియు పట్టుదలయు నావశ్యకములని నేను చెప్పుచుంటిని. 'పరమేశ్వరా! చంద్రునకు గూడ కళంకమున్నది. నా మనస్సునెట్టి కళంకము గాని లేకుండునట్లు గ్రహింపుము' అని ప్రార్థించెడివాడను.

ప్ర: భగవంతుడే మనకందరికిని తల్లియు దండ్రియునైన యెడల, మనచే పాపమేల జేయించుచున్నాడు?

జ: నిజమే! ఈ చరాచర జీవులెల్ల భగవంతుడే. కాని భౌతికాత్మక ప్రపంచములో జీవులు తమ తమ ప్రకృతి కర్మలకును ఆంతరంగిక సంస్కారములకును అనుగుణముగా వ్యవహరించుచు సుఖదుఃఖము లనుభవించుచున్నారు. ఒకే సూర్యుడాయా వస్తు స్థలములను బట్టి. వేర్వేరు విధములుగా ప్రకాశించుచున్నాడు.

ప్ర: సర్వము భగవత్సంకల్పము ప్రకారమే జరుగుచున్న యెడల, కర్మ సూత్రమును తప్పించుకొనుటను

భగవంతుడు మనకేల సాయము చేయుచున్నాడు?

శిష్యు: ఔను. భగవదనుగ్రహమున్న యెడల, మన ఆధ్యాత్మిక వికాసము త్వరలో చేకూరును. కాని మనకు వారి సంకల్పము తెలియదు. ఈ కర్మ సూత్ర ఫలితముగా యొకసారి శ్రీ రామకృష్ణులు కూడ బాధపడ వలసినవారైరి; వారు కూడ పూర్వ కర్మ ఫల మనుభవింపక తప్పినది కాదు.

శి: భగవన్నామ జపము వలన ప్రారబ్ధ కర్మ ఫలమును తప్పించుకొన వీలగునా!

మా: ఎవ్వరైనను ప్రారబ్ధకర్మఫల మనుభవింపక తప్పదు. దాని నెవరును తప్పించుకొనజాలరు. కాని భగవంతుని పవిత్ర నామ జపము వలన, స్మరణ వలన దాని తీవ్రత తగ్గును. ప్రారబ్ధమును బట్టి కాలు పోవలసినవారికి భగవద్ధ్యాన ఫలితముగా పాదములో నొక ముల్లు గ్రుచ్చుకొనుటతో పరిపోవును.

- ఈ కలియుగమున సత్యవ్రతమునకు మించిన తపస్సు వేరొండియు లేదు. సత్యవ్రత భంగము లేకుండ నడచుకొనువారు భగవత్సాక్షాత్కారము బడసెదరు.

శిష్యు: "శ్రీ గురుదేవులు నిజముగా మునుపటి కిని భగవంతుడే! ఇతరుల దుఃఖములను, కష్టములను తొలగించుటకై యా దయానిధి ఈ లోకమున ప్రజల బాగోగులను స్వయముగా తెలిసి కొనుటకై మారువేషముతో తన నగరమందు తిరుగు రాజు వలె వ్యవహరించెను; తన నిజ స్వరూప మాలోకమునకు తెలియుట కూడనే, అంతర్ధాన మయ్యెను" అని శ్రీ మాతృదేవి యొక భక్తురాలితో చెప్పిరి.

- తన యొక్క పుత్రికను కోల్పోయిన యొక యువతి నోదార్చుచు శ్రీ మాతృదేవి యిట్లనిరి.

"అమ్మాయీ! నీకు నేనేమి చెప్పగలను? నాకేమియు తెలియదు. శ్రీ గురుదేవుని చిత్రపటము నీయెదుట నుంచుకొనుము. వారెల్లప్పుడు నీకు తోడు నీడయై యున్నారని గ్రహింపుము. దుఃఖ పూరితమైన నీ హృదయ మందలి వేదనను ఆయనకు విన్నవింపుము. కన్నీరు నించి 'ఓ! ప్రభూ! నన్ను నీ యొద్దకు ఆకర్షించి, నా మనస్సునకు


శాంతి ననుగ్రహింపుము!' అని త్రికరణ శుద్ధిగా ప్రార్థింపుము. నిరంతర మట్లు చేయుట వలన నీ మనస్సునకు క్రమముగా శాంతి కలుగును. శ్రీ గురుదేవుని యందు భక్తి కలిగి, నీకు కష్టమువచ్చినప్పుడెల్ల వారితో చెప్పుకొనుము.

శిష్యు: "ఎవడొక్కసారి యైనను నిజముగా శ్రీ గురుదేవుని ప్రార్థించినవారో విషయమున గాని భయపడనక్కర లేదు. శ్రీ వారి నెల్లప్పుడును ప్రార్థించువారికి శ్రీ భగవానుని దయవలన ప్రేమ భక్తి కలుగును. అమ్మాయీ! ఈ ప్రేమయే పారమార్థిక జీవిత రహస్యము. శ్రీ బృందావన గోపస్త్రీలకిది సిద్ధించెను. వారికే లోకమున శ్రీ కృష్ణుడు తప్ప వేరొకటియు తెలియ దయ్యెను. 'అమూల్యమైన ఈ ప్రేమ భూషణమును జనులు బహు జాగ్రత్తతో కాపాడు కొనవలయును'.

- ఈ మూడు విషయములందు జాగరూకులై యుండవలెను. మొదటిది, నది తీరమున నుండు గృహము: ఎప్పుడైనను నది పొంగి నీ యింటిని నాశనము చేసి వరదలో ముంచి వేయవచ్చును; రెండవది, పాము నీ కంట బడినప్పుడు నీవు బహు జాగ్రత్తగా నుండవలెను అది యెప్పుడు వచ్చి నిన్ను కరచునో యెవరును చెప్పలేరు; మూడు, సాధువు: అతని మాటల వలన, తలంపు వలన గృహస్థునకు కీడు కలుగ వచ్చునన్న సంగతి నీ వెరుగవు. సాధువును చూచినప్పుడెల్ల నీ వతనికి గౌరవము తెలుపవలయును. ప్రతి వచనము లచేగాని, స్నేహము కలుగ చేయు సంభాషణల చేగాని నీ వాతని నిరాదరణ చేయగూడదు."

- శిష్యులు చేయు పాపము వలన గురువు బాధపడును. మంత్రమును ప్రతి దినము నిర్ణీత కాలములందు తప్పక జపించుచుండుము.

- నా శరీరము విచ్ఛిన్నమైనను, నేను బాధ్యత వహించిన శిష్యులలో ప్రతి వ్యక్తికిని ముక్తి లభించనంత వరకు నాకు విడుదల యుండగలదని తలంతువా? అంతవరకు నేను వారితో నిరంతరము నివసింపవలెను. వారి పుణ్య విషయమున పాపపుణ్యముల బాధ్యతను నేనే పూర్తిగా వహించి యున్నాను. మంత్రోపదేశము చేయుటయనిన అంత తేలికపని యనుకొనుచుంటివా? మేము వహింపవలసిన బాధ్యత యెంత ప్రచండమైనది! శిష్యుల విషయమున మేమెంత ఆందోళన పడుచుందుము! చూడుము!

(14) - మహాత్ములకు సేవించునపుడు ఎవరైనను ప్రమాదవశమున లోను కావచ్చును. ఆ ప్రమాద మిట్లు జరుగును. అట్టి మహాత్ముల సేవాభాగ్యమును బడయువారికి గర్వమేర్పడవచ్చు, తాము సేవించు వ్యక్తి నతడు తన చేతి కీలుబొమ్మల వలె నాడించి ప్రతి విషయమునను తమ దగ్గర విహారాదులందు కూడ తన యిష్టానుసారము చెలాయింపజూతురు. దీని వలన సేవాఫలమా సేవకుడు కోల్పోవును. తమ స్వసుఖములను మరచి, తాము సేవించు పెద్దల కష్టసుఖములతో తమ కష్టసుఖములుగా భావించువారి విషయమున నిట్లెల జరుగవలయును? సేవకుల పతనమును గురించి నీవు మాట్లాడుచున్నావా? చాల మంది మహాత్ములు మిక్కిలి వైభవోపేతమైన జీవితమును గడుపుచుందురు. ఈ భాగ్య భోగ్యములను జూచి చాలా మంది వారి చెంతకు సేవకులుగా వచ్చి, భోగాసక్తులై తమ గోతిని తామే త్రవ్వుకొనెదరు. సరియైన విధమున సేవ చేయువారెందరున్నారో చెప్పుము. చెరువులోని నీటిపై చంద్రుని ప్రతిబింబము పడినతోడనే నీటియందు ప్రతిబింబితమైన చంద్రుడు నిజముగా తమ కూటములోని జీవియే యని భ్రమించి ఆనంద పారవశ్యమున నెత్తళ్ళు (ఒక విధమైన చిన్న చేపలు) అటునిటు దుముకును. కాని చంద్రుడస్తమించినప్పుడవి తమ పూర్వస్థితి లోనికి వచ్చును; వెట్టి సంతోషములో పైకి యెగిరి అలసిపోయి మాంద్యముగా నవి పడియుండును. దీని కంతటికిని కారణమేమో యవి గ్రహింపజాలవు.

- మరణ మెప్పుడు వచ్చునో యెవరికిని తెలియదు గనుక, జనులు తమ పవిత్రోద్దేశములను సాధించుటకు తగిన యవకాశము కలిగిన తోడనే శుభముహూర్తమునకై వేచియుండక కార్యాచరణకు గడంగవలయును.

- "వైరాగ్యమును అనగా నెట్టి కోరికయు లేని స్థితిని మనము కోరవలెను. ఏలన ఆశయే సర్వకష్టములకు మూలబీజము. ఇదియే జనన మరణములకు కారణము, ముక్తికంటకమును."

(15) - ఏ మానవ వ్యక్తిని గాని ప్రేమించునెడల నీ వందులకు కష్టపడవలసి యుందువు. భగవంతుని మాత్రమే ప్రేమించువారు నిజముగా ధన్యులు. భగవంతుని ప్రేమించుట యందెట్టి కష్టమును కలుగదు.

- "మీరెప్పుడైన నొకచోటి నుండి మరియొక చోటునకు వెళ్ళినపుడు మీ చుట్టు ప్రక్కల నుండు వస్తువులను చక్కగా పరిశీలించి, మీరుండు స్థలమున నేమి జరుగుచున్నదో బాగుగా తెలిసికొనుచుండును. కాని నోరు మాత్రము మీరెన్నడు మెదపవలదు.

- కష్టాలెల్లప్పుడు వచ్చును గాని, శాశ్వతముగా నుండవు. వంతెన క్రింద నీళ్ళవలె నవి గతించి పోవునని గ్రహింపుము.

- మాటల చేనైన మన మితరుల నెన్నడును నొప్పింపగూడదు. కష్టభాజనమగు సత్యమైనను మన మనావశ్యకముగా పలుకకూడదు. ఎవరైన మోటు మాటలాడుట కలవడినేని వారి స్వభావము కూడ మోటుబారును. తన మాటల నదుపులో నుంచుకొనలేనివానికి, సౌమ్యత యుండదు. 'ఒక కుంటివానిని వాడెట్లు కుంటివాడయ్యెనని' మన మడుగకూడదు!

- ఎంత కొలదిపాటి వస్తువుపైన మనము నిరాదరణ చేయరాదు. నీ వొక వస్తువును గౌరవించునెడల, అదికూడ నిన్ను గౌరవభావముతో చూచును. ఎంత చిన్న పనినైనను మనము గౌరవ భావముతో చేయవలయును.

- శిరస్సు గురుస్థానము. తల నెవరు పాదములతో తాకగూడదు.

- ఎపుడు నీ బుద్ధి అజ్ఞానమనెడి ~~అజ్ఞానమనెడి~~ కాలుష్యమును దాటి పోగలదో అపుడె నీవు వినిన దాని నుండియు, విని తెలిసికొనవలసిన దాని నుండియు, వైరాగ్యము నొందెదవు. అని భగవద్వాక్యము. జ్ఞానసంపన్నులైనచో శాస్త్రశ్రవణ పఠనాదులతో పని యేమి? జ్ఞానము లేక ఎంతకాలము ఎన్ని శాస్త్రశ్రవణ పఠనాదులు చేసినను దానివలన ప్రయోజనమేమి? పెక్కురు వక్తలు, శ్రోతలు కూడ సంవత్సరముల పర్యంతము తమ వేదాంత ప్రసంగములలో మునిగి తేలుచున్నను తమ బుద్ధులు స్థైర్యము సంపాదింపబడక పోవుట మిక్కిలి ~~[illegible]~~ లజ్జాకరమైన విషయము.

- చిత్తశుద్ధికై కర్మలు, ఏకాగ్రతకై ఉపాసలు, ముక్తికై జ్ఞానము ఏర్పడినవి.

(16) జ్ఞానాగ్ని చేత సంచిత కర్మలు, ఆగామి కర్మలు దగ్ధమైపోవు
చున్నవి. కానీ ప్రారబ్ధాను భవము పూర్తియైనంతనే
విదేహ మోక్ష మేర్పడుచున్నది.

- సంచితమనగా గడచిన అనంత జన్మలలో చేసిన పుణ్య
పాప కర్మల రాశి. ఆగామి యనగా ఈ జన్మములో చేసి
ముందు రాబోవు జన్మలలో అనుభవించవలసిన కర్మల
రాశి. ప్రారబ్ధమనగా సంచితములో కొంత భాగమై ఈ జన్మ
మునకు వచ్చిన ఫలమీయ నారంభించిన కర్మలు. ఇంత
కంటె వేరు కర్మలు లేవు. నేను నిష్క్రియుడను ఆత్మను
అని ఇట్లు అనుభవము కలుగగానే సంచిత, ఆగామి
కర్మలన్నియు నశించిపోవుచున్నవి. ఇకను మిగిలినవి
ప్రారబ్ధ రూపములు. ఇవి ఈ జన్మలో అనుభవింపగా
అంతము కాబోవుచున్నవి. ఇట్లు సమస్త కర్మలును నశించి
పోగా పునర్జన్మకు హేతువైన కర్మ లేనియు లేనందున
ఈ దేహము పడిపోయిన వెంటనే "తస్య తావదేవ
చిరమ్" అని శ్రుతి యున్నట్లు ఏమియు ఆలస్యము లేకుండా
మరల జనించుట యనునది లేని విధముగా పునరా
వృత్తి రహితముగా అఖండ సచ్చిదానంద రూప బ్రహ్మము
గా ఉండిపోవుట యనెడి విదేహముక్తి ఏర్పడుచున్నది.
"జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్కురుతే" అని భగవద్వాక్యము.

| దృక్కు - బ్రహ్మము | దృశ్యము - మాయ |
| --- | --- |
| - జ్ఞాన స్వరూపము | - జడ స్వరూపము |
| - ఆనంద స్వరూపము | - దుఃఖ స్వరూపము |
| - ఎల్లప్పుడును ఉండునది | - ఎల్లప్పుడును ఉండనిది |
| - ఆకారము లేనిది | - ఆకారము గలది |
| - స్వతఃగానే తోచునది | - స్వతఃగాని తోచనిది |
| - ఖండ ఖండముగా నుండనిది | - ఖండ ఖండముగా నుండునది |
| - కనబడనిది | - కనబడునది |
| - తెలిసికొనునది | - తెలిసికొనలేనిది |
| - సత్యమై యున్నట్టిది | - సత్యము కానిది. |

- అవిద్య (అజ్ఞానము) ఉపాధి - జీవుడు
- మాయ ఉపాధి కలవాడు - ఈశ్వరుడు
- ఎవడెట్టి కర్మ చేయుచున్నాడో, ఎట్టి ఆచరణ గలవాడగుచున్నాడో
అతడు అట్టి యగుచున్నాడు. దొంగతనము చేసి దొంగ యగు
చున్నాడు. ధర్మము చేసి ధర్మాత్ముడగుచున్నాడు. బ్రహ్మజ్ఞాన
ము సంపాదించి బ్రాహ్మణుడగుచున్నాడు.

(17) *1. దైవమును గూర్చి సదా తెలుసుకొనుచుండవలెను
*2. తెలుసుకొనిన విషయములను మనసున ఎల్లప్పుడు
నిల్పుకొని విచారణ చేయుట.
*3. శ్రద్ధా భక్తులతో భగవంతుని ధ్యానించుచు వారియందు
లీనమగుట.
↳ ఇదియే శ్రవణ, మనన, నిధి ధ్యాసలు.

- జ్ఞాని హృదయము అత్యంత పవిత్రమైనది. అతడు పెక్కు జన్మ
లలో సత్కర్మలు, ఉపాసనలు, వివిధ ఉత్తమ సాధనలు
చేయక జ్ఞానమే కలుగదు. ఇది శాస్త్ర నిర్ణయము, కావు
సాధనలు చేసి చేసి జ్ఞానము తుదకు కలిగి జ్ఞాని హృదయము
పరమ పావనమైనదిగా తయారయి ఉండును.
• బ్రహ్మ భూతః ప్రసన్నాత్మా"
బ్రహ్మ విదుడు ప్రసన్నమైన - స్వచ్ఛమైన నిర్మలమైన
అంతఃకరణము గలవాడు అని భగవానుడు ప్రశంసించెను.
కావున వాని యొక్క అట్టి పవిత్ర హృదయమున
అపవిత్రమైన సంకల్పములు పాపపు-ఆలోచనలు కలుగ
నేరవు.
"అసంగాత్మ నిష్ఠులు పుణ్యము చేసి అభివృద్ధి గాని, పాపము
చేసి హాని గాని పొందరు." అనెడు యీ వాక్యమునకు
అర్థమేమి? అనిన పూర్వము అజ్ఞాన దశలో చేసిన
పుణ్యపాపములు ఆత్మ సాక్షాత్కారమైన వెనుక అట్టి
జ్ఞానిని ఏమియు చేయజాలవనియే అర్థము.
" సర్వపాప హరము సు ప్రాయశ్చిత్తము జ్ఞానమే"
- చేసిన కర్మ ఎప్పటికైనను అవశ్యము అనుభవించి తీరవల
సినదే. ఇది ఈశ్వర శాసనము. అట్లైనను బ్రహ్మజ్ఞానము
ఈ శాసనమును కొట్టివేయుచున్నది. తెలిసియు తెలియక
యు చేసిన పాపములన్నియు బ్రహ్మజ్ఞానము కలిగిన
వెంటనే అంతమొందుచున్నవి.
నీవు పాపులలో కెల్ల మహాపాపివైనను బ్రహ్మజ్ఞాన
మనెడి తెప్పను బట్టి పాపమనెడి సాగరమును దాటిపో
గలవు. అని భగవద్వాక్యము.

ఓం

నమో భగవతే వాసుదేవాయ.

(బ్రహ్మానంద వైభవము).

- సామాన్యమైన నిద్రయందే మనుజుడు గొప్ప సుఖమును బడయుచున్నపుడు ఇక సమాధి స్థితి యందు వేరే చెప్పవలయునా? నిద్రయందు మనస్సు లయించినను అది జడస్థితి, తమోమయ స్థితి కాబట్టి అది అంత గొప్పస్థితి కాదు. పశువులు కూడా నిద్రపోవుచున్నవి కదా. మెలకువ మనస్సును లయింప జేయవలయును. అదియే మహోన్నత సమాధి స్థితి. అదియే ఆత్మస్థితి. బహుకాల ప్రయత్నము చేతను, సాధనాభ్యాసము చేతను, వైరాగ్య భావన చేతను అట్టి తురీయ స్థితి తప్పక చేకూర గలదు.
- ఎన్ని నదులు వచ్చి సముద్రములో పడినను సముద్రము తృప్తి నొందనట్లు మనస్సున్ను ఎన్ని ప్రాపంచిక సుఖముల ననుభవించినను, తృప్తిని, శాంతిని, పొందకయే ఉండును.
- జీవులు దుఃఖమునుండి తప్పించుకొనుటకు ఉపాయము విచారణచే, వివేకముచే ఆ అజ్ఞానమును తొలగించుకొనుటయే యగును.
- ఆకలి → భోజనము చేయుట అనునది రోగనివారణ కార్యమే!
  దాహము → నీరు, ఇతరపానీయములు " "
- చంచల సుఖములను గొప్పగా తలంచరాదు. రోగనివారణ కృత్యములను భోగములుగ భావించరాదు. విషయసుఖములను జీవిత పరమావధిగ నెంచరాదు. అక్షయమైన సుఖము ఆత్మ యందే కలదు. బ్రహ్మమందే కలదు. బాహ్య పదార్థములందు లేదు. ఉన్నదని తలంచి మోసపోరాదు.
- ఏ బ్రహ్మానంద సముద్రము యొక్క లవలేశమును గ్రహించి ఇంద్రుడు మొదలైన వారు పరమానంద పడుచున్నారో, దేనిని తమ హృదయమందనుభవించుచు మునీశ్వరులు పరమశాంతిని బడయుచున్నారో, నిత్యమైన ఏ సుఖ సాగరమున తమ బుద్ధిని లయింపజేసి బ్రహ్మవేత్త సాక్షాత్ పరబ్రహ్మమే యగుచున్నాడో, దేవేంద్రునిచే కూడ వందనీయమైన అట్టి నిరతిశయ బ్రహ్మానందమే నిక్కముగ జీవుని నిజస్వరూపము.
- బ్రహ్మానందమను నిధి అహంకారమను సర్పముచే సంరక్షింపబడుచున్నదియు, ఆ అహంకారమును

(1)

ఓం

నమో భగవతే వాసుదేవాయ.

(బ్రహ్మానంద వైభవము).

- సామాన్యమైన నిద్రయందే మనుజుడు గొప్ప సుఖమును బడయుచున్నపుడు ఇక సమాధి స్థితి యందు వేరే చెప్పవలయునా? నిద్రయందు మనస్సు లయించినను అది జడస్థితి, తమోమయ స్థితి కాబట్టి అది అంత గొప్పస్థితి కాదు. పశువులు కూడా నిద్రపోవుచున్నవి కదా. మెలకువ మనస్సును లయింప జేయవలయును. అదియే మహోన్నత సమాధి స్థితి. అదియే ఆత్మస్థితి. బహుకాల ప్రయత్నము చేతను, సాధనాభ్యాసము చేతను, వైరాగ్య భావన చేతను అట్టి తురీయ స్థితి తప్పక చేకూర గలదు.
- ఎన్ని నదులు వచ్చి సముద్రములో పడినను సముద్రము తృప్తి నొందనట్లు మనస్సున్ను ఎన్ని ప్రాపంచిక సుఖముల ననుభవించినను, తృప్తిని, శాంతిని, పొందకయే ఉండును.
- జీవులు దుఃఖమునుండి తప్పించుకొనుటకు ఉపాయము విచారణచే, వివేకముచే ఆ అజ్ఞానమును తొలగించుకొనుటయే యగును.
- ఆకలి → భోజనము చేయుట అనునది రోగనివారణ కార్యమే!
  దాహము → నీరు, ఇతరపానీయములు " "
- చంచల సుఖములను గొప్పగా తలంచరాదు. రోగనివారణ కృత్యములను భోగములుగ భావించరాదు. విషయసుఖములను జీవిత పరమావధిగ నెంచరాదు. అక్షయమైన సుఖము ఆత్మ యందే కలదు. బ్రహ్మమందే కలదు. బాహ్య పదార్థములందు లేదు. ఉన్నదని తలంచి మోసపోరాదు.
- ఏ బ్రహ్మానంద సముద్రము యొక్క లవలేశమును గ్రహించి ఇంద్రుడు మొదలైన వారు పరమానంద పడుచున్నారో, దేనిని తమ హృదయమందనుభవించుచు మునీశ్వరులు పరమశాంతిని బడయుచున్నారో, నిత్యమైన ఏ సుఖ సాగరమున తమ బుద్ధిని లయింపజేసి బ్రహ్మవేత్త సాక్షాత్ పరబ్రహ్మమే యగుచున్నాడో, దేవేంద్రునిచే కూడ వందనీయమైన అట్టి నిరతిశయ బ్రహ్మానందమే నిక్కముగ జీవుని నిజస్వరూపము.
- బ్రహ్మానందమను నిధి అహంకారమను సర్పముచే సంరక్షింపబడుచున్నదియు, ఆ అహంకారమును

(2) తొలగించినచో మాత్రమే దివ్యానందానుభూతిని జనులు బడయగలరనియు, ఏ ఒకానొక ధీరుడో ఆశ్చర్యముకు సాధించి పరమానంద మనుభవించుచున్నాడనియు వివేకచూడామణిలో తెలుపబడినది.

- బ్రహ్మానంద రసానుభూతిని బడసిన మహనీయుల యొక్క అనుభవ వాక్యము లెన్నియో ఉపనిషత్తులందును, యోగవాసిష్ఠమునందును, ఇతర శాస్త్రగ్రంథములందును చక్కగ పేర్కొనబడినది. వాని పఠించినచో ఆత్మసాక్షాత్కారముచే జీవుడెట్టి మహదానందమును పొందుచుండునో స్పష్టముగ తెలియగలదు. జీవుని అంతరంగమున ఎంతటి మహోన్నత ఆనందము యొక్క అస్తిత్వము కలదో జనులు గుర్తెరిగి పరమైశ్వర్యము పొందుచుందురు. ఆహా! మానవ జన్మయం దిట్టి సమస్త ఆనందముల యొక్క పరాకాష్ఠయగు బ్రహ్మానందమును అనుభవించుటకు చక్కటి అవకాశ మేర్పడినది కదా యని మహనీయులు లోలోన సంతోషించుచుందురు.
- ఏ ఆనందసాగరము నుండి వెలువడిన చిన్న తుంపరతో సమస్త ప్రాణికోట్లు జీవనమ్మై యలరుచున్నవో అట్టి బ్రహ్మానంద రూపుడగు పరమాత్మకు నమస్కారము.
- ధన ధాన్య సంపన్నుడును, సర్వులకు అధిపతియు, సమస్త మానవ భోగములతో కూడియున్న వాడును అగు చక్రవర్తి యొక్క ఆనందము ఒక మనుష్యానందము. దానికి నూఱురెట్లు ఒక పితరుల ఆనందము. దానికి నూఱు రెట్లు ఒక గంధర్వ ఆనందము. దానికి నూఱు రెట్లు ఒక కర్మదేవతల ఆనందము. దానికి నూఱు రెట్లు ఒక ఆజానదేవతానందము. దానికి నూఱు రెట్లు ఒక ప్రజాపతి లోక ఆనందము. దానికి నూఱు రెట్లు ఒక బ్రహ్మలోక ఆనందము. దానికి అనేక రెట్లు పరమానందము, బ్రహ్మానందము.
- ప్రతి జీవియు లాభమునే కోరుచుండును, నష్టమును కాదు. సుఖమునే కోరుచుండును, దుఃఖమును కాదు.

(3) - అశాశ్వతములైనవి ఎంత గొప్పగా కనిపించినను అవి అల్పమయినవే అగును.
- ప్రపంచమున శాశ్వతమయినది ఒక్క పరమాత్మయే
- సామాన్య లాభముల కొఱకై జీవితమంతయు ధారపోసి కర్మరాశిని పెంచుకొనుచు జనన మరణ చక్రమునందు తగుల్కొని నానా యాతనలు అనుభవించుట కంటె ఉత్కృష్ట లాభమయిన పరమాత్మను బడసి బంధరాహిత్యమును పొందుట శ్రేయస్కరము కదా!
- ప్రపంచ వస్తువేదియు ఆత్మ వస్తువుతో సరిగాదు.
- ఎన్ని కష్టముల కోర్చియైనను, ఎన్ని ప్రయాసల నెదుర్కొనియైనను ఆత్మనే జీవుడు పొందవలెను. అట్టి ఆత్మనే జీవితాంతము లోగా అతడు సాక్షాత్కరించుకొనవలెను.
- దేహము లోపల పంచకోశాంతర్గతమున మహావిలువగల ఆత్మ వెలయుచున్నది. దేహము బయట నశ్వరములగు నామ రూపములు నివాసమేర్పరచుకొనినవి. కనుకనే మహాత్ములు బాహ్య దృశ్య వస్తువుల యెడల విరాగము గలిగి అంతర్ముఖులై లోనగల పరమాత్మ యందు మనస్సును కేంద్రీకరించి, ఆ నిధిని బడసి ధన్యులగుచున్నారు.
- విజ్ఞులగువారు ప్రపంచములోని సారాసారములను చక్కగ వివేచించి సారమైన ఆత్మనే గ్రహించి అనాత్మ వస్తువు లగు నామరూపము లందు వ్యామోహమును తొలగించి వేయుదురు.
- బృహదారణ్యకోపనిషత్తునందు — ఆత్మనే చూడవలెను, వినవలెను, మననము చేయవలెను, నిధిధ్యాసనము చేయవలెను. అని అసందిగ్ధమున చెప్పబడినది.
- జీవునకు మహోత్కృష్టమైన శక్తి కలదు. అంధకారమును పటాపంచలు చేయును, మరియు సదా ఊర్ధ్వ దృష్టినే కలిగియుండును. కావున ఊర్ధ్వదృష్టి, జ్ఞానదృష్టి, దైవ దృష్టిని కలిగియుండుడు, అధోదృష్టిని, అజ్ఞాన దృష్టిని పాపదృష్టిని పారద్రోలుడు.

(4)

- దీపము వెలిగించుటకు కావలసిన వస్తువులు
ప్రమిద, నూనె, వత్తి, అగ్గిపెట్టె

జ్ఞాన దీపం
- వైరాగ్యము అను ప్రమిద
- భక్తి యను నూనె
- చిత్తైకాగ్రత యను వత్తి
- తత్త్వవిచారణ యను అగ్గిపెట్టె

- జ్ఞానదీపము వెలుగుటకు వైరాగ్యము మూలాధారము
- ప్రమిద దీపము కొద్దిసేపుండును. ప్రళయ కాలము వరకు సూర్య చంద్రాది దీపములు వెలుగుచుండును. కాని ప్రళయ కాలమున కూడ నశింపక, జాగ్రత్, స్వప్న, సుషుప్తులందును తురీయమందును ఎల్లప్పుడు కూడ ఏకరీతి అవిచ్ఛిన్నముగ వెలుగుచుండు దీపమొకటి కలదు. అదియే ఆత్మ. అదియే బ్రహ్మము. అదియే పరంజ్యోతి.
- పెద్దల సాంగత్యముచే మాయ యొక్క మర్మమెఱింగి కీలు తెలుసుకొని వాత పెట్టినట్లు, ఆత్మజ్ఞానము యొక్క సహాయముచే ఆ ~~జ్ఞానము~~ మాయను అంతమొనర్చి ఆత్మసామ్రాజ్యమునకు అధినేతయై వర్తించవలయును.
- ఒక వస్తువును గ్రహించుటకు ముందునా అది సత్యమైనదా? కాదా? దాని వలన మనుజునకు శాంతిసుఖములు కలుగునా? లేదా? దానిలో సుఖమెంత? దుఃఖమెంత? మానవ జీవితమునకు అది ఎంత ప్రయోజనకరము? ఈ మొదలగు ప్రశ్నలను వేసికొనవలసి యుండును. వివేకవంతుడగు వాడు మొట్టమొదట పని ఇదియే.
- దృశ్యప్రపంచము నందు రెండు దోషములు కలవు.
  1 - నశ్వరత్వము - శాశ్వతము కాదు
  2 - పూర్ణసుఖరాహిత్యము - ఏ పదార్థము పూర్ణసుఖమివ్వదు.

కాని మాయా ప్రభావముచే మనుజులకు దృశ్యపదార్థములందు నిగూఢమై యున్న ఈ దోషములు ఏమాత్రము కానవచ్చుట లేదు. అందుచేతనే వారు వాని వెంట పరుగిడుచు, అహర్నిశములు ఆ ప్రతిబింబ సుఖముల కొఱకై జీవితమును వెచ్చించుచు అమూల్యమైన మానవ జీవితమును వ్యర్థపఱచుచున్నారు.

(5)

- మనస్సు యొక్క తరలికయే బంధము. మనస్సు యొక్క నిశ్చలత్వమే మోక్షము.
- సాధకుడను వాడు విచారణచే వస్తుతత్త్వమును చక్కగ తెలుసుకొని జడమును జడముగను, చైతన్యమును చైతన్యముగను గుర్తెఱింగి నశ్వరములగు దేహాది దృశ్యపదార్థములపై మమత్వమును, వ్యామోహమును విడనాడి, ప్రాపంచిక విషయభోగముల యెడల విరాగభావమును గలుగజేసికొని మాయను దరికి జేర్చక సత్యమగు ఆత్మయందే మనస్సును నెలకొల్పి దివ్యమగు ఆనందానుభూతిని శీఘ్రముగ బడయుటకై యత్నశీలుడు కావలయును. మాయ తనయందు కల్పితమైన ఒకానొక వస్తువే యని నిశ్చయించి బలియుడై ఆ మాయకు లోబడక దానికి అతీతుడై వర్తించవలెను. మాయా విజయమే మానవులకు ముఖ్యము.

- వ్యాసులవారి సందేశము:
"ఓ! మానవులారా! ఓ ఉత్తమ జనులారా! విషయ సుఖమే ప్రాణుల చరమ లక్ష్యమైనచో, వారు మానవులుగా పుట్టనవసరం లేదు. ఏ క్రిమికీటకములుగ జన్మించినను ఫరవాలేదు. అచట కూడ బోలెడంత విషయసుఖము కలదు. అచట కూడ ఇంద్రియార్థములను శబ్దస్పర్శాదులను చక్కగ అనుభవించుటకు అవకాశము కలదు. మానవజన్మయో పరమార్థము తెలిసికొనుటకు సృజించినది. స్వస్వరూప సాక్షాత్కారమొనర్చుకొని జన్మసార్థకత బడయుటకే మానవజన్మ భగవంతునిచే ప్రసాదింపబడినది. అట్టి అమూల్య జన్మను క్రిమికీటకాదులనుభవించు ఐహిక సుఖమునకే వెచ్చించుట పాడి కాదు. పశు వికారములందు పాడుచేయుట న్యాయము కాదు. దుర్వ్యసనములతో లోను చేయుట ధర్మము కాదు. లెండు! తెలిసికొనుడు! ఆత్మసాక్షాత్కారమను మీ కర్తవ్యమును సాధించి సార్థక జన్ములు కండు.

- ఎవడు తన్నుతాను తెలిసికొని, తన హృదయమున వెలుగుచున్న ఆత్మజ్యోతిని సాక్షాత్కారము చేసికొనునో, ఎవడు పరమ పవిత్రమగు దైవానుభూతిని బడయునో, అట్టివాడే వాస్తవముగ పుట్టినవాడు. ఎవని వలన వంశము, కులము, దేశము, ఉద్ధరింపబడునో అతడే పుట్టినవాడు. జన్మసార్థకత లేని జీవితము జీవితము కాదు.

(1) శ్రీ శారదా ప్రసంగములు..

– హిందూ మతాచారము ప్రకారము పూజ్యులైనవారు బాలికనైనను కాళ్ళు కడుగుకొనుటకు వాడకూడదు.

– ఎల్లప్పుడు నేదో యొక పని చేయుచుండుట వలన మనస్సునకును, శరీరమునకును గూడ ఆరోగ్యకరముగ నుండును.

– నిష్కపటమైన భక్తి గలవారు భగవంతునకు అత్యంత ప్రియులు; కావుననే మన అంతరాత్మకు వారియందభిమానము.

– జగన్నాథుల రథము నందలి విష్ణు విగ్రహమును చూచిన వారికి భగవత్సాక్షాత్కారము కలుగునని హిందూ జన సామాన్యము యొక్క నమ్మకము

– ఆడువారికి శీఘ్రముగా కోపము రాకూడదు. వారు సహనము నభ్యసింపవలయును. బాల్యమందు వారికి తల్లిదండ్రులతో రక్షకులు, యౌవనములో భర్త రక్షణ క్రింద నుందురు. సామాన్యముగా ఆడువారికి అభిమానము ఎక్కువగా నుండును. వారిని కలవర పరచుటకు ఒక మాటయే చాలును. ఈ రోజులలో మాటల కేమి కొదువ ? కనుక ఓర్పుతో వారు కష్ట సమయములందు తల్లిదండ్రులను గాని భర్తలను గాని యెదిరింపక వారికి విధేయులై యుండుటకు ప్రయత్నింపవలెను.

– కామినీ కాంచనముల రెంటిని పరిత్యజింపుడని జనుల నందరిని ఆయన (రామకృష్ణులు) యెల్లప్పుడు హెచ్చరించుచుండెను. వాదోపవాదములు చేయుట ఆడువారికి తగదు. వాదము వలన నెంతటి బుద్ధిమంతులకును భగవంతుని గ్రహించుటకు సాధ్యము కాదు. బ్రహ్మము వాదము వలన తేలెడు విషయమా?

– ఆధ్యాత్మిక బోధను గ్రహించుటకు అభ్యాసకులకు అర్హత ఉండవలయును.



27
शुक्रवार
Friday

(1) శ్రీ శారదా ప్రసంగములు..

– హిందూ మతాచారము ప్రకారము పూజ్యులైనవారు బాలికనైనను కాళ్ళు కడుగుకొనుటకు వాడకూడదు.

– ఎల్లప్పుడు నేదో యొక పని చేయుచుండుట వలన మనస్సునకును, శరీరమునకును గూడ ఆరోగ్యకరముగ నుండును.

– నిష్కపటమైన భక్తి గలవారు భగవంతునకు అత్యంత ప్రియులు; కావుననే మన అంతరాత్మకు వారియందభిమానము.

– జగన్నాథుల రథము నందలి విష్ణు విగ్రహమును చూచిన వారికి భగవత్సాక్షాత్కారము కలుగునని హిందూ జన సామాన్యము యొక్క నమ్మకము

– ఆడువారికి శీఘ్రముగా కోపము రాకూడదు. వారు సహనము నభ్యసింపవలయును. బాల్యమందు వారికి తల్లిదండ్రులతో రక్షకులు, యౌవనములో భర్త రక్షణ క్రింద నుందురు. సామాన్యముగా ఆడువారికి అభిమానము ఎక్కువగా నుండును. వారిని కలవర పరచుటకు ఒక మాటయే చాలును. ఈ రోజులలో మాటల కేమి కొదువ ? కనుక ఓర్పుతో వారు కష్ట సమయములందు తల్లిదండ్రులను గాని భర్తలను గాని యెదిరింపక వారికి విధేయులై యుండుటకు ప్రయత్నింపవలెను.

– కామినీ కాంచనముల రెంటిని పరిత్యజింపుడని జనుల నందరిని ఆయన (రామకృష్ణులు) యెల్లప్పుడు హెచ్చరించుచుండెను. వాదోపవాదములు చేయుట ఆడువారికి తగదు. వాదము వలన నెంతటి బుద్ధిమంతులకును భగవంతుని గ్రహించుటకు సాధ్యము కాదు. బ్రహ్మము వాదము వలన తేలెడు విషయమా?

– ఆధ్యాత్మిక బోధను గ్రహించుటకు అభ్యాసకులకు అర్హత ఉండవలయును.

1990

② **28 July** जुलाई
शनिवार Saturday

— సాత్త్విక గుణము వలన లాభములవేవను

* సృష్టి సమయమున జనులు సత్త్వగుణ
యుక్తమైన తేజస్సుతో పుట్టిరి. పుట్టినప్పటి
నుండియు వారు జ్ఞానులే. ఈ కారణము వలన,
జగత్తు యొక్క అనిత్య స్వభావమును వారు
వెంటనే గ్రహించి, దానిని పరిత్యజించి, పారమార్థిక
సాధన చేయుచుండెడివారు. మిక్కిలి త్వరితముగా
వారికి ముక్తి లభించుచుండెను. తన సృష్టి వ్యర్థమై
పోవుచుండెనని సృష్టికర్త గ్రహించెను. ఇట్లు ముక్తి
నొందిన జ్ఞానులు జగన్నాటక నిర్వాహణమునకు
పనికి రాకుండిరి. పిమ్మట, భగవంతుడు సృష్టిని
మరల ప్రారంభించి, సత్త్వముతో రజస్తమోగుణము
లను గూడ కలిపెను. ఆయన ఉద్దేశమప్పుడు
నెరవేరెను!"

— "భార్యాభర్తలు మత సాధనలను గురించి యేకాభి
ప్రాయులై యున్నచో, ఆధ్యాత్మికాభివృద్ధి వారికి
సులభముగా కలుగును".

— అవసరమైనచో గురువునకు కూడ మన మేది ధర్మమో
చెప్పవలసినది. శిష్యులట్లు చేయుటలో దోష
మెంత మాత్రమును లేదు. కాని గురువు నందు
శిష్యునకు అచంచలమైన భక్తి యుండవలెను.

29 रवि - Sun
గురుని ప్రవర్తన యెట్లున్నను, నాటని యుం
డబట్టి భక్తి కలిగి యున్నచో, శిష్యుడు ముక్తిని
సాధింపగలుగును.

- తన యావజ్జీవము నొక మనుష్యుడు భగవత్సాక్షా
త్కారము కొరకు ఎన్ని కఠిన సాధనలను చేసినను
లాభము లేకుండును. కాని మరియొకరికి ప్రాయికము
గా ఏ కృషియు లేకయే పరమార్థము లభించును.
ఇది భగవంతుని దయపై ఆధారపడి యున్నది.
ఆయన కిష్టమైనవారికి తన దయను ప్రసాదించును.
దైవకృపయే బహు ముఖ్యము.
- మీరు లేనిచో భగవంతుడు ప్రసన్నుడు కాజాలడు.
- ఎవరైనను ప్రతి దినము భగవంతుని భగవద్దర్శన
మును బడయగలరా? ప్రతిదినము గాలము



③ जुलाई **July 30**
सोमवार Monday

వేచిన వెంటనే చేపదొరకునా? ఎన్నిరోజు
లు ఓపికతో ఆశాభావము కలుగును.
కనుక సాధకుడు సాధనను సడలించ
వలదు. జపము (భగవన్నామస్మరణము)
వెనుకటికంటెను ఎక్కువ చేయుచుండవలెను.
- భగవన్నామమునకును, భగవంతునకును భేద
మేమియు లేదు. ఆరంభదశలో మనస్సేకా
గ్రముగ నిలువలేక పోయినను పట్టు విడరాదు
జపము గావలెను.
- మానవ శరీరమును చూచుచున్నారుగా! ఇది
నేడున్నది, రేపుండదు. ఈ ప్రపంచము దుః
ఖమయము. ఎట్టి జన్మమెత్తుటకు జను
లెల్ల తిరిగి వ్యసన పడవలయును. దాని నైసర్గిక
బాధల నుండి శరీర మెన్నటికిని తప్పించు
కొన జాలదు. ~~'అమ్మా! ఓ మోల'~~
- మన మెల్లప్పుడు పని చేయు చుండవలయును.
పని లేకుండ మన మెన్నడు నుండరాదు.
సోమరులమై యుండిన యెడల బహు విధము
లైన చెడు తలంపులన్నియు మనస్సులో
కలుగుచుండును. అడవి యేనుగవంటిది
ఈ మనస్సు. అది వాయువేగముతో
పరుగెత్తుచుండును. కనుక మన మెల్ల
ప్పుడు వివేచన/విచారణ చేయుచుండ
వలయును. భగవత్సాక్షాత్కారమునకు మనము
కష్టపడి సాధన చేయవలయును.
— ధ్యానము చేయుచుండునప్పుడు కుడి ప్రక్కనుం
డి నాదము వచ్చును. శరీర స్పృహ యున్నప్పుడు
మాత్రమే, విద్యుత్ ప్రవాహము నుండి నాదము వచ్చును.
కుండలిని శక్తి ఊర్ధ్వముఖమైనప్పుడు ఈ
సంఘటనలు జరుగును. కుడి ప్రక్క నుండి వచ్చు
నాదమే దివ్యమైనది. కొంత కాలమునకు మనస్సు
లయమగును. పవిత్ర శాస్త్రములలో రెండు విధముల
ముక్తినైనను భగవంతుని ప్రార్థించుటు ~~[illegible]~~

(4) యును, ధ్యానించుటయును, చంచల
మైన మనస్సుతో గంటల కొలది చేయు
జప తపాదుల కంటె చాల మేలు

- శ్రీ రామకృష్ణ గురుదేవులు బహు కఠిన వ్యాధిని
చూసి మానవలోకి విమోచనకై కాళిదేవి ప్రార్థింపుము,
- "శరీరము వేరు, ఆత్మ వేరు. ఆత్మ శరీర
మందు నివసించి యుండును. అందువలననే నా కాలు
లోని బాధ నాకు తెలియుచున్నది. ఈ మాంసాల
లో నుండి నా మనస్సును వేరు చేసి వేయు నెడల
అప్పుడు నాకే బాధయు నుండదు.

- మంత్రము వలన శరీరము పావనమగును.
భగవన్నామ ముచ్చరించుట వలన మానవుడు పవిత్రు
డగును.

- శరీర శుద్ధి కొరకై నదులు గురుముఖమున మనము
మంత్రోపదేశము పొందవలెను. చెవిలో మానవ
గురువు మంత్ర ముచ్చరించునే గాని భగవంతుడే
ఆత్మకు ఉపదేశమిచ్చును. చిత్తశుద్ధి తోనే
మన కోరికయు లభించును. సాధకునకు గురు కటా
క్షమును, భగవత్కటాక్షమును, వైష్ణవ కటాక్ష
మును కూడా కలిగినను, ఒకని దయ లేనిచో
వానికి దుఃఖము సంభవించును. మనస్సే ఆ
యొకడు. సాధకునకు వాని మనస్సు సుము
ఖముగా నుండవలయును.

- ఈశ్వర కోటులు భగవంతుని యందే
పూర్ణకామ సిద్ధిని గాంచుదురు. కనుక వారి
కెట్టి వాంఛ లేనియు నుండవు. ఏ విధమైన
ఫలాపేక్ష లేని దివ్యప్రేమ, ఆనందమే మూలమువా
న్నను సేవకీని సాధనము కాదు.

- భగవంతుని శరణు జొచ్చిన వారి విధ్యుక్తము
న విధించిన యాజ్ఞలనే, విధి మాపు చేయును.
భగవత్సాక్షాత్కారమైన మానవు తెలుసును. వారి
కిలక్ష్య కోరుకొనుచు మిగులు చున్నా? ఎట్టి దోషము
జరుగదు. అట్టి వారికి నిజాన నిత్య నివేదనా



(5) శక్తి వికసించి, అపరోక్ష జ్ఞానము కలిగి
నారు జనన మరణముల కతీతులగుదురు.
పరమాత్మను భవము కలవారై భగ
వంతుని తెలిసి కొనగలరు. ~~[illegible]~~

~~[illegible]~~ అఖండ సచ్చిదానంద స్వరూపుడు
తానైన భగవంతుడు ఎవరితోనైన సంభాషించు
చున్నాడా? అట్టి మహాత్ముల స్థితిలో(మాత్ర)
మే భగవంతుని సందర్శించి ఆయనతో
మాట్లాడి సన్నిహిత సంబంధ మేర్పరచుకొనుటకు
మానవులకు వీలగును.

- నామ రూపములు చెప్ప ఈ ప్రపంచములో వేరే
మియు లేదు. జడ పదార్థమున్ను మన విషయమును
బుజువు చేయుటకు వీలులేదు. కనుక భగవంతుని
ముక్తి నొసగు వేరియు లేదను విషయమే చివరకు
తేలు సారాంశము.

- పరిపూర్ణ జ్ఞానము కలుగనంత వరకు, [illegible]
వాద మంతరించదు.

- భగవంతుడు నకు విశేషమైన శక్తి కలదు. ఇచ్ఛా
మాత్రమున భగవంతుడు కావలెనని ప్రపంచము
ఉత్పన్నమగును, భగవంతుడు వలదనిన అవి
యెల్ల నిర్మూలమగును.

— జపము మరియు పారమార్థిక సాధన: ఈ సాధ
నల వలన పూర్వకృత కర్మ బంధనములు తొలగి
పోవును. భగవంతుని యెడల ప్రేమ, భక్తి లేని
యెడల భగవత్సాక్షాత్కారము లభింపదు. వీని
వలన ఇంద్రియ నిగ్రహము కలుగును.

- భగవంతుని నరులను భగవద్భక్తులకు భాగ్యవంతులు
ధన రూపమున సేవ చేయవలెను. పేదలు భగ
వన్నామ స్మరణ రూపమున భగవంతుని ఆరాధింప
వలయును.

ప్ర: భగవంతుని కొరకు మన కాలము మెట్లు కలుగును?
జ: నీవట్టి గాఢ వాంఛను బడయగలుగుదువు.
అందు భగవంతుని దయ కలదు.

(6)

- అందువలననే మనిషి శరీరమును విడిచి మరియొక శరీరమును దాల్చుచున్నాడు. చివరకొక కలకండ పలుకును తినవలయునను ఆశయైనను ఉన్నయెడల, అందుకై పునర్జన్మ కలుగును. ఆశను చిన్న విత్తనముతో పోల్చవచ్చును. మఱ్ఱి విత్తనము మిక్కిలి చిన్నది. అందుండి శాఖోపశాఖలుగల పెద్ద వృక్షము పెరుగును. ఒక ఒరలు నుండి లేచి మరియొక ఒరలో వాలగడు మంచునట్లు జీవాత్మ ఒక శరీరమును విడిచి మరియొక శరీరమును దాల్చును. ఆశ తొలివారు కోరికతో యెవరో, అయినను ఎవరు మరణింతురో. ఆశవలన మానవ శరీరము వచ్చినను, పూర్వజన్మలలో పుణ్యకార్యములను చేసియున్న యెడల మానవునకు పారమార్థిక జ్ఞానము పూర్తిగ నశింపదు.

- పరమాత్మను పొందుటకు చేసిన ప్రయత్నముల విఫలములలో కూడ విజయము. ఈ జన్మలో జపమును కఠిన సాధనలను చేసిన యెడల, రాబోవు జన్మలో నీవింకను ఎక్కువగా అభివృద్ధి గాంతువు.

- భగవంతుడు ఏకాకి వంటి వాడు. అడుగని వారికి ఆ పరమార్థ మొసగుచున్నను; మరియొక రెండవ అడిగినను వారికి తెలియదు. అది యెంతటి చిత్ర విలాసము.

- "నా శరీరమును, మనస్సును భగవన్నామ స్మరణచే పరిశుద్ధములగు గాక"

- భగవన్నామమును జపించి సార్థకము లగుటకే భగవంతుడు మనకు వెళ్ళ నిచ్చియున్నాడు.

శిష్యుడు:- జీవునకు సత్కర్మకు గాని, దుష్కర్మకు గాని మొట్టమొదటి ప్రేరణ యెచ్చట నుండి వచ్చుచున్నది? ఈ జన్మలోని ప్రేరణకు పూర్వజన్మలో చేసిన కర్మలే కారణమని, ఆ పూర్వపు జన్మలోని ప్రేరణకు దానికి ముందుండిన చేసిన కర్మములే కారణమని సమాధాన రూపముగా



(7)

మీకు చెప్పవచ్చును. కాని దీనికి మొదలెక్కడ?

అమ్మగారు: భగవంతుని సంకల్పము లేనిదే యేమియు జరుగదు; గడ్డిపరక కూడ చలింపదు. మంచి కాలము వచ్చినప్పుడు భగవంతుని ధ్యానించవలెనను కోరిక మానవునకు కలుగును; చెడ్డ కాలము వచ్చినప్పుడు దుష్కర్మలను చేయుటకు తగిన సమయములు వానికి లభించును. భగవత్సంకల్పమును బట్టి యేది యెప్పుడు జరుగవలెనో అది అప్పుడు జరుగుచుండును. మనుష్యుల కర్మలలో దైవసంకల్పము ప్రతిబింబించుచుండును. మన సమయము అంతయు మన మన కర్మలచే నిర్ణయింపబడినందున, మనము సర్వసమాన భావము కలిగియుండవలయును. ఇది యటుండ, కర్మలను కర్మలే హరించును. దీక్షా సత్కర్మచే యువుడను అది నీ ప్రారబ్ధ దుష్కర్మను పోగొట్టును. ధ్యాన, జప, పారమార్థిక చింతనాదుల బలముచే పూర్వ పాపములు నశించును.

- ఆధ్యాత్మిక శక్తిని ఎక్కువగా గాంచిన జీవులు తప్ప మిగిలిన జనులందరు ప్రేత శరీరములో నొక సంవత్సరము వరకు నుందురు. కుమారులు ఆ గతించిన జీవుల సంతృప్తి కొరకు గయలో పిండప్రదానము చేసి తర్పణము విడుతురు. దీని వలన, గతించిన జీవులకు ప్రేత శరీరము నుండి విమోచన కలుగును. తరువాత వారి వారి జీవలోకములకు వెళ్ళి, అచట సుఖమో దుఃఖమో కొంత కాలము అనుభవించి వారి వారి కోరికలకు అనుగుణమైన మనుష్య జన్మ నెత్తుదురు. మరి కొందరు లోకములో నుండియే మోక్షమును బడయుదురు. ఈ జన్మలో నేదో యొక పుణ్యకార్యమును చేసిన మనుష్యునకు ప్రేతావస్థలో పారమార్థిక జ్ఞానము పూర్తిగా నశింపదు.

(14) – అనంతమగు ఈ సృష్టి అంతయు
భగవంతునిది. నన్ను భగవంతుని ప్రార్థిం
పనిచో వాని కేమి తెలియు? భగవంతుని
తలపెట్టినను తలపెట్టని వారెందరో
యున్నారు. నీవాతని స్మరింపనిచో నీవే దుర
దృష్టవంతుడవు. వాని మాయచే జనులు వానిని
మఱచి యున్నారు. "మేము బాగనే యున్నాము; మీరు
నిట్లే యుండనిమ్ము". అని వారిని చూచి భగవంతు
డు నవ్వుచుండును.

– దిగువకు ప్రవహించుట నీటి స్వభావము; కాని
సూర్యుని కిరణములు నీటి నాకసము వైపునకు
తీసికొని పోవును. ఇట్లే మనస్సు సహజ
ముగా ఇంద్రియ విషయములపై, భోగ్య పదార్థము
లపై పోవుచుండును; కాని భగవంతుని దయ
యున్నచో మనస్సు ఉన్నత విషయములపై
పోగలుగుచుండును."

– "ధైర్యము విడనాడక ప్రార్థించుచుండుము. కాల
క్రమమున సర్వమును ప్రాప్తించును. పూర్వకాలపు
మునులును, ఋషులు ఎన్ని యుగములు భగవంతు
ని కొరకు తపస్సు చేసినను, కృతార్థులు కాలేదే!
ఒక క్షణములో నేను భగవంతుని ప్రత్యక్షమును
నను కొనుచున్నావా? ఈ జన్మలో కాకున్న
రాబోవు జన్మలోనో, ఆ జన్మలో కాకున్న దాని
తరువాతి జన్మలోనో నీ మనోరథము ఫలించును.
భగవంతుడు ప్రత్యక్షమగుట అంత సులభమా?
కాని యీసారి శ్రీ గురుదేవులు సులభమార్గమును
కనబఱచి యుండుటచే, భగవత్సాక్షాత్కారము
ఇప్పుడు అందరకును సాధ్యమగును" అని
అమ్మగారు చెప్పిరి.

– "నిరంతరాయంకారి కరములను ధ్యానమేల సాధ్యము
కాదు? వారేల భగవంతుని చూడజాలరు?
పరిశుద్ధాత్ములు జపము చేయునప్పుడు,
భగవంతుని పావన నామము తమలో పలుకుచుండి

(15) దానంతటదే పాతాళగంగ వలె పొంగి
వచ్చుచున్నట్లు వారికి తోచును. నామ
స్మరణ కొఱకు వారెట్టి ప్రయాస గాని
పడరు. నియమిత కాలములందు
బద్ధకము వదలిపెట్టి, ఆరంభకులు ధ్యాన
జపములను చేయవలయును.

– వార్ధక్యములో శరీరము బలహీనమగును.
మనస్సునకు ఏకాగ్రము తగ్గును. అట్టి
సమయమున శ్రేష్ఠమైన చేయుటకు సాధ్యపడునా?
మన మనస్సులోని కాలసమ్మనులు చిన్న తనమందే
తమను తామే భగవంతుని పాదపద్మములపై
మరల్చుచుండు అంతయు సమంజసము.
అందు కొఱకే వారికి సరియైన కాలము. (కిశోరులకు)
నాయనా! తపోనిష్ఠ పూజ మొదలగువాని
నిప్పుడే అభ్యసింపుము. కొంతకాలమైన
తరువాత నీకు సాధ్యమగునా? సాధింపవలసిన
దెల్ల ఇప్పుడే సాధింపుము. ఇదియే సరియైన
కాలము"

– ప్రతిదినము భగవన్నామము పదునైదు వేల
యిరువది వేల సార్లు జపించిన యెడల
మనస్సు స్థిరముగా నిలుచును. ~~[illegible]~~
నిరంతరాభ్యాసమువలన గ్రహించితిని. మొట్టమొ
దట జనులు దీని నభ్యసించి లాభము క్రియా
రులు కానిచో లాభము కనుపడ లేదనియెద్దు
కొనవచ్చును. కొంత భక్తితో వారు జపము
నభ్యసింపవలయును. కాని వారేమియు చేయక
"మేమేల కృతార్థులము కాలేదు" అని వెతలు చెప్పు
కొనుచుందురు.

– భగవన్నామమును నియమితముగ లెక్కగా
జపమాలతోనో, వ్రేళ్ళపైననో, మానసికముగనో
జపించుట వలన మనస్సు భగవంతుని వైపు
మరలును. సహజముగా మనస్సు బయటి
వైపు మరలును. ఇది యీ సాధన
వలన సరిగ తెలియుచుండును.

14 August

(16)

मंगलवार
Tuesday

వలన భగవంతుని సైన్యునకు చేరుకును.
భగవన్నామము ఉచ్చరించుచుండగా
సాధకుడు తన ఇష్ట దైవస్వరూపము
ను జూచి తన్మయుడగుచో, నటి జప
మారిపోవును. ధ్యానమునందు కృతార్థు
డగును వానికి సర్వము లభించును. స్వభావసిద్ధము
గా మనస్సు నిలుకడ లేని వస్తువు. అందుకే
మనస్సును స్థిరముగా నిలుపుటకై, ఆరంభ
మందు కొంచెముగా శ్వాసను నిగ్రహించుచు
సాధకుడు ధ్యానమభ్యసించవలెను. ఇది మనస్సు
నిశ్చలముగా నుండుటకు తోడ్పడును. కాని
దీనిని ఎవరైన మితము తప్పి చేసిన యెడల
మెదడునకు వేడి హెచ్చును. భగవద్దర్శన
మును గూర్చి కాని, ధ్యానమును గూర్చి కాని
నీవు సంభాషించవచ్చును గాని, మనస్సే సర్వము
అను విషయమును మఱువకుము. మనస్సు
స్థిరముగా నిలచిన, సాధకునకు సర్వము
లభించును.

"మానవులు భగవంతుని మఱచుటెంతయూ
సహజము కనుక, అవసరము కలిగినప్పుడెల్ల
భగవంతుడే భూమిపై అవతరించి, తానే
సాధనను చేసి ముక్తి మార్గమును కనుబఱచును.
భగవంతుడే సాకార జ్ఞానాదర్శమును, లోకము
నకు ప్రదర్శించెను"

## అపూర్వ మాతృ భక్తి:-

తొమ్మిది నెలలు మోసి కని, పెంచిన తల్లిని పోషించి, సేవించ
డము పుత్రుని బాధ్యత. జీవితమున అభ్యున్నతిని
పొందుటకు దైవ భక్తి, గురు భక్తి, మాతృ భక్తి, పితృ భక్తి,
కలిగియుండవలెను.




# దివ్యజనని ప్రథమ ఛాయాచిత్రం

దివ్యజనని శ్రీశారదాదేవి తొలి ఛాయాచిత్రాన్ని తీసి, ప్రపంచానికి అందించిన భాగ్యం స్వామి వివేకానంద పాశ్చాత్య శిష్యురాళ్ళు శ్రీమతి సారా బుల్, సోదరి నివేదితలకు దక్కింది. సనాతన సంప్రదాయాన్ని గౌరవించే శ్రీశారదాదేవి అపరిచిత వ్యక్తుల ముందు, బయట స్టూడియోల్లో ముఖానికి ఉన్న ముసుగు తీసి ఛాయాచిత్రం దిగేందుకు నిరాకరించారు. అయితే శ్రీమతి సారా బుల్, 'అమ్మా! మీ ఛాయాచిత్రాన్ని అమెరికా తీసుకువెళ్ళి, ఆరాధించుకునే భాగ్యాన్ని కల్పించండి' అని ప్రాధేయపడడంతో శ్రీశారదాదేవి అంగీకరించారు.

ఈ నేపథ్యంలో 1898 నవంబరులో కలకత్తా, బాగ్‌బజార్‌లో 10/2, బోస్‌పారా వీథిలోని, సోదరి నివేదిత గృహంలో శ్రీశారదాదేవి ప్రథమ ఛాయాచిత్రాన్ని తీయడం జరిగింది.

ఆ రోజు శ్రీమతి సారా బుల్, సోదరి నివేదితలు శ్రీశారదాదేవిని ఆసీనురాలిని చేసి శిరోజాలను, చీర పైటను సర్ది ఛాయాచిత్రం తీయడం కోసం సిద్ధం చేశారు. అప్పటి వరకు సహజంగానే ఉన్న దివ్యజనని ఆ ఏర్పాట్లు జరుగుతూ ఉండగానే క్షణాల్లో సమాధిస్థితిలోకి వెళ్ళిపోయారు. వికసిత నేత్రాలతో కూడిన ఆ భావాతీత స్థితిలోనే ఛాయాగ్రాహకుడు హ్యారింగ్‌టన్ శ్రీశారదాదేవి ఛాయాచిత్రాన్ని తీశాడు.

ఆ ఛాయాచిత్రాన్ని రాస్‌విహారీ మహరాజ్ (స్వామి అరూపానంద) శ్రీశారదాదేవికి చూపి, 'అమ్మా! మీ ఛాయాచిత్రం ఎలా ఉంది?' అని అడిగారు. అప్పుడు అమ్మ "బాగుంది! కానీ అప్పుడు యోగీన్ (స్వామి యోగానంద) ఆరోగ్యం బాగాలేదు. ఆ ఆలోచనల వల్ల చిక్కిపోయాను" అని అన్నారు. ❖



(తిథి ప్రకారం - డిసెంబర్ 13వ తేదీ - శనివారం 'శ్రీశారదాదేవి జయంతి')

Vol.71-12, Sri Ramakrishna Prabha (Telugu Monthly) December 2014, Regd. with the Registrar of Newspaper for India Under No.1120/57. Postal Registration No. HD-1071/2013-15. Licensed to Post Under WPP : AP/CPMG/HC-13/WPP/2013-14. Date of Publication : 18 November 2014

# దివ్యజనని ప్రథమ ఛాయాచిత్రం

దివ్యజనని శ్రీశారదాదేవి తొలి ఛాయాచిత్రాన్ని తీసి, ప్రపంచానికి అందించిన భాగ్యం స్వామి వివేకానంద పాశ్చాత్య శిష్యురాళ్లు శ్రీమతి సారా బుల్, సోదరి నివేదితలకు దక్కింది. సనాతన సంప్రదాయాన్ని గౌరవించే శ్రీశారదాదేవి అపరిచిత వ్యక్తుల ముందు, బయట స్టూడియోల్లో ముఖానికి ఉన్న ముసుగు తీసి ఛాయాచిత్రం దిగేందుకు నిరాకరించారు. అయితే శ్రీమతి సారా బుల్, 'అమ్మా! మీ ఛాయాచిత్రాన్ని అమెరికా తీసుకువెళ్లి, ఆరాధించుకునే భాగ్యాన్ని కల్పించండి' అని ప్రాధేయపడడంతో శ్రీశారదాదేవి అంగీకరించారు.



ఈ నేపథ్యంలో 1898 నవంబరులో కలకత్తా, బాగ్‌బజార్‌లో 10/2, బోస్‌పారా వీథిలోని, సోదరి నివేదిత గృహంలో శ్రీశారదాదేవి ప్రథమ ఛాయాచిత్రాన్ని తీయడం జరిగింది.

ఆ రోజు శ్రీమతి సారా బుల్, సోదరి నివేదితలు శ్రీశారదాదేవిని ఆసీనురాలిని చేసి శిరోజాలను, చీర పైటను సర్ది ఛాయాచిత్రం తీయడం కోసం సిద్ధం చేశారు. అప్పటి వరకు సహజంగానే ఉన్న దివ్యజనని ఆ ఏర్పాట్లు జరుగుతూ ఉండగానే క్షణాల్లో సమాధిస్థితిలోకి వెళ్లిపోయారు. వికసిత నేత్రాలతో కూడిన ఆ భావాతీత స్థితిలోనే ఛాయాగ్రాహకుడు హ్యారింగ్‌టన్ శ్రీశారదాదేవి ఛాయాచిత్రాన్ని తీశాడు.

ఆ ఛాయాచిత్రాన్ని రాస్‌విహారీ మహరాజ్ (స్వామి అరూపానంద) శ్రీశారదాదేవికి చూపి, 'అమ్మా! మీ ఛాయాచిత్రం ఎలా ఉంది?' అని అడిగారు. అప్పుడు అమ్మ "బాగుంది! కానీ అప్పుడు యోగీన్ (స్వామి యోగానంద) ఆరోగ్యం బాగాలేదు. ఆ ఆలోచనల వల్ల చిక్కిపోయాను" అని అన్నారు. ❖




(తిథి ప్రకారం - డిసెంబర్ 13వ తేదీ - శనివారం 'శ్రీశారదాదేవి జయంతి')



ఆధ్యాత్మిక అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

డిసెంబర్ 2014 వెల: ₹10



## సుబోధ

**శ్రీరామకృష్ణులు:** పులి జంతువులను ఆవురావురు మంటూ కబళించివేసే రీతిలో భగవత్ ప్రేమ అనే పులి కామక్రోధాదులనే శత్రువులను కబళించివేస్తుంది. ఒకసారి హృదయంలో భగవత్ ప్రేమ కలిగితే కామక్రోధాదులు అంతర్ధానమవుతాయి. శ్రీకృష్ణుని పట్ల అంతటి అనురాగం ఉండబట్టే బృందావనగోపికలకు అటువంటి స్థితి కలిగింది.

'అనురాగ అంజనం' అంటే ప్రేమ కాటుక. రాధ తన సఖీమణులతో 'నేను సర్వత్రా కృష్ణుణ్ణి చూస్తున్నాను' అన్నది. అందుకు వారు ఇలా అన్నారు: 'సఖీ! నువ్వు 'ప్రేమ కాటుక'ను కళ్ళకు రాసుకొన్నావు కదా! అందుచేతనే నువ్వు కృష్ణుణ్ణి సర్వత్రా చూడగలుగుతున్నావు.'

భగవంతుని స్మరించని బద్ధజీవులు సర్వదా కామినీ కాంచనాలలోనే వాసం చేస్తూ ఉంటారు. అలాంటప్పుడు వారి నుండి మహత్కార్యాలు ఎలా ఆశించగలం? వారు కాకులు కొట్టిన మామిడి పండు లాంటివారు. అలాంటి పండు దేవుని నైవేద్యానికి పనికిరాదు; మనుషులు కూడా తినడానికి సంకోచిస్తారు.

సంసారంలో బందీలైనవారు, పట్టుపురుగు లాంటివారు. ఈ పురుగు తాను స్వయంగా కట్టుకున్న గూటి పట్ల అమితమైన అపేక్ష కారణంగా గూటిని వదలి రాదు. చివరకు అది అక్కడే మరణిస్తుంది. ముక్తజీవులు కామినీ కాంచనాలకు వశులు కారు.

లౌకికులు భగవన్నామ స్మరణ చేస్తారు; కానీ దానిలో అనురాగం ఉండదు. లౌకికులకు పట్టుదల ఉండదు. జరిగితే జరగనీ, జరగకుంటే పోనివ్వు - ఇదే వారి వ్యవహారం. మంచినీళ్ళు అవసరమైనప్పుడు బావి త్రవ్వడం ప్రారంభిస్తారు. కానీ త్రవ్వకంలో బండరాయి అడ్డుపడ్డప్పుడు అక్కడ త్రవ్వడం ఆపుచేసి, మరో చోట త్రవ్వడం మొదలుపెడతారు. బహుశా అక్కడ ఇసుకపొర పడితే, ఆ స్థలం కూడా వదలిపెట్టి ఇంకో చోటుకు వెళతారు. మొదలుపెట్టిన స్థలంలోనే గట్టి పట్టుదలతో త్రవ్వకం కొనసాగిస్తేనే కదా నీరు లభిస్తుంది! ❖

**శ్రీరామకృష్ణ ప్రభ**
రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాదు-500 029
ఫోన్: 040-27667799, సెల్: 8801849494
E-mail : sriramakrishnaprabha@gmail.com
నిర్వాహక సంపాదకులు: స్వామి జ్ఞానదానంద
సంపాదకులు: స్వామి పరిజ్ఞేయానంద

ఆధ్యాత్మిక అమృతవాహిని
# శ్రీ రామకృష్ణ ప్రభ
సంపుటం: 71 సంచిక: 12 డిసెంబర్ 2014

## ప్రార్థన

**శారదాం శర్మదాం వన్దే శ్రద్ధాశీల శుభప్రదాం ।**
**హంస కాన్తాం హంస చిత్తాం హంస సేవా పరాయణాం ॥**

శ్రద్ధను, శీలమును, శుభములను, నిరతిశయ సుఖములను ప్రసాదించునదీ; పరమహంస పత్ని, పరమహంస యందే చిత్తం కలది, పరమహంస సేవయందే ఆసక్తి కలది అయిన దివ్యజనని శారదాదేవికి వందనములు.

– విష్ణుభట్ల విరచిత 'శ్రీశారదా వన్దనం'

## సూక్తి సౌరభం

**మూలం భుజంగైః శిఖరం విహంగైః**
**శాఖా ప్లవంగైః కుసుమాని భృంగైః**
**సంపేవ్యతే చందన పాదపోఽయం**
**పరోపకారాయ పరాం ప్రవృత్తిః**

"చందనపు చెట్టు పాదులో పాములు, పై భాగంలో పక్షులు, కొమ్మలపై కోతులు, పువ్వుల నిండా తుమ్మెదలు ఉంటాయి. వీటన్నిటినీ నిశ్శబ్దంగా భరిస్తూ, పరోపకారంలోనే బతుకు సాగిస్తుంది చందనపు చెట్టు."

**చిత్తశుద్ధి కలిగి చేసిన పుణ్యంబు**
**కొంచెమైన నదియు గొదువగాదు**
**విత్తనంబు మఱ్ఱివృక్షంబునకు నెంత**
**విశ్వదాభిరామ వినుర వేమ!**

"ఓ వేమా! మఱ్ఱి వృక్షం ఎంతో విస్తారంగా ఉంటుంది. కానీ దాని విత్తనం చాలా చిన్నది. అలాగే మంచి మనసుతో చేసిన పుణ్యకార్యం ఎంత చిన్నదైనప్పటికీ ఉత్తమ ఫలితాన్నే ఇస్తుంది."



# శ్రీరామకృష్ణ ప్రభ శాశ్వత నిధి





ఆధ్యాత్మిక జ్ఞానాన్ని పంచి పెట్టేందుకు 'శ్రీరామకృష్ణ ప్రభ' కృషి చేస్తోంది. నిధుల కొరత లేకుండా ఈ జ్ఞానయజ్ఞం నిరంతరాయంగా సాగేందుకు 'శ్రీ రామకృష్ణ ప్రభ శాశ్వతనిధి'కి ధన దానం చేసి ప్రోత్సహించాల్సిందిగా కోరుతున్నాం. దాతల పేర్లు పత్రికలో ప్రచురిస్తాం.

మహారాజ పోషకులు...... రూ. 10,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
రాజ పోషకులు............ రూ. 5,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
పోషకులు................. రూ. 1,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.

| దాతపేరు ఊరు | రూ. |
|---|---|
| మహారాజ పోషకులు : శ్రీ కైపా సంజీవరెడ్డి & శ్రీమతి శారదాదేవి, హైదరాబాదు (కీ॥శే॥యిడమకంటి నాగమ్మగారి జ్ఞాపకార్థం) | 10,000 |
| రాజ పోషకులు : శ్రీమతి సి. లీలావతి, ధర్మారెడ్డికాలనీ, కె.పి.హెచ్.బి. కాలనీ, హైదరాబాదు | 5,120 |
| పోషకులు : శ్రీ కందుకూరి కృష్ణమూర్తి, జనగామ, వరంగల్ జిల్లా (భార్య కీ॥శే॥ కందుకూరి రామలక్ష్మిగారి జ్ఞాపకార్థం) | 1,500 |
| పోషకులు : శ్రీమతి లంకా గాయత్రి, చందానగర్, హైదరాబాదు (కీ॥శే॥ లంకా వేంకటేశ్వరరావుగారి జ్ఞాపకార్థం) | 1,116 |
| పోషకులు : శ్రీ కె. మల్లారెడ్డి, విశ్వనాథకాలనీ, వరంగల్ | 1,116 |
| పోషకులు : శ్రీ అంబటి వేంకటేశ్వరరావు & శ్రీమతి లక్ష్మీకాంతం, సికింద్రాబాదు (కుమార్తె కీ॥శే॥ ఎ.అరుణకుమారిగారి జ్ఞాపకార్థం) | 1,116 |
| పోషకులు : శ్రీమతి నేదునూరి కనకతార & శ్రీ లింగయ్య, కరీంనగర్ (కీ॥శే॥ ఎన్.లసుమమ్మ, వెంకయ్యగార్ల జ్ఞాపకార్థం) | 1,116 |
| పోషకులు : శ్రీ పాశం దినేష్ నిశ్చల్, కె.ఆర్.ఎమ్.కాలనీ, విశాఖపట్నం (కీ॥శే॥ గణపా సాయికుమారి జ్ఞాపకార్థం) | 1,116 |
| పోషకులు : శ్రీ ఎస్. నవీన్ కుమార్, ఒనుకడెల్లి, కొరాపుట్ జిల్లా, ఒరిస్సా | 1,000 |



| చందా వివరాలు | | భారతదేశంలో | విదేశాలకు |
|---|---|---|---|
| విడి ప్రతి | : | ₹ 10 | - |
| సంవత్సర చందా | : | ₹ 100 | ₹ 1,500 |
| మూడు సంవత్సరాలకు | : | ₹ 280 | ₹ 4,500 |
| ఐదు సంవత్సరాలకు | : | ₹ 450 | ₹ 7,500 |
| ఇరవై సంవత్సరాలకు | : | ₹ 1,500 | ₹ 22,000 |

గమనిక: డిమాండ్ డ్రాఫ్ట్, మనియార్డర్లలో Ramakrishna Math, Hyderabad అని వ్రాయాలి.
పంపవలసిన చిరునామా: Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029.
చందాను ఆన్‌లైన్ http://rkmath.org/srkp ద్వారా చెల్లించవచ్చు.

## లోపలి పేజీల్లో...





### శ్రీరామకృష్ణ ప్రభ చందాదారులకు విన్నపం

ప్రియ పాఠకులారా!

* 'శ్రీరామకృష్ణ ప్రభ' పత్రిక కవరు మీద చిరునామాకు పైన మీ చందా నంబరు, కుడి వైపున మీ చందా గడువు ముగిసే నెల ఉంటాయి. మీ చందా గడువు పూర్తయ్యే నెలకు ముందుగానే సొమ్మును చెల్లించి చందాను పునరుద్ధరించుకోండి.
* మీ ఉత్తర ప్రత్యుత్తరాలన్నింటిలో తప్పనిసరిగా చందా నంబరు పేర్కొనాల్సిందిగా మనవి.
* మీ చిరునామా మారిన పక్షంలో 7వ తేదీ లోగా మాకు తెలియపరచినట్లయితే, వచ్చే నెల సంచిక నుండి మీ కొత్త చిరునామాకు పంపబడును
* ప్రతీ నెల 26 లేదా 27వ తేదీల్లో పత్రిక పోస్ట్ అవుతుంది. మీకు పత్రిక 15వ తేదీ లోపుగా చేరనట్లయితే, వెంటనే మాకు తెలియజేయగలరు.

శ్రీరామకృష్ణ ప్రభ ద్వారా అవిచ్ఛిన్నంగా సేవలు అందించాలన్నదే మా ఆకాంక్ష అందుకు మీ సహకారం కోరుతూ.... - సర్క్యులేషన్ మేనేజర్




SRI RAMAKRISHNA PRABHA, RAMAKRISHNA MATH
DOMALGUDA, HYDERABAD - 500 029.
Phone No: 040- 27667799, 88018 49494 E-mail : sriramakrishnaprabha@gmail.com



# ఆధునికత అనర్థదాయకమా ?

మనం ఆధునిక యుగంలో జీవిస్తున్నాం. కాబట్టి మనమంతా ఆధునికులం. నిజానికి ఆధునికత అంటే పరిసరాలు, పరికరాలు, సౌకర్యాలు, అలంకారాలు... ఒక్క మాటలో చెప్పాలంటే మన జీవనశైలి. సాధారణంగా ఆధునిక వ్యక్తి అంటే స్మార్ట్‌ఫోన్, ల్యాప్‌టాప్, ట్యాబ్‌లెట్, ఫేస్‌బుక్ ఖాతాలు మొదలైనవి ఉపయోగించేవాడనీ; ఆధునిక జీవనమంటే టీవీ, ఫ్రిజ్, ఏసీ, వాషింగ్‌మెషీన్ లాంటి యంత్రసాధనాలను వినియోగించేవాడనీ మన భావన. ఈ ఆధునికత మనిషి సుఖమయ జీవనానికి తోడ్పడుతుందే గానీ, ఆనందమయ జీవనానికి సహకరించడం లేదన్న విషయాన్ని విస్మరిస్తున్నాం. కేవలం బాహ్య పరికరాలు, సౌకర్యాల వల్లనే మనిషి ప్రశాంతంగా జీవించడం సాధ్యమని అనుకుంటే, ఈ ఆధునిక పరికరాలు లేనికాలంలో మనుషులు ప్రశాంతంగా జీవించలేదని అనగలమా?

“ఈ సౌకర్యాలేవీ లేనికాలంలో కుటుంబ బాంధవ్యాలు పదిలంగా ఉండేవి; మానవ సంబంధాలు గుబాళించేవి; ప్రశాంతత పరవళ్ళు తొక్కుతూ ప్రవహించేది” అన్న భావవీచికలు మనందరి హృదయాల్ని తాకుతూనే ఉన్నాయి. ఇది ఎవరూ కాదనలేని నిజం! అయితే, ఈ ఆధునిక జీవనం అనర్థదాయకమా? ఏ ఆధునికత అయినా, ఏ అభివృద్ధి అయినా మానవ హృదయ వికాసానికి దోహదపడేదిగా ఉండాలి; మానవత్వపు పరిమళాలు వెదజల్లేదిగా ఉండాలి; సంకుచిత్వం నుండి విశాలత్వం వైపు నడిపించేదిగా ఉండాలి; ఆత్మీయతానురాగాలను పెంచేదిగా ఉండాలి; భగవంతుని వైపు పురోగమింపజేసేదిగా ఉండాలి; చివరిగా మానవజన్మ లక్ష్యమైన ముక్తిపథాన్ని చేర్చేదిగా ఉండాలి. అలా జరగనినాడు ఏ ఆధునికత అయినా అనర్థదాయకమే! ఏ అభివృద్ధి అయినా అశాంతిదాయకమే!!

మూలాలు లేని చెట్టును ఊహించగలమా? పునాది లేని భవనాన్ని చూడగలమా? అలాగే, సంస్కృతీ సంప్రదాయాలనూ, మానవతా విలువలనూ, ఆధ్యాత్మిక జీవన విధానాలనూ విస్మరించిననాడు మానవజాతి మనుగడకు అర్థమే లేదు. మనిషి బాహ్యంగా ఎంత పురోభివృద్ధి సాధించినా, ఎంత ఆధునికంగా జీవించినా ఆంతరిక ఆనందానికి నోచుకోలేడు. ప్రశాంత జీవనాన్ని కొనసాగించలేడు. అన్నీ ఉన్నా ఆనందంగా జీవించలేని మనం, ఏమీ లేకపోయినా ఆనందంగా జీవించడమెలాగో తెలుసుకోవాలంటే మాతృమూర్తి శారదాదేవి జీవన విధానాన్ని అలవరచుకోవాలి. ఆధునికులమని భావిస్తూ అనాగరకుల్లా ప్రవర్తిస్తున్న మనకు పురాతన కాలంలోనే అధునాతన భావాలతో మాతృమూర్తి వ్యవహరించిన తీరు కనువిప్పు కావాలి.

**ఆత్మీయతను దూరం చేసే ఆధునికత:** శారదాదేవి చిన్నప్పుడే వంటచేయడం, చెరువు నుండి నీళ్ళు తీసుకురావడం, తమ్ముళ్ళకు స్నానం చేయించడం, బట్టలు ఉతకడం లాంటి గృహకృత్యాల్లో తల్లికి సాయపడేవారు. అలాగే పొలానికి వెళ్ళి పశువుల కోసం గ్రాసం కోసి తీసుకురావడం, పొలంలో పనిచేసే వారి కోసం భోజనం తీసుకువెళ్ళడం, జంధ్యాలు వడకడం లాంటి పనులు చేసి, తండ్రి పనిభారాన్ని తగ్గించేవారు. ఇలా శారదాదేవి తన వయస్సుకు మించిన పనిభారాన్ని వహించినందుకు ఆమె తల్లితండ్రులు మురిసిపోయేవారు. శారద లాంటి కూతుర్ని కన్నందుకు మా జన్మ ధన్యమైందని ఆనందపడేవారు.

అక్క శారదాదేవి చిన్నతనం నుండి తమ కోసం పడిన కష్టాలను తమ్ముడు కాళీకుమార్ తలచుకుంటూ, “అక్కయ్య ఇంట్లో అన్ని పనులూ చేసేది. ఆమె ఎన్ని కష్టాలుపడినా మాకు మాత్రం ఎలాంటి కష్టమూ కలగకుండా చూసుకునేది. జన్మజన్మలకు శారదే మాకు అక్కయ్యగా లభించాలి” అనేవాడు.

నేటి బాలబాలికలు తల్లితండ్రుల పట్ల, కుటుంబ సభ్యుల పట్ల వ్యవహరించే తీరును గమనిస్తే మనం ఆధునిక యుగంలో ఉన్నా ఆత్మీయతానురాగాలను కోల్పోతున్నామన్న భావన కలుగుతుంది. అంటే పిల్లలందరూ శారదాదేవిలా చిన్నప్పటి నుండే ఇంటి పనులన్నీ చేయాలని కాదు. కానీ కనీసం తల్లితండ్రులకు కష్టం కలిగించకుండా ప్రవర్తిస్తే చాలు, వారికి చిన్న చిన్న పనుల్లో సాయపడితే సంతోషమే! కానీ అలా జరగడం లేదు. అందుకు ముఖ్య కారణం ఆధునిక పరికరాల వినియోగం ఓ వ్యసనంగా మారడమే! సెల్‌ఫోన్‌లో ఎక్కడో దూరంగా ఉన్నవారి మాటల్లో పడి, పక్కనే ఉన్నవారిని పట్టించుకోకపోవడం; అంతర్జాలం సహాయంతో విశ్వాన్నంతా దర్శించి, పక్కనే ఉన్నవారిని గమనించలేకపోవడం. శారీరకంగా అందరూ ఒకే ఇంట్లో ఉన్నా, మానసికంగా దూరం చేయడంలో సెల్‌ఫోన్, ఇంటర్‌నెట్ లాంటి ఆధునిక సౌకర్యాలు విజయవంతమయ్యాయని చెప్పవచ్చు. ఈ మధ్య నిర్వహించిన ఒక సర్వేలో “సెల్‌ఫోన్, ఇంటర్‌నెట్‌ల ఉపయోగం, ఫేస్‌బుక్ లాంటి సామాజిక మాధ్యమాల వినియోగం ఓ వ్యసనంగా మారిందనీ, వాటిని వినియోగిస్తున్న వారిలో అధికశాతం 14 నుండి 19 సంవత్సరాల వయస్సు విద్యార్థులే” అని తేలింది. ఒక మానసిక వైద్యనిపుణుడు ‘నేటి పిల్లలపై ఆధునిక పరికరాల ప్రభావం’ అనే వ్యాసంలో సగటున ఓ పదిహేడేళ్ళ విద్యార్థి రోజుకు 12 గంటలు ఇంటర్‌నెట్ వినియోగంలో సమయాన్ని దుర్వినియోగ పరుస్తున్నాడని పేర్కొన్నాడు. ఈ ఆధునిక పరికరాల వినియోగం వల్ల కుటుంబ సభ్యులతో సన్నిహితంగా ఉండలేకపోవడం, చదువుల్లో వెనుకబడడం జరుగుతుందని విశ్లేషించారు.

తిథి ప్రకారం - డిసెంబర్ 13వ తేదీ శనివారం ‘శ్రీశారదాదేవి జయంతి’




కాబట్టి ఈ ఆధునిక పరికరాలు మన ఆత్మీయతానురాగాలకు అవరోధం కాకుండా జాగ్రత్త పడాలి. కుటుంబంలో తల్లి, తండ్రి, పిల్లలు - అందరూ కలివిడిగా మాట్లాడుకోవాలి; ఒకరి అవసరాలకు మరొకరు స్పందించాలి. అప్పుడే కుటుంబ సభ్యుల మధ్య ఆత్మీయతానురాగాలు బలపడతాయి. అలా కాకుండా కేవలం ఆధునిక పరికరాలతోనే అనుబంధం పెంచుకుంటే మన అవసరాలకు స్పందించే హృదయం వాటికి లేదు. అలాంటి సౌభాగ్యం కేవలం మనిషికి మాత్రమే భగవంతుడు ప్రసాదించాడు. అదే మానవజాతికి వరం. ఆ మహావరాన్ని సద్వినియోగం చేసుకోవాలంటే మనం పరికరాలను వాడుకోవాలే గానీ, అవి మనల్ని వాడుకునేంత బలహీనులం కాకూడదు. అప్పుడే ఆత్మీయతానురాగాలకు దూరం కాకుండా జీవించగలం.

**ఆధ్యాత్మికతను మరిపించే ఆధునికత:** శారదమ్మ రోజంతా ఎన్ని పనుల్లో మునిగివుండేవారో అమ్మ జీవిత చరిత్రను చదివిన వారికి తెలుస్తుంది. ఏళ్ళ తరబడి కట్టెలతో వంట చేస్తూ, గొట్టంతో గాలి ఊదుతున్నప్పుడు వచ్చిన పొగను పీలుస్తూ, కళ్ళ వెంట నీళ్ళుకారుస్తూ ఎంతో కష్టపడి వంటచేసేవారు. శ్రీరామకృష్ణులకు సపర్యలు చేస్తూ, అక్కడకు వచ్చిన భక్తుల కోసం కూడా వంట చేయడం, వడ్డించడం, భోజన ప్రదేశాన్ని శుభ్రం చేయడం, వంట పాత్రలు కడగడం... ఇలా అన్ని పనులూ విసుగూ విరామం లేకుండా చేసేవారు శారదాదేవి. ఎన్నో పనులతో రోజంతా తీరిక లేకుండా గడిపిన శారదమ్మ రోజుకు లక్షసార్లు భగవన్నామాన్ని జపించేవారు.

మనం కొంతసేపు పనిచేస్తే చాలు కోపతాపాలను వ్యక్తం చేస్తాం. పైగా అందరూ మనల్ని గుర్తించాలని భావిస్తాం. కానీ శ్రీరామకృష్ణులకూ, భక్తులకూ అమ్మ ఏళ్ళ తరబడి సేవలు చేస్తూ దక్షిణేశ్వరంలో ఉన్నప్పటికీ అక్కడున్నవారిని అడిగితే ‘శారదాదేవి గురించి వినడమేగానీ మేము ఎప్పుడూ ఆమెను చూడలేదు’ అని చెప్పేవారు. దీన్నిబట్టి శారదమ్మ ఎంత నిశ్శబ్దంగా, నిగూఢంగా, నిరాడంబరంగా, నిర్మలంగా జీవించారో అర్థం చేసుకోవచ్చు.

ఆ రోజుల్లో గ్యాస్‌స్టౌలు లేవు, గ్రైండర్లు లేవు, వాషింగ్ మెషీన్‌లు లేవు, మోటార్ పంపులు లేవు. ఈ యంత్ర సాధనాలేవీ లేని కాలంలో కూడా అన్ని పనులూ చేస్తూ శారదమ్మ ఆధ్యాత్మిక సాధనలను చేయగలిగేవారు. మరి ఈ సౌకర్యాలన్నీ ఉన్న నేటి కాలంలో ఎందరం సంతోషంగా మన పనులు చేయగలుగుతున్నాం? ఎందరం భగవన్నామస్మరణ, సద్గ్రంథపఠనం, స్తోత్రపారాయణాలు చేయగలుగుతున్నాం? పైగా సాధనలు చేయడానికి సమయం సరిపోవడం లేదని వాపోతుంటాం. నిజానికి ఈ ఆధునిక పరికరాల సహాయంతో పనులన్నీ శీఘ్రంగా ముగించుకొని, మిగిలిన సమయాన్ని ఆధ్యాత్మిక సాధనలకు వినియోగించుకోవాల్సిందిపోయి టీవీలకు, సినిమాలకు అంకితమిస్తున్న ఆధునికులం మనం. అలాకాకుండా ఈ ఆధునిక సౌకర్యాలను మన ఆధ్యాత్మిక ప్రగతికి తోడ్పడేలా మలచుకోగలిగితే శ్రేయోదాయకమే!

**సనాతనంలో అధునాతనం:** సమాజంలో జాతివివక్ష, కులమత పట్టింపులు, ఆచారాలు, అంటరానితనం, బాల్య వివాహాలు ప్రబలంగా ఉన్న రోజుల్లో ఆధునిక భావజ్వాలతో సమాజంలోని అనాగరక అంధకారాన్ని పారద్రోలారు శ్రీశారదాదేవి. సనాతన జీవనమార్గంలో పయనిస్తూ అధునాతన భావాలకు అంకురార్పణ చేసిన శారదాదేవి ధైర్యసాహసాలు,విశాలదృక్పథం, దూరదృష్టి ఆధునికులమైన మనల్ని ఆశ్చర్యపరచక మానవు.

శారదాదేవి బాల్యవివాహాలను వ్యతిరేకించి, బాలికల విద్యను ప్రోత్సహించారు. బాలికల కోసం సోదరి నివేదిత ప్రారంభించిన పాఠశాలను సందర్శించి ఆమె చేస్తున్న కృషిని అభినందించారు. విదేశాలకు వెళ్ళినవారు కఠినశిక్షను అనుభవించాలనే నియమాన్ని ఉల్లంఘించి, స్వామి వివేకానందను విదేశాలకు వెళ్ళమని ఆశీర్వదించి పంపారు. కులమత పట్టింపులకు వ్యతిరేకంగా మహమ్మదీయులను, నిమ్నకులస్థులను ఆదరించేవారు. ఆధ్యాత్మిక సంస్థలు కేవలం శాస్త్రాధ్యయనం, జపధ్యానాలు, పూజాపునస్కారాలు, జ్ఞానయజ్ఞాలకే పరిమితమైన రోజుల్లో ‘సేవాయోగం’ కూడా ఒక ఆధ్యాత్మిక సాధనే అని ప్రోత్సహించారు. కాశీలో రామకృష్ణ సంఘ సన్న్యాసులు అనాథలకూ, రోగులకూ చేస్తున్న సేవలను ప్రశంసించారు. ఆ సేవా కార్యక్రమాలకు పది రూపాయలు విరాళంగా కూడా ఇచ్చి మనస్ఫూర్తిగా ఆశీర్వదించారు.

సనాతనంలో అధునాతన భావాలతో జీవించిన శారదాదేవి అడుగుజాడలను అనుసరిస్తూ అధునాతనంలో సనాతన భావాలను విడువకుండా జీవించగలిగిననాడు ఈ ఆధునికత అనర్థదాయకం కాదు, ఆనందదాయకమే! ❖

ఎవరితోనూ మరీ చనువుగా మెలగవద్దు. ఇతరుల విషయాలలో కుతూహలం కనబరచవద్దు. ప్రాపంచిక వ్యవహారాలను తగ్గించి జపధ్యానాల యందు సమయాన్ని వినియోగించు. - శ్రీశారదాదేవి




## గోరుముద్ద - స్వామి సుప్రియానంద

# సంకల్పసిద్ధి

అనేక రకాల సంకల్పాల్ని చేసుకొని 'జనవరి ఒకటి నుండి మొదలు పెట్టాలి' అనుకుంటాం. మొదలు పెడతాం కూడా! ఆ సంకల్పాలు ఫిబ్రవరి నెల చూడ కుండానే మాయమైనప్పుడు 'మనసు గతి ఇంతే' అను కుంటూ సర్దుకుపోతాం.

అసలు మన సంకల్పాలకు బలం (శక్తి) ఎక్కడ ఉంది? ఎక్కడ నుండి వస్తుంది? ఈ ప్రశ్నలకు సమాధానం కోసం వైద్య, మనోవైజ్ఞానిక శాస్త్రవేత్తలు ప్రయత్నిస్తున్నారు. వారు కనుగొన్న విషయాలు మనకేమన్నా పని కొస్తాయేమో చూద్దాం.

'సంకల్పం' అనేది కోరిక నుండి పుడుతుంది. ఆ కోరిక యొక్క తీవ్రత (intensity) ఇచ్ఛాశక్తి. దీనినే 'విల్ పవర్' (will power) అంటారు. ఇచ్ఛాశక్తి వల్లనే సంకల్పం సిద్ధిస్తుంది. మనిషి తన కోరిక తీరకపోతే మానసిక ఆందోళన (mental stress)కు గురి అవుతాడు.

ఇచ్ఛాశక్తి, మానసిక ఆందోళన – ఈ రెండూ ఉత్తర, దక్షిణ ధ్రువాలు. వాటికి పొంతన కుదరదు. దీనికి ఉదాహరణ: పొగ త్రాగడం అలవాటున్న వ్యక్తి 'నేను ఇక నుండి సిగరెట్ తాగను' అని తీర్మానించుకుంటాడు. కానీ దాన్ని అమలు చెయ్యలేక పోతాడు. కారణం, అతని సంకల్పంలో 'విల్ పవర్' లేదు. అందులో ఉన్నది కేవలం 'వోన్ట్ పవర్' (నకారాత్మక శక్తి).

'విల్ పవర్' మనసుకు సంబంధించినది అనుకుంటాం. కానీ ఇది శరీరం – మనసు (body-mind) రెండిటికీ సంబంధించినది అంటున్నారు శాస్త్రవేత్తలు. శరీరానికి కావలసిన విశ్రాంతి, పౌష్టికాహారం అందకపోతే, దానివల్ల 'విల్ పవర్' దెబ్బతింటుందట!

'విల్ పవర్' పెరగాలంటే శరీరానికి వ్యాయామం (exercise), మనసుకు ధ్యానం (meditation) అవసరమట. 'అలాగైతే రోజూ వ్యాయామం, ధ్యానం చెయ్యాలి' అన్న సంకల్పం ఎలా సిద్ధిస్తుంది?

ఈ సందేహానికి సమాధానం స్వామి వివేకానంద మాటల్లో...

"Do not say we are weak; What can we not do? Everything can be done by us; we all have the same glorious soul, let us believe in it - 'మేము దుర్బలురము' అని ఎన్నడూ అనకండి. మనం చేయలేనిది ఏమిటి? మనం సమస్తం చేయగలం. మనందరిలో ఆ దివ్యాత్మ కలదు. ఆ ఆత్మశక్తి యందు నమ్మకం కలిగి ఉందాం!"

కాబట్టి మన ఆత్మశక్తి (spirit) యందు విశ్వాసం ఉంచి ప్రయత్నిస్తే మన సంకల్పం తప్పక సిద్ధిస్తుంది. ❖





# శ్రీరమణుల దృష్టిలో శ్రీరామకృష్ణులు



– మహేందర్ మొలుమూరి

భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంసపై శ్రీరమణ మహర్షి విశేషమైన వ్యాఖ్యలు చేసేవారు. ఒక మహానుభావుడి అంతరంగం మరో మహానుభావుడికే తెలుస్తుందన్నట్లుగా, శ్రీరామకృష్ణుల అవతారతత్త్వాన్ని అర్థం చేసుకొని, విశ్లేషించిన అతి కొద్దిమందిలో శ్రీరమణ మహర్షి ఒకరు. శ్రీరామకృష్ణులకు సంబంధించిన ఎన్నో ఆధ్యాత్మిక అనుభూతులను రమణ మహర్షి తనదైన రీతిలో విశ్లేషించి, తమ సన్నిధికి వచ్చిన భక్తుల సందేహాలు తీర్చేవారు.

**భక్తి, జ్ఞాన సంగమం :** ఒకసారి స్విట్జర్‌ల్యాండ్‌కి చెందిన కార్ల్ జంగ్ అనే మనోవైజ్ఞానికుడు ఓ వ్యాసంలో భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంసనూ, శ్రీరమణ మహర్షినీ పోలుస్తూ 'భక్తి నుంచి జ్ఞానానికి పురోగమనం అది! ఒకరు భక్తికి ప్రతీక అయితే, మరొకరు జ్ఞానానికి!' అన్నారు.

ఆ మాటల్ని వినగానే శ్రీరమణులు వెంటనే నిటారుగా కూర్చొని, ఆ పోలికకు అభ్యంతరం చెప్పారు. 'ఏ దారిన శిఖరాన్ని చేరినా తరువాత మిగిలిన మార్గాలన్నీ అర్థమవుతాయి. అయినా శ్రీరామకృష్ణుల గురించి మీకు ఏమర్థమవుతుంది? అసలు రామకృష్ణులకు తెలియనిదేమిటి? ఆయనలో భక్తి, జ్ఞానం అన్నీ ఉన్నాయి. ఆయనలో లేనిదేమిటి?' అని ఉద్ఘాటించారు.

**అరుదైన గురుశిష్యులు :** ఒకనాడు విద్యావంతుడైన ఓ యువకుడు వచ్చి, భగవాన్ శ్రీరమణ మహర్షిని ఉద్దేశించి 'శ్రీరామకృష్ణ పరమహంస, స్వామి వివేకానందను అత్యున్నత ఆధ్యాత్మిక శిఖరంగా మలచారు; కేవలం స్పర్శ వల్లే నిర్వికల్ప సమాధి స్థితికి తీసుకెళ్ళగలిగారు. భగవాన్! మీరు నాక్కూడా అలా చేయగలరా?' అని ప్రశ్నించాడు.

కాసేపు మౌనంగా ఉన్న తరువాత శ్రీరమణులు నెమ్మదిగా అతనితో, 'అయితే నీవు ఇంకొక వివేకానందవన్నమాట!' అన్నారు. ఆ యువకుడు ఆశ్చర్యపోతూ, ఏం చెప్పాలో తెలియక ఇబ్బందిపడ్డాడు. ఆ తరువాత మహర్షి ఏమీ మాట్లాడకపోయేసరికి, ఆ యువకుడు నెమ్మదిగా ఆ మందిరంలో నుంచి బయటకు వెళ్ళిపోయాడు. ఆ తరువాత భగవాన్ రమణులు అక్కడి భక్తులతో "ఆత్మవిమర్శ, ఆత్మవివేచన – వీటి ఆవశ్యకతను గుర్తించడం చాలా కష్టం. ఎవరికి వారే పరిపూర్ణులమనుకుంటారు. ఈ యువకునికి, నేను కూడా శ్రీరామకృష్ణుల లాగా శక్తిమంతుడనేనా అని పరీక్షించే కుతూహలం ఉందే గానీ, తాను అసలు వివేకానందుని వలె అర్హుడనేనా? అన్న విచక్షణ లేకపోయింది. తాను పరిపూర్ణుడనని అనుకోవడం వల్లే అతనికి నన్ను పరీక్షించాలనిపించింది. శ్రీరామకృష్ణులు, వివేకానంద అరుదైన గురుశిష్యులు. శ్రీరామకృష్ణులు తన అవతార లక్ష్యానికి ఒక్క వివేకానందనే ఎన్నుకోవడానికి కారణం – ఆయన విశేషమైన ఆధ్యాత్మికోన్నతిని కలిగి ఉండడమే!' అన్నారు భగవాన్ రమణులు.

**జ్ఞాని స్థితి అనిర్వచనీయం :** ఓసారి ఓ భక్తుడు శ్రీరమణ మహర్షితో 'జ్ఞానికి సుఖ దుఃఖాలూ, శరీరబాధలూ లేవంటారు కదా! మరి శ్రీరామకృష్ణ పరమహంస "అమ్మా! నీ దర్శనమైనదని నవ్వి, కాలేదని నేల మీద పడి విలపించేవారట కదా! అదీ కాకుండా శరీరానికి వ్యాధి వల్ల బాధ కలిగినప్పుడల్లా సహించ లేక, 'అమ్మా! అమ్మా!' అంటూ దుఃఖించేవారట! అదేమిటి? జ్ఞానులకూ ఈ సుఖదుఃఖాలు ఉంటాయా?" అని ప్రశ్నించాడు.

అప్పుడు శ్రీరమణులు "బాహ్యంగా మీరు వారి శరీర చేష్టల్ని చూసి అలా మాట్లాడుతున్నారు. దేహక్రియలను బట్టి జ్ఞాని స్థితిని నిర్ణయించడానికి వీలు లేదు. ఆ సుఖం సుఖమా? ఆ దుఃఖం, దుఃఖమా? 'ఆహా! నాకు దర్శనమిచ్చావే?' అని ఆనందంతో హసించేవారు కొందరు. 'ఎంత కరుణ ప్రభో!' అని కన్నీరు కార్చేవారు కొందరు! శ్రీరామకృష్ణ పరమహంసా అంతే! 'అమ్మా! నీ కరుణ! అమ్మా! నీ దయ!' అంటూ విలపించి, నవ్వి ఏమేమో చేసేవారట. ఇంతకూ వారి స్థితి మనకు అర్థం కావాలంటే ముందు మన స్థితి మారాలి. అయినా ఆయన అవతారపురుష డనడానికి నీ ధ్రువీకరణ పత్రం ఏమీ అవసరం లేదు" అని అభిప్రాయపడ్డారు. దాంతో ఆ భక్తుడు నిశ్శబ్దమైపోయాడు. ❖

(డిసెంబర్ 30న భగవాన్ రమణమహర్షి జయంతి)




# కపటమింత లేదు కరుణ కలదు

- స్వామి జ్ఞానదానంద

విజ్ఞతతో కూడిన విదురుడి హితవాక్యాలు విని, కనువిప్పు కలిగి అతనితోనే కలసి ధృతరాష్ట్ర దంపతులు అరణ్యాలకు పయనమయ్యారు. మరునాడు ఉదయమే యథావిధిగా తన దినచర్యలో భాగంగా, పెదనాన్న, పెద్దమ్మ, పినతండ్రిలకు నమస్కరించేందుకు ధర్మరాజు రాజమందిరానికి విచ్చేశాడు. అయితే అక్కడ ధృతరాష్ట్రుడు, గాంధారి, విదురుడు కనిపించలేదు. దాంతో ఆ పాండవాగ్రజుడు పలవరించిపోయాడు. అదే భవనంలో సుదూరంగా సుఖాసీనుడైన సంజయుడితో యుధిష్ఠిరుడు కలవరపాటుతో "సంజయా! మా పెత్తల్లీ, పెదతండ్రీ ఈ మేడలో కనిపించడం లేదు. వారెక్కడికి వెళ్ళారో తెలియదు. మా పెదతండ్రి గారు కంటిచూపు కరవైన మూడుకాళ్ళ ముసలి. మా పెద్దమ్మ కడివెడు శోకంతో కన్నీరుమున్నీరుగా విలపిస్తూ ఉంటుంది. మా పినతండ్రిగారు మాకు ప్రాణ సమానుడు, సౌజన్యమూర్తి. ఈ ముగ్గురూ మమ్మల్ని వదలిపెట్టి ఎటు వెళ్ళిపోయారో తెలియదు. మా పెదనాన్న ఒకవేళ తాము చేసిన తప్పులకు పశ్చాత్తాపం చెంది భార్యతో కలసి గంగలో దూకాడేమోనని అనుమానంగా ఉంది" అని ఆవేదనపడుతూ...

**భార్యతోడ తండ్రి పరితాపమున బడు**
**కపటమింత లేదు కరుణ కలదు**
**పాండు భూవిభుండు పరలోకగతుడైన**
**మమ్ము పిన్నవాండ్ర మనిచె నతడు...** అని కన్నీరు మున్నీరుగా విలపించాడు. ధర్మరాజు పితృప్రేమ చూసి సంజయుడు కరిగిపోయాడు. కన్న తల్లితండ్రులు కాకపోయినా, పెదనాన్న, పెద్దమ్మ, పినతండ్రిల విషయంలో యుధిష్ఠిరుడు ఎంతో మన్ననతో మెలిగేవాడు. వార్ధక్యంలో పెద్దల విషయంలో పిల్లలు ఎలా మసలుకోవాలో ఆ పాండవాగ్రజుడు పాటించి చూపాడు.

**సార్థక నామధేయుడు:** మహాభారతంలో యుధిష్ఠిరుడంటే సాక్షాత్తూ ధర్మస్వరూపుడు. ఎన్ని అవాంతరాలు ఎదురైనా సత్యాన్నీ, ధర్మాన్నే నమ్ముకొని ముందుకు నడిచినవాడు. నిజానికి పాండవులకు తీరని ద్రోహం చేశారు కౌరవులు. వారి గృహానికి నిప్పంటించారు; ద్రౌపదిని నిండుసభలో అవమానించారు; ఆ అమాయకుల్ని అన్యాయం చేసి అరణ్యాలకు వెళ్ళగొట్టారు. ధృతరాష్ట్రుడు ఏ సందర్భంలోనూ కొడుకులను వారించలేదు; పాండవుల విషయంలో జరుగుతున్న అఘాయిత్యాలకు అడ్డు చెప్పలేదు. అయినా ధర్మరాజు ఇవేవీ మనస్సులో పెట్టుకోలేదు. పైగా పెదనాన్నను '**కపటమింత లేదు; కరుణ కలదు**' అని శ్లాఘిస్తూ తన హృదయవైశాల్యాన్ని చాటుకున్నాడు. తమను కని, పెంచి ప్రయోజకుల్ని చేసిన కన్నవారినే కనికరం లేకుండా వదిలేస్తున్నవారు, ఇలాంటి ధర్మాత్ముల నడవడికను చూసి ఎంతో నేర్చుకోవాలి. ఇంటికి పెద్దగా, వంశానికి వారసుడిగా, రాజ్యాధినేతగా ఆ పాండవాగ్రజుడి పరిణతితో కూడిన ప్రవర్తన పదుగురికి ఆదర్శం.

ధర్మనిరతితో ఆ కుంతీపుత్రుడు సాక్షాత్తూ శ్రీకృష్ణభగవానుడి అభినందనలను, ఆశీస్సులను అందుకున్నాడు. అందుకే భగవాన్ శ్రీరామకృష్ణులు కూడా ఓ సందర్భంలో తమ భక్తులతో "కౌరవవంశంలో పుట్టిన మహాపురుషుడు యుధిష్ఠిరుడు. అలాంటి వ్యక్తి తమ వంశంలో వేయి దోషాలున్నా ఆ వంశజులను ఉద్ధరిస్తాడు. ధర్మరాజు సుగుణాల కలబోత. పాండవుల విషయంలో దుర్యోధనుడు పగబూనాడు; అడవుల పాల్జేశాడు. నానా కష్టాలు పెట్టాడు. అయినా కౌరవులను గంధర్వుడు బంధించినప్పుడు తమకు చేసిన అపకారాన్ని మరచి వారిని విడిపించాడు. అదీ అతని గొప్పతనం" అన్నారు.

**ధర్మాత్ముడు... ధన్యాత్ముడు:** మనం ఈ రోజుల్లో ఏదో ఒక నెపంతో విలువలకు తిలోదకాలిస్తూ, చేసే తప్పుడు పనులకు సమర్థనలు వెతుక్కుంటూ, మంచికి కాలం లేదని అవకాశవాదులుగా మారిపోతూ, మరోవైపు దెబ్బకు దెబ్బ తీయాలని తహతహలాడుతూ ఉంటాం. కానీ పరిస్థితులు ఎంత ప్రలోభపెట్టినా మహాపురుషులు సత్యానికీ, ధర్మానికీ కట్టుబడే ఉంటారు. కాలాతీత వ్యక్తులుగా నిలిచిపోతారు. దుర్యోధనుడు, శకుని, కర్ణుడు, దుశ్శాసనాదులు పాండవుల పట్ల ధర్మం తప్పి వ్యవహరించారు. అరణ్యవాసమే కాక అజ్ఞాతవాసమూ చేయాలని ఆజ్ఞాపించారు. ఆ కష్టకాలంలో దాయాదుల దాష్టీకాలు భరించలేక, తమ్ముళ్ళు, భార్య ద్రౌపది ఎంతో కుమిలిపోయారు. చివరకు ఓ రోజు భీముడు, "రాజా! మనం ఈ విధంగా ధర్మార్థ కామాలకు దూరమై అరణ్యంలో నివసించడం బాగా లేదు. నీ మూలాన మేమందరమూ ఈ విధంగా 'ధర్మం, ధర్మం' అంటూ ఓర్పు వహిస్తుంటే శత్రువులు మనల్ని చేతకానివాళ్ళనుకుంటారు. ఏ ధర్మం తనకూ, మిత్రులకూ బాధాకరంగా ఉంటుందో అది ఒక దుర్వ్యసనం, ఆ ధర్మం కుధర్మం" అన్నాడు. అప్పుడు ధర్మరాజు ఎంతో నిబ్బరంతో...

**మమ ప్రతిజ్ఞాం చ నిబోధ సత్యాం, వృణే ధర్మమమృతాజ్జీవితాచ్చ।**
**రాజ్యం చ పుత్రాశ్చ యశో ధనం చ సర్వం న సత్యస్య కలాముపైతి॥**

'నా ప్రతిజ్ఞ సత్యమైందని తెలుసుకో! అమృతం కంటే, జీవితం కంటే ధర్మాన్నే నేను అధికంగా కోరుకుంటాను. రాజ్యం గాని, పుత్రులు గాని, యశస్సు గాని, ధనం కాని సత్యంలో పదహారో వంతుకు కూడా సరితూగవ'ని స్పష్టం చేశాడు. అందుకే ఆ ధర్మాత్ముడు ధన్యాత్ముడయ్యాడు.

**ఆశ్రిత పాలకుడు...ఆదర్శనాయకుడు:** నమ్ముకున్న విలువల విషయంలోనే కాదు, తనను నమ్ముకున్న వ్యక్తుల విషయంలో కూడా యుధిష్ఠిరుడు ధర్మనిరతిని తప్పనివాడు! అందుకే యక్షుడి ప్రశ్నలకు సమాధానాలు చెప్పి, చనిపోయిన తమ్ముళ్ళలో ఎవరి ప్రాణాలు కావాలో కోరుకొమ్మంటే తన సొంత తమ్ముళ్ళయిన భీముడి, అర్జునుడి ప్రాణాలు కాకుండా, పినతల్లి మాద్రి కొడుకైన నకులుడి ప్రాణాలు కోరుకున్నాడు. చివరకు స్వర్గంలో అడుగుపెట్టే సమయంలో కూడా తనను నమ్మి వచ్చిన శునకానికి ప్రవేశం కల్పిస్తేనే, నేనూ స్వర్గంలోకి వస్తానని పట్టుపట్టాడు. దేవతలు ధర్మరాజుకు, అతని సోదరులు నరకంలో బాధపడుతూన్నట్లు మాయాబలం చేత చూపించి, 'నీవు మాత్రం ఉత్తమలోకాలకు వెళ్ళవలసి ఉంది; రా! తీసుకొని వెళతాం!' అంటారు. అప్పుడు ధర్మరాజు 'నేను కూడా నా బంధుజనంతో ఈ నరకంలోనే ఉంటాను; నాకు మీరిచ్చే ఉత్తమ లోకాలతో పని లేదు' అంటాడు. ఆ మాటలు విని, దేవతల్లోని ధర్మదేవుడు అతనితో 'కుమారా! నేను నిన్ను యక్షుడిగా కనబడి ప్రశ్నలు వేసినప్పుడు, శునకంగా నీ వెంట వచ్చినప్పుడు పరీక్షించాను. ఇది మూడవ పరీక్ష. అన్ని పరీక్షల్లోనూ నీ ధర్మస్థైర్యాన్ని నిరూపించుకున్నావు' అని మెచ్చుకుంటాడు. ఇలా ఎన్నో సందర్భాల్లో యుధిష్ఠిరుడు నైతిక నిబద్ధత నుంచి కించిత్తు కూడా పక్కకు తప్పుకోలేదు. ఎన్నో శక్తిసామర్థ్యాలున్నప్పటికీ ప్రదర్శనకూ, అహంకారానికీ పోకుండా సౌమ్యత్వానికీ, సౌహార్దానికే అతడు ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చాడు. అందుకే తిక్కన గారు ఆయనను 'మెత్తని పులి' అని అభివర్ణించారు.

**కేవల మర్త్యుడే ధర్మసుతుడు... :** ఇంటికి పెద్ద అయినవారు మాటలతో కన్నా, ప్రవర్తనతో చిన్నవారిని ప్రభావితం చేయగలగాలి. అలా తన తమ్ముళ్ళకే కాదు తన వారందరికీ ఆ పాండు నందనుడు గౌరవనీయుడయ్యాడు. అందుకే విరాట పర్వంలో ఓ మారు ద్రౌపది తన భర్త ఘనతను కొనియాడుతూ, ఆయన మామూలు మనిషి కాదు...

**ఎవ్వని వాకిట నిభమద పంకంబు; రాజభూషణ రజోరాజి నడగు**
**నెవ్వని చారిత్రమెల్ల లోకములకు నొజ్జయై వినయంబు నొరపు గరపు**
**నెవ్వని కడకంట నివ్వటిల్లెడు చూడ్కి మానిత సంపద లీనుచుండు**
**నెవ్వని గుణలత లేడు వారాసుల కడపటి కొండపై కలయ బ్రాకు**
**నతడు భూరి ప్రతాప మహాప్రదీప**
**దూర విఘటిత గర్వాంధకారవైరి**
**వీర కోటిరమణివేష్టితాంఘ్రి**
**తలుదు కేవల మర్త్యుదె ధర్మసుతుడు**

"ఎవరి ముంగిట్లో మదపుటేనుగుల శరీరాల నుంచి కారే మదజలధారల వలన ఏర్పడిన బురదను, ఆయనను సేవించడానికి వచ్చే మహారాజుల అలంకారాల ఒరిపిడి వల్ల రాలిన ధూళి కలిగిన దుమ్ము అణచివేస్తుందో... ఎవరి ఉత్తమ ప్రవర్తన లోకాలకన్నిటికీ ఆదర్శమై, వినయ వర్తనానికి ఒరవడి అవుతుందో... ఎవరి కటాక్ష వీక్షణం గొప్ప సంపదలను కలుగజేస్తుందో... ఎవరి సుగుణాలనే తీవెలు సప్తసముద్రాలు దాటి మేరు పర్వతం మీదకు కలయ పాకుతాయో... ఎవరి పరాక్రమమనే ఘనదీపం శత్రువుల గర్వమనే అంధకారాన్ని దూరంగా పారదోలుతుందో... ఎవరి పాదాలు శత్రువీరుల కిరీటాలలోని రత్నకాంతులతో సదా చుట్టబడి వెలిగిపోతూ ఉంటాయో... అలాంటి ధర్మరాజు కేవలం మానవుడా? కాదు!" అని కీర్తిస్తుంది.

**'ధర్మం' అనగానే రామాయణంలో శ్రీరామచంద్రుడు స్ఫురిస్తాడు; మహాభారతంలో ధర్మరాజు గుర్తొస్తాడు. ధర్మదేవుని అంశావతారమైన యుధిష్ఠిరుడిని నాయకుడిగా చేయడం ద్వారా పంచమవేదమైన మహాభారతాన్ని ధర్మోపదేశ ప్రధాన గ్రంథమని వ్యాసుడు సూచించాడు.**

**ప్రత్యర్థులలో కూడా పవిత్రతను చూసే గుణగ్రహణ పారీణత్వం ఆ పాండవాగ్రజుడిది. ఆయనను ధర్మం నుంచి తప్పించడం సాక్షాత్తూ దేవతలకే సాధ్యం కాలేదు. అందుకే ధర్మరాజు లాంటి కుమారుడు ఒక్కడున్నా, ఆ వంశమే తరించిపోతుంది.**

మనసంతా స్వార్థపూరితంగా మారిపోయిన మన తరం, సంపూర్ణంగా ఆ స్థాయిలో ధర్మాన్ని అనుష్ఠించలేకపోయినా, కొంతైనా అనుసరించగలిగితే అలాంటి పుణ్యాత్ములు పుట్టిన భూమిలో పుట్టినందుకు సార్థకతను చేకూర్చుకున్న వారమవుతాం. ❖

**పరుడైననూ ఎవడు హితమొనర్చునో వాడే బంధువు; స్వకీయుడే యైననూ బాధ కలిగించువాడు శత్రువే! దేహంలో పుట్టిన రోగం బాధాకరం, కానీ అరణ్యంలో పుట్టిన ఓషధి బాధను నివృత్తి చేస్తుంది. - హితోపదేశం**

ప్రాచీన, మధ్యయుగాలనాటి

# మన సంస్కృతి

- స్వామి హర్షానంద

**"ఒక వ్యక్తి తనను తాను అసహ్యించుకొంటున్నట్లయితే అదే పతనానికి హేతువు. పూర్వీకుల చరిత్రను అవమాన కరంగా భావిస్తే, ఆ జాతి అంతానికి చేరుకున్నట్లే!" అంటారు స్వామి వివేకానంద. గత వైభవాన్ని మర్చిపోయినంత కాలం మనమూ, మన దేశం స్తబ్ధతలో మునిగిపోతాం. అందుకే, మన ప్రాచీన సంస్కృతి గురించి తెలుసుకోవాలి. గడచిపోయిన సంగతులు తెలుసుకొంటూ, భవిష్యత్ మహత్కార్యాల సాధన వైపు నడవాలి. మన ప్రాచీన భారతీయ సంస్కృతిని గుర్తు చేసేందుకు చేస్తున్న ప్రయత్నమే ఈ వ్యాసాల పరంపర. సుప్రసిద్ధ రచయిత, బెంగుళూరు రామకృష్ణ మఠం అధ్యక్షులు స్వామి హర్షానంద మహరాజ్ మధ్యయుగాల కాలం దాకా విలసిల్లిన మన సంస్కృతిని 'శ్రీరామకృష్ణ ప్రభ' పాఠకులకు 2014 ఫిబ్రవరి సంచిక నుండి వివరిస్తున్నారు.**

## హిందువుల చిత్ర, శిల్ప కళలు

సారస్వత - విజ్ఞానాలకు ప్రతీకగా హైందవులు ఆరాధించే సరస్వతీదేవి చతుర్భుజగా కన్పిస్తుంది. ఒక చేతిలో పుస్తకం, రెండు చేతులలో వీణావాద్యం, మరొక చేతిలో జపమాలతో దేవి సాక్షాత్కరిస్తుంది. ఆమె రూపానికి గొప్ప సాంకేతిక వైశిష్ట్యం ఉంది. పుస్తకం - అపరావిద్యకు చిహ్నం. వీణ - లలిత కళలకూ, జపమాల - ఆధ్యాత్మిక జ్ఞానానికీ ప్రతీకలు. లౌకిక విద్యలు మానవుని జీవనభృతికి తోడ్పడతాయి. లలితకళలు వారి జీవితాన్ని సుసంపన్నం చేసి ఆనందాన్నీ, భావసౌఖ్యాన్నీ కలుగజేస్తాయి. ఆధ్యాత్మిక జ్ఞానం జీవిత పరమార్థాన్ని నెరవేరుస్తుంది. సరస్వతీదేవిని ఈ విధంగా చిత్రించిన హైందవం అన్నిరకాల విద్యలనూ దైవభావంతో చూస్తుంది.



హైందవ కళలు బహుముఖాలు. చిత్రలేఖనం, రంగులు వేయడం, శిల్పం, నాట్యం, నటన, సంగీతం అందులోని భాగాలు. నిజానికి వీటిని చతుష్షష్టి (64) కళలుగా తెలియజేస్తారు. వీటిలో కొన్ని: పువ్వుల అలంకరణ, అనేక రకాల పడకల అలంకరణ, మాయాజాలం, వంటలు -వార్పులు, పుస్తకపఠనం, కొయ్యపని, పోట్లాటలు, పద్యరచన, శారీరక వ్యాయామం, శిరోజాల అలంకరణ మొదలైనవి.

**చిత్రలేఖనం :** హిందూ సంస్కృతి అన్ని కళలనూ దైవీభూతంగా భావిస్తుంది. వీటి సృష్టి, ప్రాచుర్యం చతుర్ముఖ బ్రహ్మ లాంటి దేవతలు లేక భరతముని లాంటి మహర్షులచే జరగడం విశేషం. చిత్రకళ లేక రంగులు వేయడం నర - నారాయణులలో నారాయణ మహర్షితో ప్రారంభమైనట్లు భావిస్తారు. ఊర్వశి చిత్రాన్ని భూమి మీద ఆయన గీసి దానికి ప్రాణం పోసినట్లు ఐతిహ్యం. ఆయన విశ్వకర్మకు బోధించిన 'చిత్రసూత్ర' ఇప్పుడు లభించడం లేదు.

చిత్రలేఖనంలో ప్రామాణిక గ్రంథాలు రూపానికీ, సాముద్రికానికీ, భావ వ్యక్తీకరణకూ, సౌందర్యానికీ, రంగులకూ ప్రాధాన్యమిస్తాయి. ఈ గ్రంథాలు దామోదర గుప్తా 'కుట్టనిమత', విష్ణు దివ్యోత్తర పురాణ (క్రీ.శ. 1129), శిల్పరత్న.

రంగుల వేయడంలో నాలుగు విషయాలను వివరించారు: తెల్లని రంగులు వేయడానికి తగిన వస్త్రాన్ని ఎంచుకోవటం; ఆ వస్త్రం దృఢంగా ఉండడానికి బియ్యపు పిండి లాంటి పూత పూయడం; చిత్రం రూపురేఖలు నల్లని రంగులో వేయడం; తగిన రంగులు పూసి చిత్రాన్ని పూర్తి చేయడం.

ఈ గ్రంథాలలో రంగుల వాడకాన్ని గురించి అనేక వివరాలున్నాయి. ఎగుడు దిగుడుగా ఉన్న భూ ఉపరితలాలు, సముద్రపు అలలు, మంటలు, పొగ, మేఘాలు, జీవాలు, మానవుల అవయవాలను చిత్రించడాన్ని ఇందులో వివరించారు.

భారతదేశంలో ఇప్పటి వరకు బయల్పడిన పురాతన చిత్రకళను పరిశీలిస్తే అతి ప్రాచీనమైన ఖైమోర్, వింధ్య పర్వతాలలోని గుహచిత్రాలు; రాయగఢ్, మీర్జాపూర్ గుహలలోని చిత్రాలు ఉన్నాయి. ఇవన్నీకూడా కొన్ని వందల ఏళ్ళకు పూర్వం మొరటు రాతి పనిముట్లతో గీసిన వేటకు సంబంధించిన చిత్రాలు.

రాయగఢ్ కొండలలోని జోగిమర గుహల చిత్రాలు (సర్గూజ జిల్లా, మధ్యప్రదేశ్ - క్రీ.పూ. 200), అజంతా (క్రీ.పూ. 100, మహారాష్ట్ర) అతి ప్రాచీనమైనవి.

అజంతా చిత్రాలు నిపుణుల ద్వారా (క్రీ.పూ. 100 - క్రీ.శ.700 కాలంలో) చిత్రితమయ్యాయి. ఈ చిత్రాలు ఆసియా ఖండంలోని టిబెట్, ఆఫ్ఘనిస్తాన్, చైనా, కొరియా, జపాన్ లాంటి దేశాల చిత్రలేఖనాన్ని ప్రభావితం చేసినట్లు కన్పిస్తుంది. ఈ చిత్రరాజాలు అన్నివిధాలుగా పరిపూర్ణత చెంది చక్కని హావభావాలతో, రంగులతో అందంగా ఉంటాయి. ప్రకృతిలోని



వృక్షాలు, పుష్పాలు, జంతువులు, మానవులు (రాజులు, రాణులతోసహా), స్వర్గాధిదేవతలు, బుద్ధుడు, బోధిసత్వుడు వగైరా ఈ చిత్రాలలోని కొన్ని అంశాలు. 'భాగ్' గుహలు (గ్వాలియర్ - మధ్యప్రదేశ్)లోని చిత్రాలు వేరొక పద్ధతికి చెందినవైనా అజంతా చిత్రాలలాగే కనిపిస్తాయి. కర్ణాటకలోని బాదామి (క్రీ.శ. 700), శిట్టనివాసల్ - పుదుక్కోటై (తమిళనాడు, క్రీ.శ. 750), మహారాష్ట్రలోని ఎల్లోరా (కైలాస మందిరం, క్రీ.శ. 800), తంజావూరు బృహదీశ్వరాలయం (క్రీ.శ. 1100), తిరువాన్కూర్ (కొచ్చిన్ - కేరళ) మందిరాలలోని చిత్రాలు ప్రఖ్యాతి గాంచిన కళాఖండాలు.



తరువాత కాలంలో ప్రఖ్యాతి గాంచిన చిత్రకళ రాజపుత్ర లేక రాజపుట్ సంప్రదాయానికి చెందినది. హైందవ సంస్కృతిలో ఒక విశిష్టమైన స్థానం ఈ సంప్రదాయానికి ఉంది. ఆనాటి చిత్రలేఖనం లౌకిక, అలౌకిక జీవిత సత్యాలను సమపాళ్ళలో చూపగల్గింది. క్రీ.శ. 15 నుండి 18వ శతాబ్దం వరకు ప్రభవించిన ఈ చిత్రకళకు జైపూర్ కేంద్రం.

వివిధ మానవ భావోద్రేకాలను చిత్రిస్తూ ఇంద్రియ లోలత్వం, దానిని అధిగమించడానికి మానవ ప్రయత్నాలను చక్కగా చిత్రీకరించారు. శ్రీ రామాయణ-భారత దృశ్యాలు, రాధాకృష్ణుల రాసలీలలు, కృష్ణ-శివారాధన సంప్రదాయాలు ఆనాటి చిత్రకళకు ప్రధానాంశాలు. ఈ సంప్రదాయంలో హిందూ సంగీతంలోని ప్రామాణిక గ్రంథాల ఆధారంగా రాగ-రాగిణుల చిత్రీకరణ ఒక గొప్ప విశేషంగా చెప్పుకోవాలి. రాజపుత్ర సంప్రదాయం హిమాలయ ప్రాంతాలైన నూర్పూర్, చంబల్, జమ్మూ, కాంగ్రా ప్రాంతాలకు వ్యాపించింది. ఈ వ్యాప్తితో దానికి పహాడీ సంప్రదాయం అనే పేరు వచ్చింది. ఖటోక్ రాజుల (క్రీ.శ. 15-17వ శతాబ్దాలు) కాలంలో ఈ కళ అత్యున్నత స్థాయికి చేరుకుంది.

**శిల్పకళ:** చిత్రలేఖనానికి అనుబంధంగా శిల్పకళ అభివృద్ధి చెందింది. వేదాలలో దేవతల మూర్తి వర్ణనలు ఉన్నాయి. కనుక ఈ కళ క్రీ.పూ. 3000 నాటికే వ్యాప్తిచెందినట్లు భావించవచ్చు. బోధాయన గృహ్యా సూత్రాలు (క్రీ.పూ. 600) విష్ణువు, గణేశ, యమ మూర్తుల వర్ణనే కాకుండా వాటి ప్రతిష్ఠాపన, ఆరాధన పద్ధతులను వివరించినవి. హరప్పా (క్రీ.పూ. 3000) త్రవ్వకాలలో ఇత్తడి విగ్రహాలు బయల్పడ్డాయి.

వైదిక కాలంలో విగ్రహాలను కొయ్య, రాతి, లోహం, మట్టి, ఇంకా అరుదైన రాళ్ళతో చెక్కారు. మౌర్యుల కాలం (క్రీ.పూ. 300) నాటికి దేవాలయాలలో అర్చా విగ్రహాలు, ఇండ్లలో ఆరాధనకు విగ్రహాలు కనిపిస్తాయి. మూర్తి ఆరాధనతో ఈ శిల్పకళ ఒక శాస్త్రంగా రూపొందింది. శుక్రనీతి సార, మాయామత, మానసార, బృహత్ సంహిత, శిల్పరత్న, శిల్పసార, సుప్రభేదాగమ, కారణాగమ మొదలైనవి ఈ కళకు సంబంధించిన ప్రామాణిక గ్రంథాలు. మూర్తి శిల్పానికి అవసరమైన వివరాలను ఈ గ్రంథాలు ప్రస్తావించాయి.

అర్చామూర్తులను శైవ, వైష్ణవ సంప్రదాయాలుగా విభజించారు. అవి మళ్ళీ 3 రకాలు - చల ప్రతిమలు, అచల ప్రతిమలు, చలాచల ప్రతిమలు. చలప్రతిమలంటే లోహంతో చేసి, ఉత్సవాలలో ఉపయోగించేవి. వాటిని 'ఉత్సవ విగ్రహాలు' అని పిలుస్తారు. ఇక, అచల ప్రతిమలను 'ధ్రువబేరాలు' లేక 'మూల విగ్రహాలు'గా పిలుస్తారు. వీటిని రాతితో చెక్కి, అచల ప్రతిష్ఠ చేస్తారు. గుడిలో ప్రతిష్ఠ చేసి, ఉత్సవ విగ్రహాలుగా కూడా వాడే మూర్తులను 'చలాచల ప్రతిమలు'గా పిలుస్తారు. పూరీ జగన్నాథ విగ్రహాలను ఇందుకు ఉదాహరణగా చెప్పుకోవచ్చు.

విగ్రహాలను స్థానక (నిలుచున్నవి), ఆసన (కూర్చొని ఉన్నవి), శయన (విశ్రాంతి స్థితి) భంగిమలలో చెక్కుతారు. విష్ణు విగ్రహాలే శయన భంగిమలో కనిపిస్తాయి. విగ్రహాలు ఉగ్ర, శాంత రూపాలలోనూ ఉంటాయి. దేవతామూర్తుల హస్తముద్రలు, ఆసనం, చిహ్నాలు, వసనాలు, ఆభరణాలను అనుసరించి ఆ దేవత భావప్రకటనను గుర్తించవచ్చు. హస్తముద్రలలో అభయ, వరద ముద్రలు, ఆసనాలలో పద్మాసన, యోగాసనాలు సర్వ సాధారణం. శివ-శక్తుల విగ్రహాలు డమరు, త్రిశూలం, పాశం, అంకుశం, బాణాలు, ఖడ్గం మొదలైన చిహ్నాలు కలిగి ఉంటాయి. చక్రం, శంఖం, గద, పద్మాలు వైష్ణవ విగ్రహ సూచకాలు.

ఈ విగ్రహ నిర్మాణానికి చాలా నియమ నిబంధనలున్నాయి. విగ్రహం ఎత్తు, వెడల్పు పరిమాణం, హస్తాల పరిమాణం తాళమాన సంప్రదాయాన్ని అనుసరించి నిర్ణయించేవి. ఒక తాళము అరచేతి ప్రమాణం కలిగి (మధ్య వ్రేలు నుండి అరచేతి మొదలు వరకు) ముఖం పొడవుకు సమానం. నవతాళ పద్ధతిలో విగ్రహం ఎత్తు తొమ్మిది తాళాల పరిమాణం కలిగి, దేవతా విగ్రహాలకు అనుకూలంగా ఉండేది.

కాలాంతరంలో నాలుగు రకాల శిల్పకళా పద్ధతులు అభివృద్ధి చెందాయి. అవి - మదురై పద్ధతి, కంచి పద్ధతి, చాళుక్య-హోయసాల పద్ధతి, బెంగాలీ పద్ధతులు (బెంగాల్, ఒరిస్సా, అస్సామ్‌లలో ఆచరించే పద్ధతి). ఈ సంప్రదాయాల వారు ఒకే రకమైన ప్రమాణాలను పాటించినా, వారి వారి ప్రత్యేకత ఉండేది. ❖

**అనువాదం: డాక్టర్ పి.వి.రెడ్డి**

**జీవితంలో పురోభివృద్ధిని సాధించదలచిన వ్యక్తి అతినిద్ర, ఆలస్యం, భయం, కోపం, సోమరితనం, ఎంతకాలమైనా పనిని తెమలనీయకపోవడం - ఈ ఆరు దోషాలను విడువవలెను. - హితోపదేశం**

జీవితం అన్నాక గెలుపోటములు సహజం. మనం ఓడినా, గెల్చినా, పైకెదిగినా, పతనమైనా అది మన ఒక్కరికే సంబంధించిన విషయం అనుకుంటాం. మనం ఏమైనా ఎవరికి బాధ అనుకుంటాం. ఎవరికీ నష్టం లేదనుకుంటాం. కష్టం కాదనుకుంటాం. కానీ నిజంగా మనతో, మన మంచి చెడులతో, గెలుపోటములతో ఎవరికీ సంబంధం లేదా? పొరపాటు. మనం ఒక్కరుగా, ఒకే ఒక్కరుగా పైనుంచి నీరవ నిశ్శబ్ద శూన్యంలోకి ఊడిపడలేదు. పుట్టడం ఒంటరిగానే అయినా, పుట్టాక మన చుట్టూ కన్న తల్లితండ్రులున్నారు. మన కుటుంబం ఉంది. సమాజం ఉంది. దేశం ఉందీ. ప్రపంచం ఉంది. మనతో అన్నివిధాలా అందరికీ బంధం ఉంది. సంబంధం ఉంది. అలాగే, మనకూ అందరితో!



# అందరివాళ్ళం!

- చక్కిలం హేమంత్ కుమార్

అరణ్యంలో ఓ చెట్టుంది. చూడడానికి అది ఒంటరిది. ఉన్నది అడవిలోనైనా దానితో ఎవరికీ సంబంధం లేదని ఎలా చెప్పగలం? అది ఆయుర్వేద మూలికలిచ్చే ఔషధ వృక్షం కావచ్చు. పళ్ళిచ్చే పనస చెట్టు కావచ్చు. పరిమళాన్నిచ్చే గంధపు చెట్టూ కావచ్చు. కొండ కోనల్లో ప్రవహించే నది ఉంది. దాని మానాన అది అవకాశం ఉన్న మార్గంలో ప్రవహిస్తూ వెళ్ళి సముద్రంలో కలుస్తుంది. దానితో మనకు సంబంధం లేదా? తాగునీళ్ళు, సాగునీళ్ళు, అభిషేక సంబారం. ఇక ఆకాశంలో చంద్రుడు... ఒడిలోని పసివాడు అన్నం తినాలన్నా, మనస్సుకు హాయినిగొలిపే వెన్నెల కావాలన్నా - ఇలా ఎన్నని? ఇక సూర్యుడో! చెప్పనే అక్కర్లేదు.

భగవంతుని సృష్టిలో వ్యర్థ సృజన ఏదీ లేదు. చిన్నా పెద్దా తారతమ్యం లేదు. ఎంత పెద్ద బట్ట కుట్టాలన్నా చిన్న సూది కావాలి. ఎంత భారీ వంట రుచిగా చేయాలన్నా చిటికెడు ఉప్పు కావాలి. మరి మనిషి? భగవంతుని సృజనలోనే అత్యంత శ్రేష్ఠమైన, ఉత్కృష్టమైన జీవి. ఆయన తనకు ప్రత్యామ్నాయంగా అత్యంత శ్రద్ధతో, ప్రత్యేకంగా సృష్టించుకున్న ఉన్నతోన్నత మానవ రూప మాధవుడు. మరి అలాంటి మనిషి ఇతరులకు చెందకుండా ఎలా ఉంటాడు!

ఒక రామకృష్ణ పరమహంస... ఆయన పండించిన ఆధ్యాత్మిక మధుర ఫలాలను ప్రపంచం మొత్తం ఆనందంగా ఆస్వాదిస్తూనేవుంది. ఒక హిట్లర్... అతడు సృష్టించిన మారణ హోమం సంబంధం లేని దేశాలతో సహా ప్రపంచాన్ని అగ్నిగుండం చేసింది. గాంధీ మహాత్ముడందించిన సత్యాహింసల శాంతి పవనాలతో ప్రపంచం నేటికీ సేదదీరుతోంది. స్వామి వివేకానంద అందించిన సేవాయోగం స్ఫూర్తిగా నేటికీ (రేపు కూడా) ఎందరో ఆ మార్గంలో నడుస్తున్నారు, మరెందరో నడిచేందుకు ముందుకు వస్తున్నారు. ఒక ఇంట్లో వెన్న కాస్తే వీధి మొత్తం కమ్మని నేతి వాసన వస్తుంది. ఒక ఇంట్లో కూర మాడితే ఆ ఘాటు చుట్టు ప్రక్కల ఎందర్నో ఉక్కిరిబిక్కిరి చేస్తుంది. ప్రాణాలతో నడియాడే మనిషి, పరమాత్మకు ప్రత్యామ్నాయమైన మనిషి కనురెప్ప కదిల్చినా ప్రపంచం మీద ప్రభావం చూపిస్తుంది. ఆ స్పృహతో మనం జీవించాలి.

ఇతరుల మీద ప్రభావం చూపించగలిగేది 'సెలబ్రిటీలు' మాత్రమే కాదు. సృష్టిలోని ప్రతి జీవీ, ప్రతి అణువూ వారి వారి, వాటి వాటి జీవన విధానం ద్వారా, జీవ స్వభావం ద్వారా, వ్యక్తిత్వం ద్వారా, ఉపకార, అపకార ప్రవృత్తి ద్వారా ఇతర ప్రపంచం మీద ప్రభావాన్ని కలిగి ఉంటాయి. పక్షిని చూసి మనిషి విమానాన్ని కనిపెట్టాడు. చేపను చూసి నావ నిర్మాణాన్ని చేపట్టాడు. యోగాసనాలన్నీ జీవ, జంతువుల చేష్టలే, అంగ విన్యాసాలే.

మనిషిగా, మహోన్నత జీవిగా మనం ప్రపంచానికి ఆదర్శం కావాలి. కనీసం... హితకారకం కాకపోయినా, అపకారకం కారాదు. కానీ జీవించాలనుకున్నప్పుడు ఆ జీవన విధానాన్ని ఎంచుకునే స్వేచ్ఛ, అవకాశం మనకున్నప్పుడు ఉన్నతంగా జీవిద్దాం. ఉత్తమంగా జీవిద్దాం. నిజమే! పూలు పరచిన బాటలో నడవాలన్నా ఆ అవకాశం మనకు లేకపోవచ్చు. కానీ ముళ్ళ బాటను, మురికి త్రోవను తప్పుకుని నడిచే అవకాశం మాత్రం కచ్చితంగా మనకుంది. విధి లేకపోతే శుభ్రం చేసుకునైనా! మనం ఎవరికో ఏమో కానక్కర లేదు. మన మానసిక జీవన విధానం ద్వారా అందరికీ బంధువవుదాం! అందరివాళ్ళమవుదాం!! ❖





# తానె తానె ఇందరి గురుడు

- శ్రీమతి బి.కృష్ణకుమారి

అన్నమయ్య పదామృతం

తానె తానె ఇందరి గురుడు
సొనబట్టిన భోగి జ్ఞానయోగి
అపరిమితములైన యజ్ఞాలు వడిజేయ
ప్రపన్నులకు బుద్ధి పచరించి
తపముగా ఫలపరిత్యాగము సేయించు
కపురుల గరిమల కర్మయోగి ॥
అన్ని చేతలును బ్రహ్మార్పణ విధిజేయ
మన్నించి బుద్ధులను మరుగ జెప్పి
ఉన్నత పదమున కొనరంగ కరుణించు
పన్నగ శయనుడె బ్రహ్మయోగి
తనరగ కపిలుడై దత్తాత్రేయుడై
ఘనమైన మహిమ శ్రీవేంకటరాయడై
ఒనరగ సంసార యోగము కృపసేయ
అనిమిష గతులను అభ్యాసయోగి

ధర్మసంరక్షణార్థం దయామయుడైన భగవంతుడు అపురూప అవతారాలెన్నో దాల్చాడు. సృష్టి, స్థితి, లయకారకుడైన ఆ సర్వేశ్వరుడు, నిర్గుణ నిరాకారుడే కాదు సంకల్పమాత్రాన సగుణ సాకారుడిగా సాక్షాత్కరించగలడని పలుమార్లు నిరూపించాడు. ఆ పరంపరలో పరమాత్ముడు పరమ భాగవతోత్తములైన అత్రిమహర్షి, అనసూయ దంపతులకు వరప్రసాదంగా దత్తాత్రేయుడై ఈ లోకంలో అవతరించాడు. ఆధి దైవిక, ఆధి భౌతిక, ఆధ్యాత్మిక తాపాలను అధిగమించిన అత్రిమహర్షి, దుర్గుణాలకు మూలమైన అసూయను జయించిన అనసూయ దంపతులు లక్ష్మీనాథుడిని వివిధ సాధనలతో ప్రత్యక్షం చేసుకున్నారు. వారి భక్తికి మెచ్చిన ఆ శ్రీహరి 'ఓ ముని దంపతులారా! నేను మీకు దత్తుడనయ్యాను' అంటూ మీకు సుపుత్రుడిగా జన్మిస్తానని వరమిచ్చాడు. అలా సాక్షాత్తూ శ్రీమన్నారాయణుడు శ్రీరామ, శ్రీకృష్ణ అవతారాల కంటే ముందే అత్రి, అనసూయ దంపతులకు దత్తాత్రేయుడై ఈ లోకానికి దిగివచ్చాడు. ఆ అవతార తత్త్వాన్ని అన్నమయ్య **'తానె తానె ఇందరి గురుడు'** అన్న కీర్తనలో అద్భుతంగా అక్షరీకరించాడు. సర్వజీవులను ఉద్ధరించడమే తన లక్ష్యంగా విచ్చేసిన దత్తాత్రేయుడు చతుర్యుగ అవతారమని సనాతన గ్రంథాలు శ్లాఘించాయి. అలాంటి మూర్తికి పదకవితా పితామహుడు గురుస్థానమిచ్చి జ్ఞానయోగి, కర్మయోగి, బ్రహ్మయోగి, అభ్యాసయోగి అని అభివర్ణిస్తున్నాడు.

## జ్ఞానయోగి...

దత్తాత్రేయులు ఇప్పటి నేపాల్ ప్రాంతంలోని చిత్రకూటం దగ్గరనున్న 'అనసూయ పహాడ్' అనే చోట అవతరించాడని భక్తుల విశ్వాసం. అందుకు చిహ్నంగా ఇప్పటికీ అక్కడ ఒక దత్తమందిరముంది. ప్రహ్లాదుడు లాంటి భాగవతోత్తములకు యోగ విద్యను ఉపదేశించి కృతార్థులను చేసిన దత్తాత్రేయ స్వామిని శ్రీవాసుదేవానంద సరస్వతిస్వామి తమ 'దత్త పురాణం'లో...

**దత్తాత్రేయం శివం శాంత మింద్రనీల నిభం ప్రభుమ్ ।**
**ఆత్మ మాయారతం దేవ మవధూతం దిగంబరమ్ ॥**
**భస్మో ద్ధూళిత సర్వాంగం జటాజూట ధరం విభుమ్ ।**
**చతుర్బాహు ముదారాంగం దత్తాత్రేయం నమామ్యహమ్ ॥**

అని ఆ దివ్యరూపాన్ని కీర్తించారు. అంతటి మహిమాన్విత దేహం దాల్చిన భగవానుడిని పద్మావతీపతి ప్రియభక్తుడు పరమగురువుగా సంబోధిస్తున్నాడు. తానే ఇందరి గురువని, భోగానికి పదును పెట్టి, అధిగమించిన భోగియే కాదు జ్ఞానసిద్ధిని పొందిన జ్ఞానయోగి అని కూడా కొనియాడుతూ...

**తానె తానె ఇందరి గురుడు, సొనబట్టిన భోగి జ్ఞానయోగి** అని స్తుతిస్తున్నాడు. భోగాలను అణచుకోవటం కాకుండా, వాటికి అతీతస్థితికి చేరుకొని, కామక్రోధ భయాలను వీడి అంతర్ముఖులు అయినవారే జ్ఞానానికి అర్హులు. అలాంటి స్థితితో పరోక్షంగా మనకు భగవంతుడు దత్తాత్రేయుల రూపంలో ప్రబోధించారు.

## కర్మయోగి...

త్యాగబుద్ధితో చేసే ఈశ్వరారాధన, యజ్ఞయాగాదులు, లౌకిక కర్మలు కాలక్రమంలో యోగంగా మారతాయి; బంధవిముక్తులుగా మార్చి భగవంతుడికి దగ్గర చేస్తాయి. అయితే, చాలామంది కర్మకలాపాలు, ఆచారవ్యవహారాలు బంధహేతువులవుతాయని భ్రమపడుతూ వాటిని నిరసిస్తూ ఉంటారు. అలాంటి వారి బుద్ధిని

(మిగతా 34వ పేజీలో...)

కేవలం పామరులవలె వ్యవహరించుటకంటే వైదిక కర్మానుష్ఠానం మంచిది. దానికంటే సగుణోపాసన శ్రేష్ఠం. సగుణోపాసనకంటే నిర్గుణోపాసన శ్రేష్ఠతమం. ఇది అర్హతగలిగిన వారికి మాత్రమే! - పంచదశి



# పరిప్రశ్న

- స్వామి భూతేశానంద

(రామకృష్ణ సంఘ 12వ సర్వాధ్యక్షులు)

**రామకృష్ణ సంఘ 12వ సర్వాధ్యక్షులు - స్వామి భూతేశానందజీ మహరాజ్ (1901-1998) భక్తుల ఆధ్యాత్మిక సందేహాలకు సరళమైన రీతిలో ఇచ్చిన సమాధానాలను 'శ్రీరామకృష్ణ ప్రభ' పాఠకుల ప్రయోజనార్థం 2013 జూలై సంచిక నుండి ధారావాహికంగా ప్రచురిస్తున్నాం.**

**భక్తుడు: ధ్యానాన్ని ఎవరైనా, ఎప్పుడైనా అభ్యసించవచ్చా? 'సమాధి' అంటే ఏమిటి?**

స్వామీజీ: మనం మేడపైకి వెళ్ళాలంటే మెట్లు ఒక్కొక్కటీ ఎక్కుతూ పైకి చేరుకుంటాం. అలాగే ధ్యానాభ్యాసానికి ముందు యమ (అహింస, సత్యం, అస్తేయం, బ్రహ్మచర్యం, అపరిగ్రహం); నియమ (శౌచం, సంతోషం, తపస్సు,




స్వాధ్యాయం, ఈశ్వరప్రణిధానం)లను అభ్యసించాలి. సాధారణంగా చాలామంది ధారణ, ధ్యానం ఒక్కటే అని భావిస్తారు. కానీ ధారణ (చిత్తాన్ని ఒకే ప్రదేశమందు నిలపడం)లో కృతకృత్యులైతే, ఆ తరువాత ధ్యానం (చిత్తాన్ని దేనియందు లగ్నం చేశామో దాని యందే చిత్తవృత్తి అఖండ ధారావాహికగా సాగడం) అభ్యసించడం సులభతరమవుతుంది.

ధ్యానాభ్యాసం ఎలాంటిదంటే శాస్త్రీయ సంగీతం నేర్చుకోవడం లాంటిది. సంగీతం నేర్చుకోవడానికి మొదట స, రి, గ, మ, ప, ద, ని, సల సాధన ఎంత అవసరమో, ధ్యానాభ్యాసానికి ముందు యమ నియమాలను అభ్యసించడం అంత ముఖ్యం.

ధ్యానంలో చిత్తానికి ఎలాంటి స్వరూపమూ ఉండదు. అంటే ధ్యేయం తప్ప ఇంకేమీ గోచరించదు. అలాంటి స్థితిని పొందిన ధ్యానావస్థే - సమాధి.

**క్షీణవృత్తే రభిజాతస్యేవ మణేర్గ్ర హీతృ గ్రహణ**
**గ్రాహ్యేషు తత్థ్సతదంజనతా సమాపత్తిః**

*(పతంజలి యోగసూత్రాలు-1.41)*

"చిత్తం స్ఫటికమణిలా అత్యంత నిర్మలమవుతుంది. ఆ స్థితిలో ఇతర బాహ్యవృత్తులన్నీ నశించిపోయి కేవలం ధ్యేయవస్తువు (ఆత్మ)తో చిత్తం తాదాత్మ్యం చెందుతుంది. ఈ స్థితినే సమాపత్తి (సమాధి)" అని అంటారు.

'మనస్సును దేహం నుండి వేరుచేసి పరమాత్మతో అనుసంధానించడమే సమాధి' అని ఘేరండ సంహిత చెబుతోంది.

'కర్మేంద్రియాలు, జ్ఞానేంద్రియాలతో ఎలాంటి సంబంధమూ లేనట్టి మనోస్థితియే సమాధి' అని 'హఠయోగ ప్రదీపిక' వివరిస్తోంది.

సాధకుడు ముందుగా కర్మ, జ్ఞానేంద్రియాలను నిగ్రహించాలి. అప్పుడే అష్టాంగయోగంలో వివరించిన ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణ, ధ్యాన, సమాధి అనే మిగతా మెట్లు అధిరోహించడం సులభతరమవుతుంది.

**భక్తుడు: భగవల్లీలల గురించి ఆలోచించడం కూడా ధ్యానమే అవుతుందా?**

స్వామీజీ: వైష్ణవ శాస్త్రాలు 'సేవాధ్యానం, లీలాధ్యానం, గుణధ్యానం' లాంటి ధ్యాన పద్ధతులను వివరించాయి. భగవంతుని లీలల్ని గురించి ఆలోచించడం వల్ల మనస్సులో విజాతీయ ఆలోచనలు తొలగిపోతాయి. అలా నిర్మలమైన మనస్సు భగవంతుని యందు సులభంగా లగ్నమవుతుంది. మనస్సును భగవంతుని యందు ఏకాగ్రం చేయడానికి ఈ ధ్యాన పద్ధతులు సహకరిస్తాయి. ❖

## పండుగలు - పర్వదినాలు

### డిసెంబర్ - 2014

| తేదీ | వారం | పర్వదినం |
|---|---|---|
| 02 | మంగళవారం | ఏకాదశి |
| 13 | శనివారం | దివ్యజనని శ్రీశారదాదేవి జయంతి |
| 18 | గురువారం | ఏకాదశి, స్వామి శివానంద జయంతి |
| 27 | శనివారం | స్వామి శారదానంద జయంతి |

### జనవరి - 2015

| తేదీ | వారం | పర్వదినం |
|---|---|---|
| 01 | గురువారం | కల్పతరు దినోత్సవం, వైకుంఠ ఏకాదశి |
| 04 | ఆదివారం | స్వామి తురీయానంద జయంతి |
| 12 | సోమవారం | స్వామి వివేకానంద జయంతి (తిథి ప్రకారం) జాతీయ యువజన దినోత్సవం |
| 15 | గురువారం | సంక్రాంతి |
| 16 | శుక్రవారం | ఏకాదశి |
| 22 | గురువారం | స్వామి బ్రహ్మానంద జయంతి |
| 23 | శుక్రవారం | స్వామి త్రిగుణాతీతానంద జయంతి |
| 24 | శనివారం | సరస్వతీ పూజ |
| 30 | శుక్రవారం | ఏకాదశి |







# రామకృష్ణ భక్తి సూత్రాలు

- స్వామి యతీశానంద

నారద భక్తి సూత్రాలు, శాండిల్య భక్తి సూత్రాలు భక్తియోగానికి సంబంధించిన ప్రామాణిక గ్రంథాలు. అయితే ఆధునిక తరంలో భగవదన్వేషకులకు అనువైన రీతిలో భక్తితత్త్వాన్ని బోధించారు శ్రీరామకృష్ణులు. ఈ నేపథ్యంలో 'శ్రీరామకృష్ణ కథామృతం' నుండి కొన్ని ఉపదేశాలను 'రామకృష్ణ భక్తి సూత్రాలు'గా సులభరీతిలో వివరించే ప్రయత్నం చేస్తున్నాం.

బౌద్ధగ్రంథాలు పాళీ భాషలో, బైబిల్ హీబ్రూలో, ఖురాన్ అరబ్బీ భాషలో రచించబడ్డాయి. అలాగే శ్రీరామకృష్ణుల ఉపదేశాలు వారి మాతృభాష బెంగాలీలో ఆవిష్కృతమయ్యాయి. అవతార పురుషుని ముఖతః వెలువడిన ఆ అమృతోపదేశాలను యథాతథంగా ఉట్టంకిస్తూ వ్యాఖ్యానిస్తున్నాం. మహాశక్తిమంతమైన ఆ బోధనలను మననం చేసుకుంటూ కృతార్థులమవుదాం.

**తాఁకె దర్శన్ హోలె సబ్**
**సంశయ్ మిటే జాయ్.**

**ఆయన (భగవంతుని) సాక్షాత్కారం అయితే, సంశయాలన్నీ సమసిపోతాయి.**

**శ్రీరామకృష్ణ ఉవాచ:** భగవత్సాక్షాత్కారం అయితే, సంశయాలన్నీ పోతాయి. వినడం ఒకటి, చూడడం మరొకటి. విన్నంత మాత్రాన పదహారణాల (సంపూర్ణ) విశ్వాసం కలుగదు. సాక్షాత్కారమైతే ఇక ఏ మాత్రమూ అపనమ్మకం ఉండదు.

**వ్యాఖ్య:** భగవత్సాక్షాత్కారం అన్నా, భగవద్దర్శనం అన్నా, భగవంతుణ్ణి పొందడం అన్నా - అన్నీ ఒకటే. మనిషి మస్తిష్కంలో నానా సంశయాలు కలుగుతాయి. భగవంతుడున్నాడా? ఆయనను దర్శించగలమా? ఆయన సాక్షాత్కారం పిదప దుఃఖనివృత్తి అయి, చిరశాంతి లభిస్తుందా? మహాపురుషులు, శాస్త్రాలు చెప్పినది నిజమేనా?

మొదటి సంశయం భగవంతుణ్ణి దర్శించగలమా అన్నది! ఈ ప్రశ్నకు సమాధానం శ్రీరామకృష్ణులు స్వయంగా ఇలా చెప్పారు: "భగవంతుడున్నాడు. ఆయన్ని తప్పక దర్శించవచ్చు. అడపాదడపా ఏకాంత వాసం, ఆయన నామగుణగానం, నిత్యానిత్య వస్తువిచారణ - ఈ ఉపాయాలు చేపట్టాలి. భక్తి ద్వారానే దర్శనం కలుగుతుంది."

నీరు రెండు మూలకాల సమ్మేళనం అని పాఠశాల ఉపాధ్యాయులు చెబుతారు. విద్యార్థులు దాన్ని అంగీకరిస్తారు. కానీ ఒక మూల కొద్దిగా సందేహం ఉంటుంది. రెండు వాయురూప పదార్థాలు కలసి ద్రవంగా ఎలా మారుతాయి? ఉపాధ్యాయుడు చెప్పినది నిజమేనా? కానీ ఆ విద్యార్థులు ప్రయోగశాలలో ఆక్సిజన్ (ఆమ్లజని), హైడ్రోజన్ (ఉదజని) వాయువులను సరైన పరిమాణంలో కలిపి నిజంగానే నీరు ఉత్పన్నమైనదని కనుగొన్నప్పుడు, వారి సంశయం తొలగిపోతుంది.

మన సంశయాలన్నిటి మూల కారణం అజ్ఞానం. సచ్చిదానంద స్వరూప బ్రహ్మం సాక్షాత్కారమైనంతనే అజ్ఞానం నాశనమవుతుంది. తత్ఫలితంగా సంశయాలు దూరమవుతాయి. "భిద్యతే హృదయ గ్రంథిః ఛిద్యంతే సర్వసంశయాః.. తస్మిన్ దృష్టే పరావరే'- పరబ్రహ్మ దర్శనమైతే సంశయాలన్నీ నాశనమవుతాయి" అని ముండకోపనిషత్తు చెబుతోంది.

**తాఁర్ దయా హొలె కి నా హొయ్!**
**హజార్ బత్సరేర్ అంధకార్ ఘొరె ఆలో**
**ఆనలె కి ఏక్టు ఏక్టు కొరే అంధకార్**
**జాయ్? ఏకేబార్ ఆలో హొయ్.**

**భగవంతుని కృపతో సాధ్యంకానిది ఏమైనా ఉంటుందా? వెయ్యేళ్ళుగా చీకటిగా ఉన్న గదిలోకి దీపం తెస్తే, ఆ అంధకారాన్ని కొద్ది కొద్దిగా పోగొడుతుందా? ఒక్కసారిగా ఆ గది అంతా వెలుగుతో నిండిపోతుంది.**

**శ్రీరామకృష్ణ ఉవాచ:** భగవంతుని కృప కలిగితే ఒక్క క్షణంలో అష్టపాశాలు సడలుతాయి. ఎలాగో తెలుసా? వెయ్యేళ్ళుగా చీకటిగా ఉన్న గదిలోకి దీపం తెస్తే, ఒక్క క్షణంలో అంధకారం పటాపంచలవుతుంది. గారడీ చూచావా! ఒక తాడుకు ఎన్నో ముళ్ళు వేస్తాడు. తాడు కొస ఒకటి దేనికో కట్టుతాడు, రెండోది పట్టుకొని ఒకటి రెండుసార్లు తాడును విదిలిస్తాడు. అంతే! ముడులన్నీ ఊడిపోతాయి. మరొకడు ఎంత ప్రయత్నించినా అలా చేయలేడు.

భగవంతుని దయ కలిగితే ఇక భయం లేదు. పిల్లవాడు తండ్రి చేయిపట్టుకొని నడుస్తుంటే, క్రింద పడవచ్చు. కానీ తండ్రి గనక పిల్లవాడి చేయి పట్టుకుంటే ఇక భయం ఉండదు. అలాగే, ఆయన అనుగ్రహించి సందేహాలను పోగొట్టి, సాక్షాత్కరిస్తే ఇక బాధలుండవు, బంధాలుండవు.

**వ్యాఖ్య:** భగవదనుగ్రహం గురించి శ్రీరామకృష్ణులు 'ఎందుకు కాదు? ఎందుకు జరుగదు?' అని గట్టిగా అనేవారు. అంటే, భగవంతుని అనుగ్రహంతో అసంభవం సంభవమవుతుంది. వెయ్యేళ్ళుగా చీకటిగా ఉన్న గదిలోకి దీపం తెచ్చే దృష్టాంతం చెప్పారు శ్రీరామకృష్ణులు. అంటే అనేకానేక జన్మలుగా పేరుకుపోయిన అజ్ఞానాన్ని, భగవంతుని కృప అనే జ్యోతి పటాపంచలు చేస్తుంది. కనుకనే భగవంతుణ్ణి అహేతుక కృపాసింధువు అంటారు. ❖ అనువాదం: డాక్టర్ కమల జయరావు

**మానవునిలో నిరతిశయము, ఉత్తమము అయిన సుఖం కలుగవలెననీ, విషయదుఃఖం నశించవలెననే దృఢమైన సంకల్పం కలిగివుండాలి. అలాంటి సంకల్పం నుండే మోక్షేచ్ఛ జనిస్తుంది. - హితోపదేశం**



# పని మంచిదైతే... సమయం మంచిదే!

– రాచమడుగు శ్రీనివాసులు

మాయా జూదంలో పాండవులు ఓడిపోయారు, కౌరవులు గెలిచారు. నియమాలను అనుసరించి పాండవులు హస్తినాపురాన్ని వదలి అరణ్యాలకు వెళ్ళారు. మూడు రోజులు నడక సాగించి కిమ్మీర వనంలోకి ప్రవేశించారు. భయంకర ఆకారంతో ఉన్న ఒక రాక్షసుడు వారికి ఎదురయ్యాడు. "నేను బకాసురుని తమ్ముడిని. నా పేరు కిమ్మీరుడు. నేను మనుషులను చంపి తినేవాడను" అని తనను తాను పరిచయం చేసుకొన్నాడు. అప్పుడు ధర్మరాజు అతనితో "మేము పాండవులము. నేను యుధిష్ఠిరుడను, వీరు నా తమ్ములు – భీమార్జున నకుల సహదేవులు. ఈమె ద్రౌపది" అని చెప్పాడు. అప్పుడా రాక్షసుడు భీముని వైపు చూస్తూ "ఇతడేనా భీముడు? ఇతనిని చంపాలని ఎంతోకాలంగా ఎదురు చూస్తున్నాను. ఈ రోజు పుణ్యదినం. దైవయోగం వల్ల ఈ రోజు ఇతడు నా కంటబడ్డాడు. ఇతడు నా సోదరుడైన బకాసురుడిని చంపాడు, నా స్నేహితుడైన హిడింబుని చంపి, వాని చెల్లెలు హిడింబిని వశపరచుకొన్నాడు. ఇప్పుడు వీనిని చంపి వీని రక్తంతో బక, హిడింబులకు తర్పణం చేస్తాను. వారి ఋణం తీర్చుకొంటాను" అని భీమునితో తలపడ్డాడు.

భీమ, కిమ్మీరుల మధ్య అతి భయంకరమైన యుద్ధం జరిగింది. భీముడు వానిని తన రెండు చేతుల మధ్య బంధించి, మెడను వంచి, పైకి ఎత్తి గిరగిర తిప్పి, వాని దేహాన్ని సగానికి విరచి నేల మీదికి విసిరి కొట్టాడు. కిమ్మీరుడు రక్తం కక్కి చచ్చాడు. భీముడు వాని శవాన్ని దూరంగా విసిరి పారేశాడు. ఇది మహాభారతంలోని అరణ్యపర్వంలో ఉండే కథ.

పై కథలో కిమ్మీరుడు పాండవులను చూసిన ఆ దినం 'పుణ్యదినం' అన్నాడు; వారి కలయిక 'దైవయోగం' అన్నాడు; భీముడిని చంపడం, అతని రక్తంతో 'తర్పణం' విడవడం తాను బక, హిడింబులకున్న 'ఋణాన్ని' తీర్చుకోవడం అన్నాడు. కానీ జరిగిన విషయాన్ని బాగా గమనిస్తే మనకు తెలిసేది ఏమిటంటే 'పుణ్యదినం' అనుకొన్న ఆ దినం వానికి మృత్యుదినం అయింది. భీముని చంపి అతని రక్తంతో తర్పణం చేద్దామనుకొంటే వాని రక్తంతోనే భీముడు తర్పణం చేశాడు. తాను తీర్చుకోదలచిన మిత్ర ఋణం, భ్రాతృ ఋణం కిమ్మీరునకు అలాగే మిగిలిపోయాయి. పుణ్య దినం, దైవయోగం, తర్పణం, ఋణం లాంటి మంచి మాటలను ఎన్ని వాడినా కిమ్మీరునకు దక్కవలసిందేదో అదే దక్కింది.

సర్వసాధారణంగా మనం ఏ పని ప్రారంభించాలన్నా ఏ పండితుడినో, పూజారినో సంప్రతించి ఆయన సలహాను కోరుతాం. ఆయన పంచాంగం చూసి తిథి, వార, నక్షత్రాలను పరిశీలించి, ఒక శుభదినాన్ని, శుభలగ్నాన్ని, ముహూర్తాన్ని సూచిస్తాడు. మనం ఆయన సలహా పాటించి పనిని ప్రారంభిస్తాం. కానీ కొన్ని సందర్భాలలో విజయం సాధించలేం, విఫలమవుతాం. ఎందుకనేది ఆలోచించం. తిథి, వార, నక్షత్రాలు, ముహూర్తాలు – అన్నీ బాగున్నా మన తలంపులు, మన పనులు మంచివి కాకపోతే దుష్ఫలితాలే ఉంటాయి. కిమ్మీరునకు 'దినం' మంచిదని తెలుసు గానీ భీముడు తన వారిని ఎందుకు చంపాడో తెలియదు. భీముడిని చంపాలన్న తన ఆలోచన ప్రమాదకరమనీ తెలీదు. భీమునికి దైవబలం, ధర్మబలం అండగా ఉన్న విషయం తెలీదు. అందుకే వానికి ఆ దుఃస్థితి. అందుకే ఆ దుర్మరణం.

పని మంచిదైతే ఏ ముహూర్తమైనా మంచిదే!<br>
పని చెడ్డదైతే ఏ ముహూర్తమైనా చెడ్డదే!<br>
మంచి పనిని వాయిదా వేయరాదు.<br>
చెడ్డ పనిని వెంటనే చేయరాదు!

సర్వశక్తి సంపన్నుడు, సర్వజ్ఞుడు అయిన భగవంతుని విశ్వసించి, ధర్మాన్ని అనుసరించి, సత్యాహింసలను పాటిస్తే ప్రతి నిమిషమూ మంచిదే! ప్రతి దినమూ పవిత్రమైనదే! ప్రతి ఘడియా శుభఘడియే!

భీమునికి అనుకూలం – ధర్మం, దైవం. అవి రెండూ అనుకూలమైతే, ఏది ఎట్లా ఉన్నా విజయం మనదే. ఆద్యంతం మహాభారతం మనకు చేసే బోధ అదే. ❖



# మహాపురుషుని సాన్నిధ్య స్మృతులు

– స్వామి అర్చనానంద



జగద్గురు ఆదిశంకరాచార్యులు 'వివేక చూడామణి'లో ఇలా బోధించారు – 'దుర్లభం త్రయమేవైతత్ దైవానుగ్రహ హేతుకమ్, మనుష్యత్వం ముముక్షుత్వం మహాపురుష సంశ్రయః' – 'విశ్వంలో ఈ మూడూ దుర్లభమైనవి, ఆ విశ్వేశ్వరుని అనుగ్రహం వల్ల మాత్రమే సంభవించేవి. మనుష్యత్వం – మనిషిగా జన్మించడం; ముముక్షుత్వం – మోక్షాన్ని పొందాలనే ఆకాంక్ష; మహాపురుషుల సంశ్రయం – మహాత్ముల సాన్నిధ్యం. శ్రీరామకృష్ణ మహాసంఘ 13వ సర్వాధ్యక్షులు అయిన పరమ పూజ్య స్వామి రంగనాథానందజీ మహరాజ్ వారిని స్మరిస్తే పైశ్లోకమే గుర్తుకు వస్తుంది.

హైదరాబాద్ రామకృష్ణ మఠంలో పూజ్య స్వామీజీ రోజూ కొబ్బరితోట మధ్యనున్న దోవలో నడిచేవారు. వారు నడుస్తూంటే 'నిర్గచ్ఛతి జగజ్జాలాత్ పింజరాదివ కేసరీ – జీవన్ముక్తుడు మాయా మోహ జగత్ జాలాన్ని ఛేదించి సింహంలా ఆత్మస్వాతంత్ర్యంతో విహరిస్తాడు' అనే శ్లోకం గుర్తుకు వచ్చేది. మఠం అంతా వారి ఆధ్యాత్మిక శక్తి ప్రకంపనాలతో కంపిస్తోందా? అనిపించేది. స్వామీజీ ఆజాను బాహువు. వారి నుదురు, చెవులు, చేతులు, కాళ్ళు, హృదయమూ అన్నీ పెద్దవే! శంకరాచార్యుల మేధాశక్తి; వివేకానందుల ఆత్మశక్తి, దేశభక్తి; శ్రీరంగనాథస్వామి (మహావిష్ణువు) విశ్వవ్యాపక చైతన్య దీప్తి – అన్నీ సమ్మిళితమై నడుస్తున్నాయా? అని అనిపించేది.

పూజ్యస్వామీజీ పూర్వాశ్రమ నామధేయం – శంకరన్. దైవేచ్ఛగా ఆదిశంకరుల జన్మస్థలమైన కేరళలోని 'కాలడి' గ్రామానికి దగ్గరే ఉన్న 'త్రికూర్' అనే గ్రామంలో స్వామీజీ జన్మించారు. 'When I sit and speak I am Shankara, When I lie down I am Ranganatha – నేను కూర్చొని ప్రసంగించేటప్పుడు శంకరుణ్ణి, శయనించి ఉన్నప్పుడు శ్రీరంగనాథుణ్ణి అనే వారట హాస్యంగా!

**చిన్న పనైనా పెద్ద మనస్సుతో...** పూజ్య స్వామీజీ మఠం ఉద్యానంలో నడకకు వెళ్ళినపుడు అక్కడక్కడ నిమ్మకాయలు, పచ్చి మిరపకాయలు గాలికి రాలిపడి ఉండేవి. వాటిని ఎంతో శ్రద్ధతో చేతిలోకి తీసుకుని వంటశాలకు వెళ్ళి 'ఇవి గార్డెన్‌లోని నిమ్మకాయలు, మిరపకాయలు' అని చిన్న పిల్లవాడిలా చెప్పి ఇచ్చేవారు. 'పెద్ద మనసుతో చేస్తే చిన్నపని కూడా పెద్ద పని అవుతుంది; చిన్న మనసుతో చేస్తే పెద్దపని కూడా చిన్నదైపోతుంది' అని వారు గీతోపన్యాసాలలో బోధించిన దానిని ఆచరణలో చూపిన 'అనుష్ఠాన వేదాంతి' పూజ్య స్వామీజీ.

**ప్రకృతి పట్ల ఆరాధనాభావం:** ఉద్యానంలోని చెట్లు చేమలపై స్వామీజీకి విశేషమైన ప్రేమ ఉండేది. అనవసరంగా ఏ మొక్కల్నీ పీకవద్దనేవారు. గడ్డిపూల చెట్లను చూపిస్తూ– 'ఈ పూలు కూడా ఎంత అందంగా ఉన్నాయో' అంటూ ఆనందించేవారు. మఠం తపోవనంలా ఉండాలని చాలా చెట్లను నాటించారు. అందులో కొన్ని వెదురు చెట్లు చాలా ఎక్కువగా పెరిగిపోయాయనీ, అడ్డంగా ఉన్నాయనీ స్వామీజీ లేని సమయంలో గార్డెన్ ఇన్‌ఛార్జి స్వామి వాటిని నరికివేయించారు. తిరిగి వచ్చిన తరువాత అది చూసిన స్వామీజీ, అతణ్ణి పిలిపించి "You have not cut the bamboo trees, but you have cut my hands. This is Math. We want a forest here. What harm those trees have done to you? – నువ్వు నరికింది వెదురుచెట్లను కాదు, నా చేతుల్ని. ఇది మఠం. తపోవనంలా ఉండాలి. ఈ చెట్లు నీకేమి హాని చేశాయి?" అని మందలించగానే, ఆ స్వామి సాష్టాంగపడి క్షమాపణవేడుకున్నారు!

పూజ్య స్వామీజీ ఓసారి మైసూరు రామకృష్ణ మఠం నుండి కొన్ని పూల విత్తనాలు తీసుకొచ్చి, ఆ విత్తనాల పొట్లం నాకు అందిస్తూ "ఇవి Evening glory అనే చాలా అందమైన పూలవిత్తనాలు. ఈ చెట్లపూలు తెలుపురంగులో ఇంత పెద్దవిగా (చేతులు చాపి చూపిస్తూ) సాయంత్రం పూట విరబూస్తాయి. దేవాలయ ప్రవేశమార్గం దగ్గర రెండు వైపులా ఈ విత్తనాలు నాటు" అన్నారు. రామకృష్ణ సంఘ ఉపాధ్యక్షులైన పూజ్య స్వామీజీ ఈ పూల విత్తనాలను స్వయంగా తీసుకురావడం, అంత శ్రద్ధతో అందివ్వడం నాకు ఆశ్చర్యం, ఆనందం కలిగించాయి.

కొన్నాళ్ళకు ఆ విత్తనాలు చెట్లయి, పెద్ద పెద్ద పూవుల నివ్వసాగాయి. శ్రీరామకృష్ణుల దేవాలయం రెండు వైపులా గోడలకు కంచె మీదుగా పాకుతూ ఈ తెల్ల పుష్పాలు సాయంవేళలలో ఎంతో దివ్య శోభనిస్తూ, 'అవతార వరిష్ఠుని ఆరతికి మేమూ సిద్ధమే!' అని తలలూపుతున్నట్లు అనిపించేది. పూజ్య మహరాజ్ సాయంత్రంపూట అలా నడుస్తూ ఆ పుష్పాలను, తీగలను చాలా ప్రేమతో చూసేవారు. ❖

(డిసెంబరు 15న స్వామి రంగనాథానందజీ జయంతి)

శ్రేష్ఠుడు దేనిని ఆచరించునో ఇతరులు దానినే ఆచరించును. అతడు దేనిని ప్రామాణీకరించునో, లోకం దానినే అనుసరించును. తాను సకల కర్మలు చేస్తూ ఇతరులకు కర్మలందు శ్రద్ధను కలిగించును. – శ్రీకృష్ణుడు

# వస్తు వినియోగ దోషం

- శ్రీమతి భమిడిపాటి బాలాత్రిపురసుందరి

ధర్మం నాలుగు పాదాలతో నడుస్తుంటే అధర్మం ఎక్కడుంటుంది? అధర్మం లేని చోట కలి నిలబడలేడు. ఎవరి ఇంట్లో అయితే దైవభక్తి, పెద్దల యందు భక్తి, మంచి నడవడిక ఉంటాయో అక్కడ కలికి ప్రవేశం ఉండదు.

ధర్మరాజు పాలనలో కలికి ప్రవేశం లేదు. పరీక్షిత్తు కలిని చంపబోయినప్పుడు కాళ్ళమీద పడి ప్రాణభిక్ష పెట్టమని అడుగుతాడు. కలిని తన రాజ్యం నుండి దూరంగా వెళ్ళిపొమ్మంటాడు పరీక్షిత్తు మహారాజు. 'ఎటు చూసినా నీ రాజ్యమే ఆక్రమించి ఉంది. అడవులు, గుట్టలు, నదులు అంతా ఆక్రమించి ఉన్నావు. నేనుండడానికి ప్రదేశమే లేదు' అన్నాడు కలి. పరీక్షిత్తు ఆలోచించి ప్రాణహింస, జూదం, వ్యభిచారం, పానం, అసత్యం, మదం, కామం, హింస, వైరం అనే తొమ్మిది ప్రదేశాల్లో నివసించమన్నాడు.



పరీక్షిత్తు మహారాజై కూడా కలిని ఎందుకు చంపలేదు? కలియుగంలో ఒక విశేషం ఉంది. పాపాలు చేసినప్పుడే పాపం కలుగుతుంది. కానీ 'పుణ్యం చేస్తాను' అని అనుకోగానే పుణ్యం కలుగుతుంది. ఇంత మంచి అవకాశాన్ని మనిషి ఎలా వదులుకుంటాడు? పుణ్యాలే పొందుతాడు అనుకుని కలిని వదిలేశాడు పరీక్షిత్తు.

ఒక గృహస్థు ఒక సన్న్యాసిని భోజనానికి పిలుస్తాడు. వెండి కంచంలో వడ్డిస్తాడు. భోజనం చేశాక సన్న్యాసి కంచాన్ని కడిగి, తన జోలెలో వేసుకుని వెళ్ళిపోతాడు. అది చూసిన గృహస్థు తన పాపం పోయిందనుకుని ఊరకుంటాడు. సన్న్యాసి తిరిగి తిరిగి సాయంత్రం ఒక నది దగ్గర కూర్చొని అనుష్ఠానం చేసుకుందామని విభూతి కోసం జోలెలో చెయ్యి పెట్టాడు. చేతికి వెండి కంచం తగులుతుంది. అసలు వెండి కంచం తనెందుకు తెచ్చాడో తెలియక దివ్యదృష్టితో దాని చరిత్ర చూస్తాడు. గృహస్థు తాను దొంగతనం చేసి తెచ్చిన వెండి కంచంలో భోజనం పెట్టడం వల్ల ఆ సంస్కారం సన్న్యాసిలో ప్రవేశించింది.

పరీక్షిత్తు మహారాజు వేటకు వెళుతూ తాత భీమసేనుడు గతంలో జరాసంధుణ్ణి చంపి తెచ్చిన మణులు పొదిగిన బంగారు కిరీటాన్ని ధరించాడు. అది ధరించగానే ఆయనలో రజోగుణం ప్రవేశించింది. వేటాడి అలిసిపోయిన పరీక్షిత్తు దాహంతో చుట్టూ చూస్తాడు. నిశ్చలంగా తపస్సులో లీనమైన శమీక మహర్షి కనిపిస్తాడు. ఎన్నిసార్లు పిలిచినా పలకలేదన్న కోపంతో ఒక చచ్చిన పాముని తెచ్చి ఆయన మెడలో వేస్తాడు. శమీక మహర్షి కొడుకు శృంగి జరిగినదాన్ని తెలుసుకుని తపస్సు చేసుకుంటున్న తండ్రిని అవమానించాడన్న కోపంతో ఆనాటికి ఏడవ రోజు తక్షకుడి విషంతో రాజు దగ్ధమవ్వాలని శపిస్తాడు.

పరీక్షిత్తు మహారాజుకు జరిగినదేమీ తెలియదు. రాజమందిరానికి రాగానే కిరీటం తీసి పక్కన పెడతాడు. అప్పుడు ఆయనలో ఉన్న రజోగుణం తగ్గి, తాను చేసిన పనిని తలచుకొని పశ్చాత్తాపం పొందుతాడు. అప్పటికే జరగవలసినది అంతా జరిగిపోయింది. అసలు విషయం శమీక మహర్షి శిష్యులు వచ్చి తెలియజేస్తారు. మహారాజు ఉత్తమ సంస్కారం కలవాడు కనుక తనకు మంచే జరిగిందనుకున్నాడు. మరణం ఎప్పుడు సంభవిస్తుందో ఎవరికీ తెలియదు. తనకు తెలుసు కనుక, భగవచ్చింతనలో సమయాన్ని సద్వినియోగపరుచుకోవాలనుకున్నాడు.

పవిత్రమైన భారతదేశంలో పుట్టినవాడు, పరమ భాగవతోత్తముడు, అశ్వమేధయాగం చేసినవాడు, సదాచార సంపన్నుడు, రాజనీతిజ్ఞుడు, రాజకులభూషణుడు పరీక్షిత్తు మహారాజు. శాపాలకు ప్రతిశాపం ఇవ్వగల సమర్థుడైనా గోవులకూ, దేవతలకూ, బ్రాహ్మణులకూ అపకారం చెయ్యకూడదన్న వివేకం ఆయనను ఆపింది.

పరీక్షిత్తు అసుర గుణాలు కలిగినవారి వస్తువులను వాడడం వల్ల వివేకాన్ని కోల్పోయాడు. అదే ఆయనకు శాపమైంది. కాబట్టి సాధకులు అవినీతిపరులకు దూరంగా ఉండాలి. అన్యాయంగా సంపాదించిన వాటిని స్వీకరించకుండా జాగ్రత్తపడాలి. ❖



ధీరవాణి
- స్వామి వివేకానంద

# పూర్ణత్వమే మన సహజగుణం

నా సోదరులారా! మనం బాగా గ్రహించవలసిన ముఖ్యాంశమిది. భవిష్యత్కాలంలో మనం పట్టుదలతో అనుసరించవలసింది ఈ ఒక్క విషయమే అని మీకు తెలుపుతున్నాను. మీరు దీన్ని చక్కగా గ్రహించాలని నా ప్రార్థన. దివారాత్రాలు తాను వ్యర్థుడనని మననం చేస్తూ ఉండే మనిషి వల్ల ఎలాంటి శుభమూ కలగబోదు. మనుష్యుడు రేయింబవళ్ళు తాను దుఃఖితుడననీ, అధముడననీ, పనికిమాలిన వాడిననీ భావిస్తూ వుంటే అతడు పనికిమాలినవాడే అయిపోతాడు. నిన్ను నువ్వు... 'నేను ప్రయోజకుణ్ణి' అని అనుకుంటే అలాగే అవుతావు. ఈ మహాసత్యాన్ని గుర్తు పెట్టుకోవాలి.

మనం ఆ సర్వశక్తిమయుని బిడ్డలం; మనం ఆ అఖండ దివ్యాగ్నిలోని రవ్వలం. మనం పనికిమాలినవారం ఎలా అవుతాం? మనం దేన్నైనా చేయగలం. ఈ ఆత్మ విశ్వాసం మన పూర్వుల హృదయాల్లో ప్రకాశించింది. నాగరకతాభివృద్ధిలో వారిని ముందుకు తీసుకొని వచ్చిన క్రియాశక్తి ఈ ఆత్మవిశ్వాసమే! మనకు భ్రష్టత్వం వాటిల్లితే, దోషం చేకూరితే, నా మాటను గుర్తుపెట్టుకోండి - తనపై తాను విశ్వాసం పోగొట్టుకోవడమంటే భగవంతుని పట్ల విశ్వాసం పోగొట్టుకోవడమే! ఈ అంతర్యామి ప్రతి పరమాణువులో వెలసి, నీ శరీరమంతటా, నీ మనస్సులో, నీ ఆత్మలో ఓతప్రోతంగా, (పడుగుపేకగా) వ్యాపించి ఉన్నట్లు నీవు విశ్వసిస్తే ఇక అధైర్యపడడం ఎందుకు? నేను ఒక చిన్న నీటిబుడగను కావచ్చు; నీవు పర్వతోత్తుంగ తరంగానివి కావచ్చు. విచారమెందుకు? ఆ అనంత సాగరం నీకు, నాకు కూడా ఆధారక్షేత్రమై ఉంది.

కాబట్టి నా సోదరులారా! ఈ జీవప్రదమైన, మాన్యమైన, ప్రభావవంతమైన, మహాసిద్ధాంతాన్ని మీ బిడ్డలకు వారు పుట్టిననాటి నుండే బోధించండి. మీరు వారికి అద్వైతం నేర్పనక్కర్లేదు; ద్వైతమే బోధించండి; లేక మీ కిష్టమైన ఏ మతాన్నైనా బోధించండి. ఏది బోధించినా - భారత దేశమంతటా ఆత్మ యొక్క పూర్ణత్వం గూర్చిన ఈ సిద్ధాంతమే శాశ్వతమై నిలువగలదు. దీన్నే సకల సంప్రదాయాలూ విశ్వసిస్తున్నాయి. ఆ మహాతత్త్వవేత్త కపిలాచార్యులు చెప్పినట్లు, జీవాత్మ స్వభావం చేతనే పవిత్రమైంది. కాబట్టి, మన తత్త్వవేత్తలందరూ పవిత్రతే మన స్వభావమనీ, పూర్ణత్వమే మన సహజగుణమనీ అంటారు. అంతేకానీ, అపూర్ణత, మాలిన్యం మన స్వభావం కాదు.

ఒక మహర్షి ప్రాణావసానకాలంలో తన మహాకార్యాల నన్నిటినీ, తన మహోత్తమ సంకల్పాలనన్నిటినీ జ్ఞప్తికి తెచ్చుకోమని తన మనస్సును హెచ్చరించాడట! తన దోషాలనూ, లోపాలనూ జ్ఞప్తికి తెచ్చుకోమని మనస్సుకు చెప్పలేదు. చూశారా! మనోహరమైన ఈ ఉదాహరణను ఎన్నడూ మరువకండి. లోపాలా... ఉంటాయి! దుర్బలత్వమా... ఉండి తీరుతుంది! అయినా, మీ యథార్థ స్వభావాన్ని నిరంతరం జ్ఞప్తిలో ఉంచుకోండి. మన దౌర్బల్యాన్ని పోగొట్టుకోవడానికి ఇది ఒక్కటే మార్గం! మన దోషాలను నివారించుకోవడానికి ఇది ఒక్కటే త్రోవ! ❖

పరతత్త్వమైన బ్రహ్మం ఎక్కడో గుహాదులయందుగానీ, తీర్థములయందుగానీ, కర్మకాండలయందు గానీ లేదు. శోధించి చూసిన ప్రాజ్ఞులకు తానే బ్రహ్మమని తెలుస్తుంది. - సర్వసిద్ధాంతసార సంగ్రహం

భగవంతుడు అవతరించడానికి ముఖ్యకారణాలు రెండు. భగవద్గీతలో చెప్పినట్లు 'ఎప్పుడెప్పుడైతే ధర్మగ్లాని సంభవిస్తుందో, అప్పుడప్పుడు భగవంతుడు స్వయంగా మానవరూపం దాల్చి ధర్మప్రతిష్ఠాపన తిరిగి చేస్తాడ'నేది ఒక కారణం. దేవీ మాహాత్మ్యం (చండీ సప్తశతి) కూడా 'ఆద్యంతరహిత అయిన జగజ్జనని ప్రపంచాన్ని కాపాడేందుకు మరల మరల మానవ రూపాన్ని ధరించి అవతరిస్తుంద'నే సత్యాన్ని స్పష్టం చేస్తోంది.

ఇక రెండో కారణం - 'ఆధ్యాత్మిక సాధకులకు మార్గదర్శనం చేసేందుకే నిరాకార పరబ్రహ్మం రూపుదాల్చి సాకారమవుతుంద'ని శ్రీరామపూర్వతాపిన్యుపనిషత్‌లో పేర్కొనబడింది. 'భక్తుల కొరకు భగవంతుడు స్వయంగా ప్రత్యక్షం అవుతాడ'ని భాగవతంలో కూడా ఉంది. అయితే ఇందులో రెండు అంశాలను గమనించాలి. 1.భక్తుడు భగవంతుణ్ణి సాకారరూపంలో దర్శించాలని కోరుకుంటాడు. 2.భగవంతుడు కూడా భక్తుని ప్రేమను అంతే ఆనందంగా స్వీకరిస్తాడు. ఈ రెండు కారణాల వల్ల భగవంతుడు మానవాకృతి దాలుస్తాడు. భగవంతునికి భక్తుని పట్ల గల వాత్సల్యం, భక్తునికి భగవంతుని పట్ల ఉన్న ప్రేమ కలగలిసి ఒక లీలకు దోహదపడుతుంది. ఈ కోణంలో మనం మాతృదేవి జీవితానికి సంబంధించిన విషయాలను గమనించే ప్రయత్నం చేద్దాం.

జగన్మాతలో అనంతశక్తి విభూతులు, సకలైశ్వర్యాలు ఇమిడి ఉన్నాయి. అయితే ఇవన్నీ బాహాటంగా ప్రదర్శిస్తే, భక్తులు భయభక్తులతో దూరంగా నిలచి ఉంటారనీ, వారిలోని భయాన్ని దూరంగా నెట్టి ఆప్యాయతానురాగాలతో దగ్గరకు చేర్చుకోవాలనే ఉద్దేశ్యంతో, ఆ అమ్మ తనలోని అనంత ప్రాభవాన్నీ, ఐశ్వర్యాన్నీ మరుగుపరచి, సామాన్య మానవదేహాన్ని ధరించి, ఒక విధమైన లీల ప్రదర్శించేందుకే దిగి వచ్చింది. ఆ తల్లి మరెవరో కాదు - సాక్షాత్తూ దివ్యజనని శారదాదేవే! ఆమె ఈ లోకంలో మానవ రూపంతో అవతరించి, తన అఖండశక్తులను బహిర్గతం చేయకుండా, భక్తులకు ఒక సాధారణ రీతిలో, మృదువైన హృదయంతో, అపారమైన కృప, ఓరిమి కలిగి ఉన్న చల్లని తల్లి రూపంతో దర్శనమిచ్చింది.

ఆ తల్లి తన వాస్తవికతను దాచి ఉంచినందున, సాధారణరీతిగా చూస్తే ఆమెను అర్థం చేసుకోలేం. శ్రీరామకృష్ణుల చరిత్ర చదివినప్పుడు ఆయనకు కలిగిన ఆధ్యాత్మిక శక్తులు, అనుభవాలు, సమాధి స్థితులు - ఇవన్నీ ఎంతో ఉత్తేజకరంగా తోస్తాయి. అలాగే స్వామి వివేకానంద చరిత్ర చదివినప్పుడు ఎంతో సాహసోపేతంగా, గగుర్పాటు కలిగించే రీతిగా తోస్తుంది. ఇలాంటి అనుభవమేదీ అమ్మ గురించి తెలుసుకున్నప్పుడు మనకు కలుగదు. భారతదేశంలోని ప్రతీ ఇంటిలో ఉండే అమ్మ లాగానే, ఒక సాధారణ గృహిణిగానే ఆమె తోస్తుంది. సాధారణ రీతిలో ఇంటిని శుభ్రపరుస్తూ, వంట చేస్తూ, బట్టలు ఉతుకుతూ, గృహసంరక్షణ చేసే మామూలు స్త్రీగానే ఆమె కనిపించారు. ఇలాంటి సాధారణ జీవనం గడిపే స్త్రీలో దివ్యత్వం దాగి ఉందని గ్రహించడం సాధ్యమేనా?

జయరామ్‌బాటిలో ఉన్న గ్రామస్థులు కూడా అమ్మమహిమను అర్థం చేసుకోలేకపోయారు. వారికి ఆమె ఒక అక్కగా, అత్తగా, మేనకోడలిగా, లేదా అమ్మగా మాత్రమే తోచింది. ఆ గ్రామస్థులలో ఒకరు ఆమెను ఇలా ప్రశ్నించారు : 'నిన్ను చూసేందుకు ఎంతో దూరాల నుండి జనం వస్తున్నారు, అయితే మాకు ఇది ఏమీ అర్థం కావడం లేదు, నీవెవరు?' అని. దానికి అమ్మ సమాధానమిస్తూ, 'నీకు అర్థం కాకపోతే ఏమైంది? మీరందరూ నాకు స్నేహితులే! నేనూ మీకు అంతే!' అని అన్నారు.




ఇంకోసారి అంబికాచరణ్ అనే వయసు మళ్ళిన కాపలాదారుడు శారదాదేవితో 'అందరూ నిన్ను దేవత అనీ, ఇంకేదో అనీ అంటూ ఉన్నారు. నా వరకు నాకు ఏమీ అర్థం కావడం లేదు' అన్నాడు. దానికి కూడా చాలా సామాన్యంగా, 'ఏదో అర్థం చేసుకోవాలని ఎందుకు అనుకుంటున్నావు? నీవు నా సోదరుడవు. నేను నీ చెల్లెలు శారదను. అంతే!' అని జవాబిచ్చారు. ఆమె చాలా మామూలుగా ప్రవర్తించేవారు అనేందుకు దృష్టాంతాలు ఎన్నో కనిపిస్తాయి. ఒకసారి ఒక చిన్న బాలుడిని, 'నాకు కొన్ని పూలు కోసుకురాగలవా?' అని బ్రతిమాలుతూ, అతను నిరాకరించినా వదలక బుజ్జగించి తెప్పించుకున్నారు.

అలాగే మరో సందర్భంలో, ఒక స్త్రీని 'కాళ్ళు నొప్పులుగా ఉన్నాయి. కొంచెం మర్దన చేయమ'ని బ్రతిమాలుకున్నారు. అయితే మనమంతా ఆమెను ఒక మామూలు వ్యక్తిగా భావించేందుకు ఈ రీతిలో ప్రవర్తిస్తూ ఉన్నా, మరోపక్క తన దివ్యకిరణాలను ప్రసరింపజేస్తూ వినోదాన్ని పొందేవారు.

మహానుభావులైన శ్రీశంకరాచార్యుల వారు అమృతత్త్వపు మాటలతో జగన్మాతను 'నిత్యానందకరీ!' అని సంబోధించారు.





ఆ మాత మనందరికీ అనంతమైన ఆనందాన్ని ప్రసాదిస్తూ, శారదామాత రూపంలో తన పిల్లల కష్టాలను చూడలేక సాధారణ స్త్రీ లాగా కంటతడి పెట్టింది.

ఆ మాత 'సౌందర్య రత్నాకరీ!' అనంతమైన సౌందర్యాన్ని కలిగి ఉన్నది. అయితే శారదామాత రూపంలో సౌందర్యాన్ని పూర్తిగా వెల్లడి కానివ్వలేదు. శ్రీరామకృష్ణులు, గోలాప్‌మాతో ఈ విధంగా అన్నారు: 'ఆమె శారద-సరస్వతియే, జ్ఞానాన్ని అందించేందుకు వచ్చింది, అయితే ఈసారి తన సౌందర్యాన్ని మరుగు పరచింది'. అయితే నిజసౌందర్యం బహిర్గతం కాకపోయినా, అమ్మ రూపం మనసులను ఆకర్షించే రీతిగా



కనిపిస్తుంది. ఏ పదాలు అమ్మను వర్ణించేందుకు సరితూగుతాయి? మనకు సీతామాత, రాధాదేవిలవి ఊహాచిత్రాలు మాత్రమే ఉన్నాయి. అయితే ఆ ఊహాచిత్రాలు కూడా అద్భుతంగానే తోస్తాయి. కానీ ఇక్కడ శారదామాతను చూస్తూ ఉంటే మనకు సీతామాత, రాధాదేవిల సాక్షాత్కారం కలిగిన భావన వస్తుంది. మానవాళి అంతా, దివ్యజనని ఛాయాచిత్రాన్ని తీసి మనకు అందించిన శ్రీమతి ఓల్‌బుల్‌కు ఋణపడి ఉంటుంది. ఈ సౌందర్య రత్నాకరి తన శుద్ధ స్వరూపంతో, అనేకులకు భగవత్సాక్షాత్కారసాధనలో అనుగ్రహ వర్షం కురిపించిందనేది అందరికీ తెలిసిన సత్యమే!

ఆమె 'నానా-రత్న-విచిత్ర-భూషణకరీ!' ఆ జగన్మాత ఎల్లప్పుడూ చిత్రవిచిత్రమైన కాంతులీనే ఆభరణాలతో అలంకృతయై ఉంటుంది. అయితే శారదామాతగా ఆవిడకు ఏ ఆభరణాలూ లేవు. పెళ్ళిరోజున శ్రీరామకృష్ణుల తల్లి చంద్రమణీదేవి చిన్నారి శారదను ఆభరణాలతో అలంకరించినా, మరునాటి ఉదయమే ఆ చిన్నారి నిద్రలో ఉండగానే ఆమెకు తెలియకుండా వాటిని శ్రీరామకృష్ణులు తీసివేస్తారు. మెలకువ వచ్చాక అది గమనించిన ఆమె ఏడవడం మొదలుపెట్టింది. అలా ఎందుకు బాధపడదు? ఆమె నిజప్రవృత్తి నానా-రత్న-విచిత్ర-భూషణకరి కదా మరి! ఆమె లీలను ఎవరు అర్థం చేసుకోగలరు?

ఆ దివ్యమాత 'బ్రహ్మాండ భాండోదరీ!' అనంత విశ్వాన్ని తన గర్భంలో దాచి ఉంచుకున్న మహాశక్తి! అలాంటి ఆమె, శారదామాతగా కలకత్తా, దక్షిణేశ్వరంలోని నహబత్‌లో అతి చిన్నగదిలో ఎన్నో ఏళ్ళు గడిపింది. అంతటి చిన్న గదిలో నివసించిన ఆ తల్లి నిజతత్త్వం గురించిన ఎరుక సాధారణ మానవులకు కలుగుతుందా? అత్యున్నత దాపరికం అంటే ఇదే! దివ్యమాయ అద్వితీయ ప్రాభవానికిదే చక్కటి నిదర్శనం!

దివ్యజనని శారదామాత తన చుట్టూ ఉన్న వారందరితోనూ తనకు కూడా రక్షణ, పోషణ అవసరమే అనే విధంగానే ప్రవర్తించారు. ఆ దివ్యజనని 'అభయంకరీ!' - మనకు భయం లేని స్థితిని ప్రసాదించగలిగేది. అయినా శారదామాతగా, పిచ్చివాడైన హరీశ్‌ను చూసి భయపడి పరుగెత్తింది. అయితే సృష్టిస్థితి వినాశిని అయిన ఆ తల్లి హరీశ్‌కు భయపడినట్లుగా పరుగిడినా, బగళామాతగా తన శక్తిని ప్రదర్శించి హరీశ్‌ను శిక్షించింది. సాధారణంగా పిచ్చివారికి అధిక బలం ఉంటుంది. అలాంటి హరీశ్‌ను అవలీలగా నేలపై పడవేయడం లీల కాదా! ఈ నాటకం అంతా భక్తుల మనోఫలకాలపై చెరగని రీతిగా ముద్రను వేసి, వారిని తన మాయాలీలా ప్రదర్శనలతో ముంచెత్తి సమాధి స్థితిలోకి చేర్చేందుకే అని చెప్పవచ్చు.

ఆ తల్లి అనుగ్రహం లేనిదే మానవులు ఆమె శక్తియుక్తులను గ్రహించలేరు. ఎవరి తేజోమయకాంతితో విశ్వమంతా వెలుగొందుతూ ఉందో, ఏ కాంతితో జగమంతా చూడబడుతూ ఉందో, ఆ కాంతికి మూలమైన తల్లి మేలిముసుగును ధరించి ఉంది! ఆమె మన యందు కృపతో దానిని తొలగించినప్పుడే మనం ఆమెను చూడగలం! అయితే ఏదో రీతిగా ఆ మహత్తర శక్తి కాంతిపుంజాలు మనల్ని తాకుతూనే ఉండి, లిప్తకాలం పాటు ఆ శక్తికి నివ్వెరపడుతూ ఉన్నా, తిరిగి మాయతో కప్పబడుతూనే ఉంటాం. అరుదైన కొన్ని సత్యాల ద్వారానే ఆ శక్తి తేటతెల్లమవుతూ ఉంటుంది.

అమ్మ అతి సాధారణ ప్రవర్తన వల్ల, 'ఈమె దివ్యజనని అన్నది నిజమేనా?' అని అందరికీ సందేహం కలిగేది. శ్రీరామకృష్ణుల గొంతు వ్రణం గురించి కూడా ప్రాపంచికుల మనస్సులలో, ఇలాంటి సందేహమే కలిగింది. 'ఆయన సాక్షాత్తూ భగవదవతారం అయితే, ఆ వ్యాధి ఎందుకు వచ్చింది?' అనే అపోహ కలిగింది. ఇదీ అలాంటిదే. శారదాదేవి ఎవరికీ తాను మహాశక్తిననే సంగతి తెలియనీయకుండా అతి జాగ్రత్తగా మసలుకునేవారు. 'రాధూ'తో శారదామాతకున్న అనుబంధం ప్రాపంచికమైన బాంధవ్యంగా

(మిగతా 32వ పేజీలో...)

తల్లీ! నాకు మంత్ర తంత్రాలు, స్తోత్రాలు, ఆవాహనలు, ధ్యానాలు తెలియవు. నీ మాహాత్మ్య కథనాలు తెలియవు. విలపించడం కూడా తెలియదు. 'సర్వసంతాపహారిణి' అని మాత్రం తెలుసు. - ఆదిశంకరాచార్యులు

# జీవనయానంలో అసలు పాఠం

**- స్వామి శితికంఠానంద**

ప్రపంచంలో ఇప్పుడు సగం మంది నాస్తికులుగానో లేదా అజ్ఞేయవాదులు (భగవంతుడున్నాడని చెప్పలేం, లేదని చెప్పలేం అనేవారు) గానో ఉన్నారు. కారణం భగవంతుడి గురించి ఆలోచించే సమయం మనిషికి లేదు. దేవుడు ఈ ప్రపంచాన్ని సృష్టిస్తే ఇంత దుఃఖం, ఇన్ని బాధలు, ఇన్ని అసమానతలు ఎందుకు ఉన్నాయని వారి భావన. అంటే మన ఆలోచనలకు అనుగుణంగా ఉంటే దైవమున్నట్లు, లేకపోతే లేదు. కానీ మన అవగాహనలో ఇంకా పరిణతి రావాలని మాత్రం మనకు ఎన్నడూ అనిపించదు. ప్రశ్నవేసినంత తొందరగా సమాధానం రాదనీ, కొంత త్యాగం, తపస్సు అవసరమనీ మనం గ్రహించం.

సాంకేతిక పురోభివృద్ధి భౌతికంగా మనిషి జీవితాన్ని కొద్దిగా సుఖవంతం చేసిందేమో కానీ దుఃఖాన్ని మాత్రం ఏమీ తగ్గించలేక పోయింది. విలాసాలు పెరిగాయి. ధన ప్రాధాన్యం పెరిగింది. ఆదాయం హెచ్చుగా ఉంటేనే జీవితం సుఖకరంగా ఉంటుందన్న భావన మనలో పాదుకుంది. కుబేరుడుగా ఎదిగి విలాసవంతమైన జీవితం గడపడానికి కాదు గదా కనీసం మధ్యతరగతి జీవితం గడపడానికి కూడా అవిశ్రాంత ప్రయత్నం చేయాల్సిన పరిస్థితి మనది.

**జంతువులు మనకన్నా నిర్భయంగా ఉన్నాయేమో!:** అడవిలో సింహం తనకు ఆకలైనప్పుడు మాత్రమే వేటకు బయలుదేరుతుంది. దొరికిన జంతువును తిని తన ఆకలి చల్లార్చుకున్న తరువాత మళ్ళీ ఆకలి అయ్యేదాక ఇంకోజంతువు దానికి గుర్తురాదు. గుహలో విరామాన్ని ఆస్వాదిస్తుంది. 'నేను తీరుబడి లేకుండా ఉన్నాను' అని మాత్రం బోర్డు పెట్టదు. రేపటి ఆలోచన.. అంటే రేపు తనకు మళ్ళీ ఆహారం దొరుకుతుందో లేదోనన్న సంశయంతో మరో జంతువును చంపి మరుసటి రోజుకు దాచుకోదు. ఇక రేపటి రోజు గురించే ఆలోచించని జీవికి 'వార్ధక్యంలో ఎలా జీవించాలి? ఏ బ్యాంకుల్లో డిపాజిట్లు పెట్టుకోవాలి? పింఛను ఎలా వస్తుంది?..' ఇలాంటి ఆలోచనలే ఉండవు. ఆ జీవి సదా వర్తమానంలో ఉంటుంది. గంభీరంగా ఉంటుంది. ప్రశాంతతను అనుభవిస్తుంది. భగవంతుడి మీద పూర్తి విశ్వాసమున్న జీవిలాగా జీవిస్తుంది. 'నన్ను సృష్టించిన నా తండ్రికి నా ఆకలి తీర్చడం ప్రథమ కర్తవ్యం' అన్న ధీమాను ఒలకబోస్తుంది.

ఒక విధంగా చూస్తే మనిషికన్నా నిబ్బరంగా జీవితాన్ని గడుపుతుంది. సింహమే కాదు, మిగతా జీవులకు వేటికీ రేపటి గురించిన ఆలోచన, ఆదుర్దా ఉండదు. వర్తమానాన్ని విస్మరించి నిరంతరం గతంలోనో లేదా భవిష్యత్తులోనో జీవించే మనిషి మనసు లాంటి చిత్రమైన మనసు వాటికి లేదు. అందుకని మనిషికన్నా ఎక్కువ ప్రశాంతతను పొందుతున్నాయి. మనకన్నా వాటికే భగవంతుడి మీద ఎక్కువ నమ్మకముందనిపిస్తుంది! మనిషి జీవులన్నింటిలోకి సర్వోత్కృష్ట జీవి అని పేర్కొంటాం. మరి జంతువులకన్నా మనం ఏ విధంగా ఉన్నతులం? వాటికన్నా మనకే ఎక్కువ భయాలు ఉన్నాయి కదా!

**భయం లేని మనిషి లేడు...** భయంలేని మనిషి ఈ ప్రపంచంలో ఎవరూ లేరు. నేడు మనల్ని భయంతో కుంగదీస్తున్న విషయాలు అనేకం. వివేకానంద స్వామి 'మనిషి దుఃఖానికి కారణం ఈ భయమే. భయమే మృత్యువు, భయమే దైన్యం, భయమే పాపం' అని అంటారు. మనం జాగ్రత్తగా విశ్లేషిస్తే 'మనిషి పాపం చేయడం వెనుక ఏదో భయం ఉండబట్టే' అని అర్థం అవుతుంది. మరి ఈ భయాన్ని ఎలా తొలగించుకోవాలి? మార్గమేమన్నా ఉన్నదా? భర్తృహరి మహారాజు తన వైరాగ్యశతకంలో...

**"భోగే రోగభయం, కులే చ్యుతిభయం, విత్తే నృపాలాద్భయం; మానే దైన్యభయం, బలే రిపుభయం, రూపే జరయా భయం; శాస్త్రే వాదిభయం, గుణే ఖలభయం, కాయే కృతాన్తాత్ భయం; సర్వేవస్తు భయాన్వితం భువి నృణాం వైరాగ్యమేవ అభయం -** భోగంలో రోగభయం, కులంలో కులభ్రష్టత భయం (కులాచారాల ప్రకారం జీవించాలన్న నిబంధన వలన కలిగిన భయం. అప్పటి సమాజంలో ఉన్నటువంటిది), ధనాగారం పెద్దదైతే తోటిరాజుల వలన భయం(ధనంతో చోరభయం), గౌరవంలో అవమాన భయం, శక్తివంతమైన రాజుగా ఉందామంటే శత్రువుల భయం (పదవిలో పదవీచ్యుతి భయం), రూపసౌందర్యంలో ముసలితనం వలన భయం, పాండిత్యంలో ప్రతివాద భయం, శీలంలో శీలభ్రష్టత భయం, శరీరానికి మరణభయం; భూమిపై అన్నీ భయంతో కూడుకున్నవే.. వైరాగ్యమే మనిషికి అభయాన్ని ప్రసాదిస్తుంది" అని అంటాడు.

భర్తృహరి మహారాజు జీవితాన్ని ఎన్నో కోణాల నుంచి విశ్లేషించాక చెప్పిన మాటలివి. కాన ఈ ప్రపంచంలో మనిషి దేనిపైనా మమకారాన్ని పెంపొందించుకోవడానికి లేదు. మరి మనిషి ఏం చేయాలి? తనను తాను అధ్యయనం చేయాలి. అప్పుడు సమగ్రజ్ఞానం కలుగుతుంది. కానీ అది అంత తేలిక కాదు. నిజానికి **ఈ అధ్యయనానికి అవరోధాన్ని కలిగిస్తున్న పరిస్థితులనే మనం మాయ అంటాం.**

**సమగ్ర జ్ఞానాన్ని పొందటం ఎలా? :** భర్తృహరి విశ్లేషించినట్లు వైరాగ్యం ద్వారానే అభయాన్ని పొందుతాం. వైరాగ్యానికి వివేకమే మూలహేతువు. వివేకం ద్వారానే విజ్ఞానం సాధ్యమవుతుంది. విజ్ఞానమే సర్వదుఃఖాపహారి. ఆధ్యాత్మిక జ్ఞానానికే విజ్ఞానం అనిపేరు. అందుకనే అన్ని దానాల్లోకి పారమార్థిక జ్ఞానదానం ఉత్తమోత్తమం అని మహా భారతంలో వ్యాసమహర్షి మైత్రేయ మునితో అంటాడు. అలానే వివేకానందుడు కూడా దానం గురించి మాట్లాడుతూ జ్ఞానదానమే సర్వోత్కృష్టం అంటారు. భరతఖండంలో నిరంతరం ఈ పరావిద్య దానం చేయబడుతూనే ఉన్నది. ఐతే దురదృష్టవశాత్తు ఈ దానాన్ని స్వీకరించడానికి కావలసిన సంస్కారం (సత్త్వగుణం, అంతర్ముఖత, నివృత్తి మార్గాన్ని అవలంబించే శక్తి) అందరికీ లేదు.

**ప్రపంచాన్ని ఆస్వాదించడం ఎలా? :** 'సంసార సముద్రంలో మనం ఎలా ఈ జీవన నౌకను నడపాలి?' అన్నది ప్రశ్న. సర్వం ఏదో భయంతో కూడుకున్న ఈ ప్రపంచాన్ని పట్టుకొని ఉండటం అవివేకమని మనకు ఇప్పుడు అర్థమైంది. ఐతే అందరికీ తీవ్రమైన వైరాగ్యం కలగడం అంత తేలికకాదు కాబట్టి, రెండో మార్గంగా మనం భగవంతుడిని ఆలంబనగా చేసుకొని జీవితాన్ని గడపడం నేర్వాలి. మనం ప్రయత్నం చేసేటప్పుడు ఆయన ఉపకరణంగా భావిస్తూ చేయాలి. మనం సాధించిన ప్రతి విజయం వెనుక దైవాను గ్రహం ఉందని భావించాలి. అంతా స్వీయకృషితోనే సాధించామని విర్రవీగకూడదు. జయాపజయాలను రెండింటినీ సమంగా స్వీకరించాలి. ఏది కలిగినా మన మంచికే అని తెలుసుకోవాలి.

భాగవతంలో కుచేలుడు ధనసహాయం కోసం శ్రీకృష్ణ పరమాత్ముడి దగ్గరకు వెళతాడు. నోరు తెరిచి తానుగా ఏదీ అడగలేక పోతాడు. ఐనా ఆ దేవదేవుడు, ఆ విప్రుడు ఎందుకొచ్చాడో తెలుసుకొని ఆయన అడగకుండానే సర్వసంపదలను అనుగ్రహిస్తాడు. అప్పుడు ఆ విప్రుడు మాధవుడి అనుగ్రహానికి ఎంతో సంతోషపడి ఇహపరాలలోనూ మనిషికి ఏసంపదలు సమకూరాలన్న భగవంతుడి అనుగ్రహమే మార్గమని వక్కాణిస్తాడు. 'కించిత్కరో త్యర్వపి యత్ స్వదత్తం సుహృత్కృతం ఫల్గ్వపి భూరికారీ.. భగవంతుడు తాను మనకు ఇచ్చినది గొప్ప సంపదైనా కొద్దిదిగానే భావించి, మనం ఇచ్చింది స్వల్పమైనా, అల్పమైనదైనా మహాదక్షిణగా పరిగణిస్తాడు' అని అంటాడు. భగవంతుడికి మానవుడిపై అంత అనుకంప ఉంటుంది. కానీ విశ్వాసం లేనప్పుడు మనం దైవాలంబనగా జీవించడం నేర్చుకోలేం. మనకు జీవన కళ అబ్బదు.

**జీవన కళ...:** జీవన కళ అంటే ప్రతి వ్యక్తి తనను తాను భగవంతుడి పనిముట్టుగా భావించుకుంటూ తన విధియుక్తకర్మలను చేసుకుంటూ పోవడమే. భగవంతుడే తనను ఆ పనిలో నియోగించాడని తెలుసుకొని పనిని శ్రద్ధతో, ఫలాపేక్ష లేకుండా, ఒక యోగంలా చేసుకుంటూ పోవాలి. ఇలాంటి భావం లేకపోతే 'అంతా నేనే చేస్తున్నాను' అన్న అహంపైకొని మనిషికి బంధాన్ని పెంచుతుంది. మమకారం పైకొని తన ఇచ్ఛ ప్రకారం జరగనిది ప్రతీదీ దుఃఖాన్ని కలుగజేస్తుంది. జంతువులు పిల్లలను కంటాయి. కానీ పూర్తిగా తమకు తాము సహాయం చేసుకోలేని పరిస్థితిలో ఉన్నంత వరకే వాటిని కాపాడతాయి. తర్వాత వేటి దారి వాటిదే. వాటిపై మమకారాన్ని పెంచుకోవు. ప్రేమను ప్రకటిస్తాయి..కానీ కొద్ది కాలం మాత్రమే. ఇది స్వలాభాపేక్ష లేనిదైనప్పటికీ నిజమైన ప్రేమ అవదు. ఎందుకంటే ఈ ప్రేమ నిత్యనూతనం కాదు కనుక. అందుకే ఖలీల్ జిబ్రాన్ 'సదా వృద్ధిచెందని ప్రేమ, ప్రేమ అవదు' అని అంటారు.

ఐతే మనిషికన్నా జంతువులే మేలు. మనిషిలాగా అవి మమకారాన్ని ప్రేమ అనుకోవడం లేదు, మమకారంతో బాధలు పడడంలేదు. సంతానాన్ని ప్రేమించాలి. కానీ మమకారం ఉండకూడదు. ఆ ప్రేమించడం కూడా తనవాళ్ళని కాకుండా భగవంతుడి రూపాలుగా భావించి ప్రేమించాలి; నిజమైన ప్రేమలో లేశమాత్రం ఆపేక్ష ఉండదు. పిల్లలు వాళ్ళ కాళ్ళ మీద వాళ్ళు నిలబడ్డ తర్వాతనైనా కుటుంబి తన మనసును భగవంతుడి వైపుకు త్రిప్పాలి. మానవుడికి మాత్రమే ఈ అవకాశం ఉంది. కానీ సమకాలీన సమాజంలో మనిషి కూడా పూర్తి ప్రాపంచిక వ్యామోహంతో, సంసారసాగరంలో చుక్కాని లేని నావలాగా మిగులుతున్నాడు. తన ఉన్నతజన్మ ప్రయోజనాన్ని పరిరక్షించుకోలేక పోతున్నాడు.

**మనిషికీ భగవంతుడికీ మధ్య సంబంధం :** ఒక సన్న్యాసిని ఒక భక్తుడు మనిషికీ, భగవంతుడికీ మధ్య సంబంధం ఏమిటని అడుగుతాడు. ఆయన 'మనిషి ('నేను' అన్న అహం) ఉన్నంత సేపు భగవంతుడు లేడు. భగవంతుడున్నచోట మనిషి లేడు' అంటాడు. అంటే అర్థం ఈ ప్రపంచం మొత్తంలో నిరంతరం ఒకే ఒక్క సంకల్పం అభివ్యక్తమవుతుంది. అదే దైవసంకల్పం. కానీ మనిషి అహంభావం వలన 'నా వలన జరుగుతుంది' అనుకుంటాడు. ప్రమాదంలో పడతాడు. తన వ్యక్తిగత ఇష్టాయిష్టాలను ప్రక్కన బెట్టి అంతా భగవదిచ్ఛకు సమర్పించాలి. నిరంతరం సులక్ష్యాలను కలిగి, తనను తాను సత్ప్రయత్నంలో నియోగించుకుంటూ ఫలితాలు అనుకూలంగా ఉన్నా, ప్రతికూలంగా ఉన్నా ఒకేరకంగా స్పందించటం నేర్చుకోవాలి. అదే మనిషి జీవితంలో నేర్చుకోవాల్సిన అసలు పాఠం. అప్పుడే జీవితంలో నిజమైన శాంతి, ప్రశాంతత కలుగుతాయి. ❖



ధైర్యాన్ని చుక్కానిగా చేసుకొని
ముందుకు సాగినప్పడే
జీవననావ సజావుగా
తీరం చేరుతుంది.

జీవుడి అహంకారమే మాయ. ఈ తెరే ఆత్మప్రకాశాన్ని కప్పేస్తుంది. అహంకారం నశించిందా అన్ని చిక్కులూ తొలగిపోతాయి. అప్పుడు ఈజన్మలోనే ముక్తుడవుతాడు. - శ్రీరామకృష్ణ పరమహంస

# వదాన్యత... కృతజ్ఞత

- శ్రీమతి సుధామూర్తి, ఇన్ఫోసిస్ ఫౌండేషన్

నా చిన్ననాటి మిత్రులు రమేశ్, షీలాలు తాము కొత్తగా కట్టుకున్న ఇంటి గృహప్రవేశానికి ఆహ్వానించారు. రమేశ్ ప్రొఫెసర్. షీలా క్లర్క్‌గా పనిచేస్తోంది. ఎంతో పొదుపుగా జీవిస్తూ, బెంగుళూరు శివారులో ఇల్లు కట్టుకున్నారు. అందరికీ రావడానికి వీలు కుదరాలని రమేశ్ ఓ ఆదివారం గృహప్రవేశ కార్యక్రమాన్ని ఏర్పాటు చేసుకున్నాడు. ఈ రూపంగానైనా బాల్యమిత్రులందరినీ కలుసుకోవచ్చన్న ఉద్దేశంతో, పనులన్నీ వదులుకొని ఆ ఆదివారం రమేశ్ వాళ్ళ గృహప్రవేశానికి వెళ్ళాను. దాదాపు పాతస్నేహితుల మందరమూ ఆ వేడుకలో కలిశాం. అతిథులందరూ వెళ్ళిపోగానే, చిన్ననాటి మిత్రులమందరం ఆరుబయట కూర్చొని కబుర్లు చెప్పుకుంటూ ఉన్నాం.



ఇంతలో నా చూపు రమేశ్ వాళ్ళ కొత్త ఇంటి నామఫలకం (నేమ్‌ప్లేట్) పైకి వెళ్ళింది. నల్లటి గ్రానైట్ రాయిపై 'శ్యామకమల్' అన్న పేరును చెక్కి అమర్చారు. సాధారణంగా ఏ ఇంటికైనా యజమానుల పేర్లో, పిల్లల పేర్లో, దేవుళ్ళ పేర్లో, తల్లితండ్రుల పేర్లో పెట్టుకుంటారు. అయితే నాకు రమేశ్, షీలాల బంధువర్గం గురించి చిన్నప్పటి నుంచి తెలుసు. వాళ్ళ ఇళ్ళలోని వ్యక్తుల పేర్లకూ, ఆ ఇంటి నామఫలకానికీ ఎలాంటి సంబంధమూ లేదు. అదే సందేహాన్ని రమేశ్‌తో వ్యక్తం చేస్తూ, 'రమేశ్! ఈ 'శ్యామ కమల్' నామఫలకం వెనుక మర్మమేంటి?' అన్నాను సరదాగా!

అప్పుడు రమేశ్ నవ్వుతూ "సుధా! శ్యామారావు, కమలల పేర్లు కలిపి 'శ్యామకమల్' అని ఇంటికి పేరుపెట్టాం. నేను కాలేజీలో చదివే రోజుల్లో ఓ వృద్ధ దంపతుల ఇంట్లో ఉండేవాడిని, నీకు గుర్తుంది కదా! వాళ్ళే శ్యామారావు, కమలగార్లు" అన్నాడు. నాకు అప్పుడు గుర్తొచ్చారు, మేము కాలేజీలో చదివేరోజుల్లో విద్యార్థులకు ఇల్లు అద్దెకిచ్చే ఆ వృద్ధ దంపతులు! అలా అద్దెకున్న వాళ్ళలో రమేశ్ ఒకడు. దాదాపు ఆరేళ్ళు అతను అక్కడే ఉన్నాడు. అయితే ఆ ఇద్దరి పేర్లు రమేశ్ తన ఇంటికి ఎందుకు పెట్టాడో అర్థం కాలేదు.

నా సంశయాన్ని గుర్తించిన రమేశ్ తన సమాధానం కొనసాగిస్తూ, "ఆ రోజుల్లో పై చదువులు చదివేందుకు నన్ను పల్లె నుంచి పట్టణాలకూ, నగరాలకూ పంపడానికి మా వాళ్ళు అంగీకరించలేదు. ఇంటి దగ్గరే ఉండి, వ్యవసాయం చేసుకోమన్నారు. అయితే మా నాన్నకు రిటైర్డ్ పోస్ట్‌మాస్టర్ శ్యామారావు గారిపై గురి. వారంటే మా నాన్నకు అమితమైన గౌరవం. నన్ను బాగా చదివించమని, మా నాన్నను ప్రోత్సహించింది ఆయనే! నన్ను తమ పట్టణంలోని కాలేజీలో చేర్పించమనీ, నా బాగోగులు చూసుకునే బాధ్యత తనదేననీ చెప్పి నేను కాలేజీలో చేరడానికి ఆయన కారణమయ్యారు.

శ్యామారావుగారు నన్ను తమ ఇంట్లోనే ఉంచుకున్నారు. అద్దె తీసుకోలేదు. వారి అర్ధాంగి కమలగారు నన్ను కన్నబిడ్డలా చూసుకునేవారు. ఆ తల్లి దయ వల్ల నేను ఒక్కరోజు కూడా ఆకలితో పస్తులుండ లేదు. మా నాన్న ఆర్థిక పరిస్థితి కూడా అంతంత మాత్రంగానే ఉండేది. ఆ సమయంలో శ్యామారావు గారు తన కొచ్చే కొద్ది పింఛనుతోనే నా కాలేజీ ఫీజు కట్టేవారు" అని ఉద్వేగంగా చెప్పాడు.

ఇంతలో పక్కనే ఉన్న రాఘవ, 'నువ్వు వాళ్ళకు చిన్న చిన్న పనులు చేసి పెడుతూ ఉండేవాడివి. ఎంతో సహాయకారిగా ఉండేవాడివి కదా! వాళ్ళు ఉచితంగా చేశారని ఎందుకనుకుంటున్నావు!' అన్నాడు. రమేశ్ వెంటనే "అందుకు నేనొప్పుకోను రాఘవా! వాళ్ళు నా కోసం అవన్నీ చేయాల్సిన అవసరం లేదు. వాళ్ళు ధనవంతులేమీ కాదు; పింఛనుపై జీవిస్తున్న వృద్ధదంపతులు. వాళ్ళ సహాయమే లేకపోతే నేనీరోజు ఎక్కడ, ఎలా ఉండేవాడినో తెలీదు. ఆ పుణ్యాత్ముల వల్ల నా కాలేజీ జీవితం సజావుగా సాగిపోయింది. వాళ్ళ ఔదార్యాన్ని నేనెన్నటికీ మరచిపోలేను. ముఖ్యంగా నా కాలేజీ చదువైపోయి, నిరుద్యోగిగా ఉన్నప్పుడు కూడా శ్యామారావుగారు ఎంతో ఆదుకున్నారు; నాలో ఆత్మవిశ్వాసం నింపారు" అన్నాడు.

'ఇంతకూ మీ ఇంటికి వాళ్ళ పేరు ఎందుకు పెట్టాలని పించింది' అన్నాను. అప్పుడు రమేశ్ "మా నాన్న నాకు అతి విలువైన పాఠం నేర్పించారు. అది ఏమిటంటే - చేసిన మేలును మరచిపోకూడదనే పాఠం! మనవాళ్ళు మనల్ని చూడడం గొప్ప విషయం కాదు. కానీ రక్తసంబంధమేదీ లేని ఆ వృద్ధదంపతులు నేను పైకి రావడానికి కారకులై మానవ సంబంధాలకు కొత్త అర్థాన్నీ, అందాన్నీ ఇచ్చారు. ఇంటికి వాళ్ళ పేరు పెట్టమని మా నాన్నే సూచించారు. నా చదువులో వాళ్ళ పాత్ర ఘనమైనది. ఆ విషయాన్ని నా పిల్లలకు చెప్పాలి. వాళ్ళు మాటల ద్వారా కాక చేతల ద్వారా అది నేర్చుకోవాలి" అన్నాడు. ఆ వృద్ధదంపతుల వదాన్యత, నా మిత్రుడి కృతజ్ఞత తలచుకొని నాకు కళ్ళు చెమర్చాయి. ❖ సేకరణ: జి. సతీష్






- స్వామి పరిజ్ఞేయానంద

# మనస్సును దహించే మాత్సర్యం

పి.మేఘన, కళాశాల విద్యార్థిని, హైదరాబాదు

**ప్రశ్న: నా స్నేహితురాలితో ఈ మధ్య మనఃస్పర్థలు వచ్చాయి. అప్పటి నుండీ మేము మాట్లాడుకోవడం మానేశాం. కానీ ఆమెను చూసినప్పుడల్లా నాలో ద్వేషం రగులుతుంది, ప్రతీకారభావం కలుగుతుంది. ఇలాంటి భావాలవల్ల ప్రశాంతంగా ఉండలేక పోతున్నాను. ఈ సమస్యకు ఏదైనా పరిష్కారం తెలపండి.**

జవాబు: మనం ఎదుటివారిని చూసి ఓర్వలేక పోతున్నామంటే మనస్సు అనే కట్టెకు, అసూయ అనే నిప్పు అంటుకుందని అర్థం. ఈ అసూయ అనే నిప్పుకు, ద్వేషం అనే గాలి తోడైతే ప్రతీకారజ్వాల రగులుతుంది.



అయితే, ఈ అసూయారాక్షసి సాధారణ మానవులమైన మనల్నే కాదు, ఆకులూ అలములూ తింటూ అరణ్యాలలో తపస్సు చేసిన విశ్వామిత్రునిలాంటి మహర్షులను, సకలభోగ భాగ్యాలతో రాజప్రాసాదంలో నివసించే దుర్యోధనుడిలాంటి మహారాజులను కూడా పట్టిపీడించింది.

అసూయ ముఖ్యంగా మూడు అనర్థాలకు దారితీస్తుంది. *"Jealousy only widens the chasm of misunderstanding, increases hate and retaliation* - అసూయ, అపార్థాల అగాధాన్ని పెంచుతుంది. ద్వేష, ప్రతీకార భావాలను రగులుస్తుంది" అని మనస్తత్వశాస్త్రం తెలుపుతోంది.

విశ్వామిత్రుడు, వసిష్ఠమహర్షిని చంపేయాలని పగబూనాడు. అందుకు కారణం అతడు వసిష్ఠమహర్షిని అపార్థం చేసుకోవడమే! దుర్యోధనుడు, పాండవుల ఉన్నతిని చూడలేక వారిని తుదముట్టించాలని ఎన్నో పన్నాగాలు పన్నాడు. అందుకు కారణం అతడికి పాండవులపట్ల ఉన్న ద్వేషమే! దుర్వాసమహర్షి సముద్రరాజ తనయ లక్ష్మీ వివాహానికి తనను ఆహ్వానించలేదని అవమానంగా భావించి, సముద్రరాజును శపించాడు. అందుకు కారణం ప్రతీకారభావమే!

వసిష్ఠమహర్షికి తనపట్ల సదభిప్రాయమే ఉందని తెలుసుకున్న విశ్వామిత్రుడు తన అపార్థానికి చింతించాడు. అందువల్ల అనుమానాలకు, అపోహలకు, చెప్పుడు మాటలకు ప్రాధాన్యం ఇవ్వకుండా, అసలు వ్యక్తితో స్వయంగా మాట్లాడి సమస్యలను పరిష్కరించుకోవాలి. కానీ మనం అసలు వ్యక్తితో తప్ప మిగతా అందరితో చర్చిస్తాం. అదే అపార్థాలకు కారణం.

దుర్యోధనుడు, తన సోదరులైన పాండవులను ప్రేమించి వుంటే, జీవితాంతం ద్వేషభావంతో దహించుకుపోయేవాడు కాదు. అలాగే, దుర్వాసమహర్షి, సముద్రరాజు చేసిన తప్పును క్షమించగలిగివుంటే ప్రతీకార చర్యకు పాల్పడేవాడు కాదు.

ఇతరులపట్ల మనకు కలిగిన ద్వేష, ప్రతీకారభావాల నుండి బయటపడాలంటే ఏం చేయాలి?

ఒక విద్యార్థి తన తోటి మిత్రుడితో కలిగిన అపార్థాల కారణంగా అతడిపట్ల ద్వేషంతో రగిలిపోతూ ఉండేవాడు. దీని నుండి బయటపడే మార్గాన్ని చూపించమని భగవంతుణ్ణి ప్రార్థించాడు. అప్పుడు భగవంతుడు ప్రత్యక్షమై అతడితో "నాయనా! నీ బాధ నాకు అర్థమైంది. నేను నీకు రెండు డబ్బాలిస్తాను. ఇతరులు నీకు చేసిన ఉపకారాలను కాగితం మీద రాసి మొదటి డబ్బాలోనూ; ఇతరులు నీకు చేసిన అపకారాలను కాగితం మీద రాసి రెండో డబ్బాలోనూ వేయి. నెలరోజుల తరువాత ఆ రెండు డబ్బాలను తెరచి చూస్తే నీ సమస్యకు పరిష్కారం దొరుకుతుంది" అని చెప్పి అంతర్ధానమయ్యాడు.

భగవంతుడు చెప్పిన ప్రకారం అతడు రోజూ ఆ డబ్బాల్లో చీటీలను రాసి వేసేవాడు. నెల రోజుల తరువాత ఆ డబ్బాలను తెరచి చూస్తే మొదటి డబ్బా నిండుగా ఉంది. రెండో డబ్బా ఖాళీగా ఉంది. నిజానికి అతడు రెండో డబ్బాలోనే ఎక్కువ చీటీలను వేశాడు. ఇలా జరగడానికి కారణం ఏమిటో తెలుసుకుందామని రెండు డబ్బాలను తెరచి చూశాడు. మొదటి డబ్బా బాగానే ఉంది. కానీ రెండో డబ్బాకి కింద రంధ్రం ఉంది. అందువల్ల దానిలో వేసిన చీటీల్లో ఒక్కటి కూడా లేదు. అప్పుడు అతడికి అర్థమైంది 'ఇతరులు మనకు చేసిన ఉపకారాలను గుర్తుంచుకోవాలి. అపకారాలను మరచిపోవాలి' అని.

ఇతరులు మనకు చేసిన అపకారాలకు, అవమానాలకు, విమర్శలకు కలతచెందకుండా ఉండగలగడం అంత సులభమైన విషయమేమీ కాదు. కానీ అలా ఉండగలగాలంటే ముందు మన

(మిగతా 41వ పేజీలో...)

భారతజాతిని పట్టిపీడిస్తున్న మహమ్మారి అసూయ. ఈ అసూయను పూర్తిగా విడిచిపెట్టండి. కాల యాపన చేయకుండా అప్రతిహతమైన శక్తితో కర్తవ్య నిర్వహణలో నిమగ్నమవండి. - స్వామి వివేకానంద

# సడి లేని సెలయేరులా...

- బి. సైదులు

ఈ ఏడాది నోబెల్ శాంతి పురస్కారం వరించిన కైలాస్ సత్యార్థి మన భారతీయుడు కావడం గర్వకారణం. బాలకార్మిక వ్యవస్థ నిర్మూలనకు, వెట్టిచాకిరీ విముక్తికి ఆయన సాగించిన నిశ్శబ్ద విప్లవం అభినందనీయం. దాదాపు మూడు దశాబ్దాలకు పైగా కైలాస్ తన ఆశయసాధనకు అలుపెరగకుండా శ్రమిస్తున్నారు. వెండితెర తారల్లాగో, వ్యాపార దిగ్గజాల్లాగో ఆయన పేరు ప్రముఖంగా పత్రికల్లో ప్రచురితం కాకపోవచ్చు!నలుగురి నోట్లో నానకపోయి ఉండవచ్చు. కానీ కైలాస్ కృషి మాత్రం నిష్ఫలం కాలేదనడానికి, ఎనభై వేలమంది బాలకార్మికుల విముక్తే నిదర్శనం; అంతర్జాతీయ స్థాయి శాంతి పురస్కారమే పసిడిపూలహారం. మోడువారిన మానులు మారాకు వేయాలని, సడి లేక సాగిపోయే సెలయేరులా శ్రమించేవారినే శాశ్వత విజయాలు వరించగలవు. వనాలను వేలపూలతో పలకరించి పులకరింపజేసే వసంతం అలికిడి లేకుండానే ఆగమిస్తుంది; మహావృక్షాల్ని కూడా కూకటివేళ్ళతో పెకిలించే తుపాను మాత్రం భీకర హోరుతో వరదగుడేస్తుంది.

అందుకే స్వామి వివేకానంద *'Like the gentle dew that falls unseen and unheard,and yet brings into blossom the fairest of roses'* అంటారు. నిజమే! ఉషోదయంలో ఎక్కడో ఆకాశం నుంచి ఎవరికంటా పడకుండా, ఏ రవమూ లేకుండా రాలే మృదుతుషారం నవకోమలమైన గులాబీలను వికసింపజేస్తుంది. అలా ఆ మంచుబిందువులా సమాజంపై మనదైన ప్రభావాన్ని చూపాలి. అయితే ఈతరంలో చాలామంది అలా అజ్ఞాతంగా, అనామకంగా శ్రమించడం వృథా ప్రయాస అనుకుంటున్నారు; విత్తు వేయగానే ఫలాల్ని ఆశిస్తున్నారు. నలుగురు ఎంత త్వరగా తమను గుర్తిస్తే తమ అడుగులు, ఆలోచనలు అంత ప్రత్యేకం అనుకుంటున్నారు.

**గుప్తంగా...గుర్తింపునకు దూరంగా! :** ఈనాడు యువతీయువకుల్లో సృజనాత్మక ఆలోచనలకు, నవీనభావనలకు కొదువలేదు. చాలా విషయాల్లో తమదంటూ ఓ ముద్రను వేసుకునేందుకు ఎంతైనా శ్రమించేందుకు వెనుకాడటం లేదు. అయితే గుప్తంగా, గుర్తింపు లేకుండా వారి ఆలోచనలకు, ఆశయాలకు పరిపూర్ణ ఆకృతి నిచ్చుకునే సహనం మాత్రం చాలామందిలో కొరవడుతోంది. ప్రతిభను, ప్రావీణ్యాన్నీ సానబెడుతూ సమయం వచ్చే వరకు వేచి చూసే ఓపిక సన్నగిల్లుతోంది. మనస్సులో ఏ కొత్త భావన అంకురించినా, స్వల్ప సేవాకార్యక్రమానికి శ్రీకారం చుట్టినా వెనువెంటనే నలుగురి ముందు పెట్టాలనే తాపత్రయం పెరుగుతోంది. అందుకే ముఖస్తుతుల కోసం ఎంతోమంది ముఖపుస్తకపు ఖాతా(ఫేస్‌బుక్ అకౌంట్) విన్నపాలతో(రిక్వెస్ట్స్) నిండిపోతుంది. ఇలాంటి ఆర్భాటాల వల్ల మన కృషి మరుగుజ్జు మొక్కలా మారిపోతుంది. మన నైపుణ్యం నాణ్యతను కోల్పోతుంది. అందుకే సమాజంలో ఘనవిజయాలను సాధించేవారందరూ, చాలా వరకు ఎవరి కంటా పడకుండా మౌనంగా తమ పనిలో తాము మునిగిపోతూ, ఫలితాలతోనే ప్రభావితం చేస్తూ చిరకీర్తిని ఆర్జిస్తారు. కేవలం పదుగురిని ఆకర్షించేందుకు హడావిడి చేస్తూ ప్రచారం కల్పించుకునేవాళ్ళు మెరుపులా మెరిసి మాయమైపోతూ ఉంటారు. అందుకే మన సనాతన ధర్మం...

**మౌఖర్యం లాఘవం కరం మౌనమున్నతి కారకమ్ ।**
**ముఖరం నూపురౌ పాదౌ కంఠే హార విరాజతే ॥**

'ఉన్నతత్వాన్ని సూచించేది మౌనమైతే శబ్దం చేయటం అల్పత్వాన్ని సూచిస్తుంది. పాదాలను అలంకరించే మంజీరాలు చప్పుడు చేస్తాయి; కానీ కంఠంలో భాసించే హారం మాత్రం శబ్దం చేయద'ని విస్పష్టం చేసింది.

**మరుగే మెరుగు... :** పాతతరంలో ఎందరో రచయితలు, చిత్రకారులు మారుపేర్లతోనే తమ సృజనాత్మకతను పండించుకున్నారు. తమపై, తమ సామర్థ్యంపై అమితమైన ఆత్మవిశ్వాసం కలిగినవారు, తమ లక్ష్యంపై స్పష్టమైన గురి కుదిరినవారు ఎక్కువ శాతం ఇలా లోప్రొఫైల్‌నే ఇష్టపడతారు; తెరవెనుక ఉండేందుకే ఎక్కువ ప్రాధాన్యం ఇస్తారు. తెలుగు సినీగీత రచనకు సాహితీ సొబగులద్ది, సంక్లిష్టమైన ఆధ్యాత్మిక సత్యాలనూ సలలితమైన పాటల పదాలలో పొదిగిన రచయిత మల్లాది రామకృష్ణశాస్త్రిగారు. వారు చాలా వరకు తన పేరును మరుగుపరచుకొని, మధుర గీతాలన్నింటికీ మరొకరి పేరుననే ప్రచారాన్ని కల్పించారు. అదృశ్యంగా, ఆర్భాటాల అలికిడి లేకుండానే తమ సారస్వతసేవను కొనసాగించారు. అంతమాత్రం చేత వారిని సాహితీలోకం స్మరించుకోవడం మానలేదు; ఆయన కీర్తి మరుగున పడిపోలేదు. ఆణిముత్యాల్లాంటి వారి గీతాలను తదనంతర కాలంలో ఆయన అభిమానులే సంఘంగా ఏర్పడి ఆయన పేరుతో ముద్రించారు. అన్ని రంగాల్లో ఇలాంటి ప్రముఖులు ఎంతో మంది తెరచాటు దీపాల్లా తాము మరుగున ఉండి, కాంతులను లోకానికి పంచారు. అయితే ఈ తరంలో మనకు మన కృషిపైన కానీ, కాలంపైన కానీ అంత విశ్వాసం లేదు. ఆ విశ్వాసరాహిత్యమే మనల్ని ఎక్కువ అలజడికి, హడావిడికి గురిచేస్తుంది. నిజానికి మనల్ని మనం ఎంత మరుగు పరుచుకుంటే మనపై అంత ఒత్తిడి తగ్గుతుంది. అందుకే *The successfull man is low-profile in his movements and earnest in his work...*తనకు తాను తెరచాటుగా ఉండేందుకే ప్రాధాన్యమిస్తూ , కార్యదీక్షలో మాత్రం ఉత్సుకతగా మెలిగేవాడే నిజమైన విజేత' అంటారు కన్ఫ్యూషియస్.

**నిలకడ నుంచే నడకలు... :** తాను ఎంచుకున్న ఉద్యమపథంలో కైలాస్ సత్యార్థి కేవలం కితాబులే అందుకోలేదు. కఠినమైన కష్టాలనూ ఎదుర్కొన్నారు. దుష్టశక్తుల దాష్టీకాలకూ ఎదురొడ్డారు. కానీ తన కష్టనష్టాల గురించి ఆ సమయంలో సమాజం ముందు నిరసనను ప్రదర్శించలేదు. పైగా ఆ అనుభవాల నుంచి నిలకడగా నిలబడటం, ఆ నిలకడ నుంచి నడకల్ని మరింత పటిష్ఠం చేసుకోవడం నేర్చుకున్నారు. ఇవన్నీ కూడా ఆయన జీవితంలో తెరపై నిశ్శబ్దచిత్రాల్లాగే సాగిపోయాయి. ఈ నేపథ్య నిజాలన్నీ ఆయనకు నోబెల్ బహుమతిని ప్రకటించాకే, వెలుగులోకి వచ్చాయి. ఇలా మనం ఏ రంగంలో తీసుకున్నా, ప్రచారానికి దూరంగా పరిశ్రమిస్తున్నప్పుడు తాత్కాలికంగా ఎలాంటి సహకారం లభించకపోవచ్చు. కొన్నిసార్లు సమీపంగా మెలిగే వ్యక్తులు కూడా మన శ్రమను గుర్తించకపోవచ్చు. పైగా ఆటంకాలనూ సృష్టించ వచ్చు. అంతమాత్రం చేత నిరుత్సాహ పడాల్సిన పనిలేదు. అశాంతికి గురికావలసిన అవసరం లేదు. సహయోధులు లేని ఒంటరిపోరాటం వల్ల మన శక్తిసామర్థ్యాలు సంపూర్ణంగా ఆవిష్కృతమవుతాయని గుర్తుంచుకుంటూ ముందడుగు వేయాలి. నిజానికి పటాటోపం, ప్రచారహోరుల మధ్య మన లక్ష్యం చాలా వరకు మసకబారుతుందని మరచిపోకూడదు. ఈ రోజుల్లో చాలా మంది యువతీయువకులు, సంస్థలు ఆది లోనే హంసపాదులా తడబడటానికి ప్రధాన కారణం ఈ హంగూఆర్భాటాలే! నిలకడ నుంచి నడకలు నేర్వకముందే పరుగులు తీయాలని తహతహలాడటమే!

**కాలమే పరీక్షనాళిక.... :** మన కృషికి ప్రామాణికం కాలం మాత్రమే! మనం చేయగలిగినదంతా చేసిన తరువాత మిగిలినదంతా కాలానికి వదిలివేయడంలోనే నిజమైన ప్రశాంతత దాగి ఉంది. పరిశోధనా సంస్థల్లో ఏళ్ళుగా ప్రయోగాలు చేస్తున్న శాస్త్రజ్ఞులను చూస్తుంటే ఆనందాశ్చర్యాలు కలుగుతూంటాయి. హైదరాబాదులో జీవశాస్త్రానికి సంబంధించిన అంతర్జాతీయ పరిశోధనా సంస్థ సి.సి.ఎమ్.బి.(సెంటర్ ఫర్ సెల్యూలార్ అండ్ మాలిక్యులర్ బయాలజీ)లో ఓసారి వృక్షశాస్త్రవేత్తల యువబృందం తాము కొత్తగా కనుగొన్న వరివంగడాన్ని పరిచయం చేసేందుకు పత్రికా సమావేశాన్ని ఏర్పాటు చేశారు. పదేళ్ళపాటు బాహ్యప్రపంచంతో సంబంధం లేకుండా ప్రయోగశాలకే పరిమితమై వారు ఆ వంగడాన్ని ఆవిష్కరించిన విధానాన్ని వివరిస్తూంటే అబ్బురమనిపించింది. కాలపరీక్షకు నిలబడి అద్భుత ఫలితాల్ని సాధించిన వారి కార్యదీక్ష యువశాస్త్రవేత్తలకు ఆదర్శంగా నిలిచింది. ఇలా చైతన్యస్రవంతిలా సాగిపోయేవారు ఆలస్యంగానైనా, అజరామరమైన ఫలితాల్ని సాధిస్తారు. అయితే నేడు చాలామంది హంగులతో, హోదాలతో కూడిన వృత్తులవైపే ఆకర్షితులవుతూ, ఇలాంటి పరిశోధనలు, పాఠాలు చెప్పడాల్లాంటి వృత్తులను చిన్నచూపు చూస్తున్నారు. కానీ కాలక్రమంలో ఇలాంటి ప్రదేశాల నుంచే పెనుమార్పులు సంభవిస్తాయి.

**నిశ్శబ్దం నుంచే విప్లవం...:** ఈ రోజు మనం చూస్తున్న సామాజిక, సాంకేతిక విప్లవాలన్నింటికీ ఆధారం అజ్ఞాతమైన




మేధోమథనమే! ఎంతో మంది జ్ఞానులు,విజ్ఞానులు దార్శనికతతో నిశ్శబ్దంగా ఆవిష్కరించి, నిష్క్రమించారు. అందుకే ఓ ఆధ్యాత్మికవేత్త ఈ స్థితిని వర్ణిస్తూ, 'సముద్రం ఉపరితలంలో తరంగాలతో నాట్యమాడుతుంది. నురగతో నవ్వుతుంది, మెరుస్తుంది. గాలివాన వచ్చినప్పుడు ఘోష పెడుతుంది. అయినా లోలోపల అగాధాలలో ప్రశాంతంగా, మౌనంగా, శాంతంగా ఉంటుంది. అటువంటి దివ్యమైన, దార్శనికమైన అంతరాంతరమే లేకపోతే మన కార్యకలాపాలు, లక్ష్యహీనమూ, వ్యర్థమూ అవుతాయి.మన సనాతన ధర్మంలో ఉన్న రహస్య సిద్ధాంతమిదే!' అంటారు. ఇలాంటి నిశ్శబ్ద విప్లవాలకు మనం శక్తిస్థానాలుగా నిలిచి, సడిలేని సెలయేరులా ప్రవహించినప్పుడే ముందు తరాలకు మార్గదర్శకులం కాగలం. ❖

స్వకీయ ప్రతిభను ఎంత గోప్యంగా ఉంచుకుంటే అంత రాణిస్తుంది. గుప్తంగా, నిరాడంబరంగా పనిచేయడం సాత్త్విక గుణానికి ప్రతీక. అది మనలోని అహంకారాన్ని తగ్గిస్తుంది. - శ్రీరామకృష్ణులు

# విషాద నిశీథిలో...

- స్వామి విమూర్తానంద

ప్రణయ్, మాధవి దంపతులది అన్యోన్యమైన దాంపత్యం. ముప్పై ఏళ్ళు కూడా నిండని ఇద్దరూ రసాయనశాస్త్రంలో ఉన్నత చదువులు చదివి చెన్నైలో పరిశోధకులుగా స్థిరపడ్డారు. ఆ జంటకు యుక్తవయస్సులోనే శ్రీరామకృష్ణ మఠం, మూర్తిత్రయ భావ జాలంతో అనుబంధం ఏర్పడింది. వారి వృత్తి శాస్త్రపరిశోధన అయితే, ప్రవృత్తి ఆధ్యాత్మిక సాధన! వారు ప్రయోగశాలలో ఐన్‌స్టీన్ లాంటి శాస్త్రవేత్తల సిద్ధాంతాలతో మునిగితేలుతూ, పూజ గదిలో శ్రీరామకృష్ణులు, శారదాదేవిల భావాలతో మమేకమవుతూ ఉండేవారు. ఇలా దాదాపు నాలుగేళ్ళ పాటు దాంపత్యానికే సరికొత్త నిర్వచనమిస్తూ మాధవి, ప్రణయ్‌ల జీవితం పూలతేరులా సాగిపోయింది. అయితే కాలం ఒక్కసారిగా కాలనాగై కాటేసింది. ప్రత్యేక పరిశోధనల నిమిత్తం చైనా వెళ్ళిన ప్రణయ్‌ని ప్రమాదం రూపంలో కబళించింది. ప్రయోగశాలలోనే పరిశోధనలు వికటించి, ఆ మంటల్లోనే ఆయన దేహం మసిగా మారిపోయింది. ప్రణయ్ 'ఇక లేడని' తెలియగానే మాధవి మూర్ఛపోయింది. ఆ తరువాత ఆమె కన్నీళ్ళను ఆపడం ఎవరి తరమూ కాలేదు. ప్రణయ్ మిగిల్చిన స్మృతులు తప్ప, కనీసం కడసారి చూపులు కూడా దక్కలేదని మాధవి రోదించని రోజు లేదు.

**శారదమ్మ ఒడిలో సాంత్వన:** చోటు మారితేనన్నా మాధవి మనస్సు కుదుటపడుతుందని ఆమె అన్నావదినలు చెన్నైకి సమీపంలోని తమ ఇంటికి తీసుకువెళ్ళాలనుకున్నారు. ఒకరోజు ముగ్గురూ కలసి కారులో బయలుదేరారు. మార్గమధ్యంలో ఓ చోట రామకృష్ణ మఠం కనిపించింది. అప్పటి వరకు ఒక్క మాట కూడా మాట్లాడని మాధవి, ఒక్కసారిగా 'నాకు అమ్మను చూడాలని ఉంది!' అంది. 'ఇంటికే కదా వెళుతున్నాం!' అన్నారు అన్నావదినలు. 'ఆ అమ్మను కాదు, శారదమ్మను' అంది మాధవి! అప్పటికే ఆమె కళ్ళలో నీళ్ళు సుడులు తిరుగుతున్నాయి. శారదాదేవి దగ్గరకని వాళ్ళకు అర్థమై, మఠంవైపు కారు మళ్ళించారు.

అక్కడికి వెళ్ళగానే, మాధవి ఆలయంలోకి వెళ్ళి, శారదాదేవి ఛాయాచిత్రం ముందు మోకరిల్లింది. అమ్మ వదనం చూడగానే, ఆమె కళ్ళు ధ్యానంతో మూతపడ్డాయి. కానీ కన్నీళ్ళు ధారాపాతంగా కురవసాగాయి. అలా మాధవి కన్నీళ్ళు ఇంకిపోయే దాకా ఏడ్చింది. అప్పుడు హఠాత్తుగా 'అమ్మా! నీకూ నాలాగే దుఃఖం ప్రాప్తించిందా?' అని శారదామాత ప్రశ్నించినట్లు స్ఫురించింది. కష్టంతో పుట్టింటికొచ్చిన కన్నబిడ్డను తల్లి తన ఒడిలోకి తీసుకొని ఓదార్చినట్లనిపించింది మాధవికి!

వెంటనే మాధవికి శారదామాత జీవితంలోని ఉదంతాలు కళ్ళ ముందు కదలసాగాయి. ఒక్కగానొక్క కొడుకు అకాలమరణంతో కంటికి మింటికి ఏకధారగా రోదిస్తూ, తన దగ్గరకు వచ్చిన ఓ అభాగినిని శారదామాత ఓదార్చిన తీరు గుర్తొచ్చింది. ఆ కన్నతల్లి కష్టాన్ని చూసి శారదమ్మ విలపిస్తుంటే అక్కడి వారికి ఎవరి బిడ్డ కన్నుమూసిందో తెలియలేదట! అప్పుడు ఆ తల్లితో, శారదాదేవి 'నీకు ఏ కష్టమొచ్చినా ఈ అమ్మ ఉందని మరచిపోకు' అని ఓదార్చి, ప్రసాదం పెట్టి, విషాదాన్ని ఉపశమింపజేసింది. తనను ఆశ్రయించిన వారి బాధలతో శారదామాత అంతగా తాదాత్మ్యం చెందేవారు. ఇలాంటి సంఘటనలే కదా అమ్మ జగన్మాత అనడానికి నిదర్శనం అనుకుంది మాధవి. ఆ తరువాత ఆమె మఠం నుంచి కారులో అన్నావదినలతో కలసి ప్రయాణమైంది.

**అమ్మ జీవితంలోనూ అంతులేని కష్టాలు :** ప్రయాణంలో మాధవి మనస్సు మళ్ళీ శారదామాత జీవనఘట్టాల్లోకి మరలింది. "భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస భౌతికంగా ఈ ప్రపంచం నుంచి సెలవు తీసుకొని వెళ్ళిపోయిన రోజు శారదామాత దుఃఖం వర్ణనాతీతం. సాధారణ అర్ధాంగిలా అమ్మ కూడా కుమిలి కుమిలి రోదించింది. అప్పుడు శ్రీరామకృష్ణులు ప్రత్యక్షమై, 'శారదా! నేను ఎక్కడికి వెళ్ళిపోయానని బాధపడుతున్నావు. ఒక గదిలో నుంచి, మరొక గదిలోకి వెళ్ళానంతే!' అన్నారు. అప్పుడు శారదాదేవికి అర్థమైంది - ఆయన అమరులు, శాశ్వతులని! అప్పటి నుంచి శ్రీరామకృష్ణులు ఎప్పుడూ తనతోనే ఉన్నట్లు అమ్మ భావించేది!"

ఒక్కసారిగా ఆ సంఘటనను తలచుకోగానే మాధవి మనస్సులో ప్రణయ్ మెదిలాడు. ఇక తను ఒంటరిని కానన్న భావన మాధవికీ కలిగింది. ఆయన ఆశలనూ, ఆశయాలనూ సఫలం చేస్తూ, శాస్త్రపరిశోధనలో నిమగ్నమైంది. శారదామాత చరితామృతం, వచనామృతం పఠనంతో జీవితాన్ని సార్థకం చేసుకుంది. ❖





# పరివర్తనకే ప్రాధాన్యం

- స్వామి రంగనాథానంద ( రామకృష్ణ సంఘం 13వ సర్వాధ్యక్షులు )

ఒకసారి నేను (స్వామి రంగనాథానంద) అమెరికాలో పర్యటిస్తూ ప్రవాస భారతీయులు ఏర్పాటుచేసిన సమావేశానికి ముఖ్య అతిథిగా హాజరయ్యాను. అక్కడ ప్రసంగించి అనంతరం సభికుల సందేహాలకు సమాధానాలిస్తూ ఉన్నాను. ఇంతలో ఓ వ్యక్తి నిలబడి, 'స్వామీజీ! మీ అభిప్రాయం ప్రకారం ఆధునిక కాలంలో శాకాహారం మంచిదా? మాంసాహారం మంచిదా? అని ప్రశ్నించాడు. చాలా మంది వ్యక్తిగతంగా ఈ విషయమై నా దగ్గర సందేహాలు వ్యక్తం చేస్తూ ఉంటారు. సభాముఖంగా ఈ అవకాశాన్ని వినియోగించుకొని 'శాకాహారమా? మాంసాహారమా?' అన్న విషయమై నేను అక్కడ కొద్దిసేపు మాట్లాడాల్సి వచ్చింది.

ఎలాంటి ఆహారం తీసుకోవాలన్నది వ్యక్తిగత నిర్ణయం! అందరికీ ఒకే ఆహార నియమాల్ని నిర్ధారించలేము. కానీ ఆధునిక కాలంలో చాలా మంది భారతీయులే కాదు విదేశీయులు కూడా శారీరక సౌలభ్యం దృష్ట్యా శాకాహారులుగా మారేందుకు ఇష్టపడుతున్నారు. మంచిదే! అయితే శాకాహారం తీసుకోవడం వల్ల మనిషి సాత్త్వికుడైపోతాడనీ, మాంసాహారంతో క్రూరత్వం పెరిగిపోతుందనీ అనుకోవడం పొరపాటు. ఎందుకంటే *'I have seen many people in India, very vegetarian but sucking the blood of people* - పేరుకు శాకాహారులే కానీ, సాటిమనిషి రక్తం పీల్చే మనుషుల్ని ఎంతోమందిని చూశాను'.

ఇలాంటి శాకాహారుల వల్ల సమాజానికి మేలేమీ జరగదు. మాంసాహారాన్ని తీసుకున్నప్పటికీ ఎంతో ఉదారతతో ప్రవర్తించే మంచి మనుష్యులూ మనకు చాలామంది కనిపిస్తూ ఉంటారు. ఆహారం కొంత మేరకు మన మానసిక స్థితిపై, ప్రవర్తనపై ప్రభావాన్ని చూపుతుందన్నది వాస్తవమే! కానీ శాకాహారమైనా, మాంసాహారమైనా పూర్తిగా మన వ్యక్తిత్వానికి మాత్రం కారణం కావు.

మనస్ఫూర్తిగా శాకాహారం వైపు మరలడం వేరు! మనస్సులో తినాలని ఉన్నా, ఎవరో చెప్పారని, నలుగురి కోసం మాంసాహారం మానుకోవడం వేరు! అందుకే స్వామి వివేకానంద ఓ చోట *'Vegetarianism is a beautiful idea if you choose it, as you need it for your own inner growth. If it is thrust upon people then, it is not very desirable. Secondly, character is not essentially a product of either vegetarianism or non-vegetarianism* - ఆంతరంగిక పరివర్తన కోసం స్వచ్ఛందంగా ఆమోదించి, అనుసరించగలిగితే శాకాహారవాదం మంచి భావనే! కానీ ఆహార అభిరుచిని నిర్బంధం చేయడం మాత్రం సమర్థనీయం కాదు. ముఖ్యంగా శాకాహారా? మాంసాహారా? అన్న విషయాన్ని బట్టి వ్యక్తి శీలాన్ని నిర్ణయించలేమన్నది సత్యం' అంటారు.

అయితే ఈ రోజుల్లో వ్యక్తి బాహ్యంగా నలుగురి ముందు ప్రదర్శించే అలవాట్లను బట్టి అతని వ్యక్తిత్వాన్ని అంచనా వేస్తున్నాం. ఆహారం విషయంలోనూ అంతే! శాకాహారియై ఏదో ఆకుకూరలు, కూరగాయలు మాత్రమే తినే వ్యక్తి సౌమ్యుడని ఒక నిర్ధారణకు వస్తూ ఉంటాం. అలాంటి అంచనాలు అన్ని సమయాల్లోనూ సరికాకపోవచ్చు. చాలా మంది లోకం కోసం బాహ్యాపరమైన మార్పులకు ఇచ్చినంత ప్రాధాన్యం ఆంతరంగిక పరివర్తనకు ఇవ్వరు. అందుకే ఏసుక్రీస్తు బైబిల్‌లో ఓ చోట *'We wash the outside of the cup but inside it is dirty* - మనం కప్పుని బయట శుభ్రం చేస్తాం. కానీ దాని లోపలంతా మలినమే' అంటారు.

ఆహారం దగ్గర నుంచి ఆహార్యం వరకు బయటకు సాత్త్విక లక్షణాలతో కనిపిస్తూ, మానసికంగా మాత్రం రజోగుణాత్మకమైన క్రోధంతో, ద్వేషంతో రగిలిపోయే వారెందరో! అందుకే శాకాహారులుగా కన్నా ముందు మానవతా వాదులుగా, ఆధ్యాత్మిక అన్వేషకులుగా మారేందుకు ప్రయత్నించాలి. అప్పుడు వాటంతట అవే సాత్త్వికగుణాలు పెంపొందుతాయి. స్వామి వివేకానంద మాటల్లో చెప్పాలంటే, "ఆధ్యాత్మిక జీవితంలో ఈ మాంసాహారం నాకిక అవసరం లేదు; శాకాహారం చాలు! అని సహజంగానే అనిపించే స్థితికి చేరుకుంటే అదే నిజమైన శాకాహార వాదం". ❖

సేకరణ: ఆర్.కృష్ణ

**కామ క్రోధాలలో చిక్కుకొన్న వ్యక్తిని మాంసాహారం తినకుండడం, శిరోముండనం చేసుకోవడం, జడలుకట్టిన జుట్టుతో ఉండడం లాంటి బాహ్యావృత్తులేవీ పవిత్రుణ్ణి చేయజాలవు. - భగవాన్ బుద్ధుడు**

(...23వ పేజీ తరువాయి)

పలువురికి తోచేది. ఒకనాడు స్వామి విశ్వేశ్వరానంద అమ్మను, 'అస్తమానం మీరు ఆమెను (రాధూను) ఎందుకు తలుస్తూ ఉంటారు' అని అడిగారు. 'ఏం చేస్తాం నాయనా! మేము ఆడవాళ్ళం, ఇలాగే ఉంటాము' అని అమ్మ బదులిచ్చారు. ఈ వాక్యం ఎంతో చాతుర్యంతో, సహజనటనా కౌశలాన్ని ప్రతిబింబించే రీతిలో ఉంది.

రాధూ, ఆమె తల్లి - ఇద్దరూ శారదామాతను విసిగించిన విధం మనకు తెలుసు. వారు ఎప్పుడూ ఆమెతో వాదిస్తూ, చెడు భాషణాలు చేస్తూ ఉండేవారు. అయితే శారదాదేవి దివ్యజనని కనుకనే వారిని మన్నించగలిగింది. దీన్ని ఎంతమంది అర్థం చేసుకోగలరు? వీరిరువురే కాక, ఇతర బంధువులు కూడా అమ్మను ఎన్నో విధాలుగా ఇబ్బందులు పెట్టినా సహనంతో అన్నింటినీ భరించారు. వీరంతా ఆమెచే సృష్టించబడినవారైనా, వారి దయాదాక్షిణ్యాలపై ఆధారపడి ఉన్నట్లుగా మెలిగారు! ఇది అద్భుతాలలో అద్భుతం కాదా?



ఒకసారి 'అమ్మ' పూజాకార్యక్రమంలో నిమగ్నమై ఉండగా, రాధూ తల్లి దుష్టమైన పదజాలాన్ని ఉపయోగించగా, పూజానంతరం ఆమె మీద జాలిపడి - 'నేను సాధారణ వ్యక్తినని భావించవద్దు. దివ్యాంశతో జన్మించిన దానిని. నీవు అన్నవి ఏవీ నేను పరిగణనలోకి తీసుకోవడం లేదు. కేవలం శబ్దమాత్రంగా భావిస్తున్నాను. ఒకవేళ నేను నిజంగా వాటిని పరిగణనలోకి తీసుకుంటే, నీవు తప్పించుకోగలననే అనుకుంటున్నావా?' అని సూటిగా ప్రశ్నించారు. ఇక్కడ ఈ సందర్భంలో అనుకోకుండా ఆమె తన శక్తిని వెల్లడి చేశారు.

అలాగే ఇంకోసారి, రాధూ తల్లితో 'ఎందరో యోగులు తమ సాధనల ద్వారా కూడా నన్ను పొందలేకపోయారు, నేను నీ ఎదురుగా ఉన్నా, నీవు నన్ను పొందలేకున్నావు' అని అన్నారు. మనమంతా ఎన్నో సాధనలు చేస్తాం. పరిత్యాగాలు చేసి అమ్మ దర్శన భాగ్యానికై పరితపిస్తాం. అయితే అమ్మ చుట్టూ ఉండే సన్నిహితులు, ప్రతీ క్షణం ఆమెతో గడిపే వారంతా ఆ దివ్యత్వాన్ని గుర్తించలేకపోయారు. ఇది ఆశ్చర్యకరమైన విషయం కాదా?

మాతృదేవి తన మేనల్లుడైన 'భూదేవ్' వివాహానికి ఎంతో శ్రమించారు. దీనికే కాక, అన్ని కార్యాలకూ ఆమె తన శక్తినంతా ధారపోశారు. వివాహం జరిగిన రెండు రోజుల అనంతరం, అమ్మ వాచి ఉన్న తన రెండు పాదాలను చూస్తూ, 'వీరు (ఈ బంధువులు) తమ పూర్వజన్మలో ఘోరమైన తపస్సులు చేసి, చివరికి తమ శిరస్సులను కూడా ఆహుతి చేసి ఉంటారు. అందుకే జగన్మాత వారి ఇంట వెలసింది అన్న గిరీశ్ మాటలు వాస్తవమే సుమా!' అని తలచుకున్నారు.

స్వామి వివేకానంద అమెరికా నుండి తిరిగి వచ్చాక, అమ్మను దర్శించడానికి వెళ్ళారు. అప్పుడు అమ్మ, స్వామీజీతో 'నీవు చేసిన పనిని ఇతరులు ఎవ్వరూ చెయ్యలేరు' అని అన్నారు. దానికి స్వామీజీ స్పందిస్తూ 'ఏమిటి అమ్మా! ఇవన్నీ నీవు చేయించినవి కావా? నీవు తలచుకుంటే, నా లాంటి వివేకానందలను వేలమందిని సృష్టించగలవు!' అని పలికారు. అందుకు ఆ తల్లి నవ్వసాగారు. ఆ నవ్వులోనే ఒక మహాతత్త్వం ఇమిడి ఉంది, అందులో, "నీవు అన్నది నిజమే! నీవు నా సృష్టిలోని వాడివే! అనే సత్యావిష్కరణం ఉంది. లక్షల కొద్దీ రామకృష్ణులు, వివేకానందులు, అనంతమాయా స్వరూపిణి అయిన దివ్యజనని శారదామాత నుండి ఉద్భవించగలరు".

శారదామాత రామేశ్వరం వెళ్ళినప్పుడు, శివలింగాన్ని చూడగానే అప్రయత్నంగా ఇలా అన్నారు: 'ఆహా! అచ్చం నేను వదిలివెళ్ళినప్పుడు ఎలా ఉందో అలానే ఉంది!' ఈ మాటలు త్రేతాయుగంలో శ్రీరామునితో కలిసి ఆ శివలింగాన్ని అర్చించిన సీతామాతను స్ఫురణకు తీసుకువస్తాయి. అలాగే బృందావనం వెళ్ళినప్పుడు, 'నేను రాధనే' అని తెలిపారు. రామావతారంలో సీతగా, కృష్ణావతారంలో రాధగా ఉన్న ఆమె ఈసారి రామకృష్ణావతారంలో శారదామాతగా రామకృష్ణులతో వచ్చారు. సీతామాత, రాధాదేవిల నామమహిమ మాత్రమే తెలిసిన మనకు శారదామాత రూపం కూడా తెలియడం ఎంత అదృష్టం!

మనందరికీ శారదాదేవిని దివ్యజననిగా శ్రీరామకృష్ణులు ఏ విధంగా చూసేవారో తెలుసు. మేనల్లుడైన హృదయ్ ఒకసారి ఆమె పట్ల అవిధేయత చూపాడు. శ్రీరామకృష్ణులు దాన్ని తీవ్రంగా ఖండిస్తూ, "కోరి వినాశనాన్ని తెచ్చుకుంటున్నావు. ఆమెకు కోపం వస్తే బ్రహ్మ విష్ణు మహేశ్వరులు కూడా నిన్ను కాపాడలేరు" అని హెచ్చరించారు. సాక్షాత్తూ సరస్వతీదేవి, శారదామాత రూపంలో వచ్చింది అని అందరికీ ఆయన తెలిపేవారు. మహోన్నత వ్యక్తిత్వమున్న వివేకానందుడు కూడా, 'మాతృదేవి బగళాదేవి అంశ అనీ, సరస్వతీదేవి రూపంలో దిగివచ్చారనీ' తెలిపారు.

మానవత్వం, దివ్యత్వం కలగలిసిన మాతృదేవి అద్భుత జీవితం ఓ మహిమోపేతమైన లీలగా అజరామరమై నిలిచి ఉంటుంది. ❖ **అనువాదం: డాక్టర్ అపర్ణా శ్రీనివాస్**





(1884 – 1967)

# ముందుకు సాగిపో!

**దివ్యజనని శ్రీశారదాదేవి ప్రత్యక్ష శిష్యులైన స్వామి ప్రేమేశానంద (1884-1967) రామకృష్ణ సంఘంలో అత్యున్నత గౌరవాన్నీ ప్రేమాభిమానాలనూ చూరగొన్న అగ్రశ్రేణి సన్యాసి. ఆయన జీవితం శ్రీరామకృష్ణ - వివేకానందుల ఆశయాలతోనూ, భగవద్గీత సారాంశంతోనూ నిండింది. చాలామంది యువతీ యువకులకూ, గృహస్థులకూ, బ్రహ్మచారులకూ, సన్యాసులకూ ఆయన ఎన్నో లేఖలు వ్రాశారు. జీవితంలో అంకితభావం, ఆధ్యాత్మిక, సేవా భావాలను అలవరచుకొనేందుకు ఆ లేఖా పరంపరలు మార్గదర్శకాలయ్యాయి. పాఠకుల ప్రయోజనార్థం విలువైన ఈ లేఖలను 'శ్రీరామకృష్ణ ప్రభ'లో 2009 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా ప్రచురిస్తున్నాం.**

సార్‌గాచీ,
5-12-60

**ప్రియమైన తల్లీ సుశ్రీ!***

నేను యమధర్మరాజుతో యుద్ధం చేయడంలో మునిగి ఉన్నందున నీకు వెంటనే జాబు వ్రాయలేకపోయాను.

లక్ష్మి నీ స్నేహితురాలే కదా! ఆమెను చూసి గేలిచేయడం గానీ, ఆమె భావాలను అగౌరవపరచడం గానీ నీకు తగిన పని కాదు.

వేల సంవత్సరాలుగా మనం సుఖదుఃఖాల మధ్య ఊగిసలాడుతున్నాం. సుఖం నుండి దుఃఖానికీ, కలయిక నుండి వేర్పాటుకూ, ఉష్ణం నుండి శీతలానికీ, గౌరవం నుండి అగౌరవానికీ - ఇంకా ఇలాంటివి ఎన్నిటి మధ్యనో ఊగిసలాడుతూనే ఉన్నాం. ఈ రెండు పార్శ్వాల మధ్య ముందుకూ, వెనక్కూ ఊగకపోతే మన మనస్సును అత్యంత విషాదం ఆవరిస్తుంది. అందుచేతనే కొంతకాలం నవ్వులు పూయించాక మనమందరమూ క్షమాపణలకు గురై, రోదిస్తున్నాం.

ఈ జీవిత సత్యాన్ని అర్థం చేసుకున్నారు కాబట్టే మీరంతా ఆ ఊగిసలాట నుండి బయటపడ్డారు. కనుక మళ్ళీ నువ్వు కొన్ని సమయాల్లో ఆ ఊగిసలాట జోలికి పోవడమెందుకు తల్లీ? అది ఎలాగంటే మనస్సులో కొన్ని సంశయాలు బయలుదేరతాయి. బహుశః ఈ ఊగిసలాట వ్యవహారం వ్యక్తి అంతః చేతనలో దాగివుండవచ్చు.

చూడు తల్లీ సుశ్రీ! స్వామి వివేకానంద సలహాను నూటికి నూరుపాళ్ళూ పాటించకపోతే వ్యక్తి తాను చేసిన కఠిన సాధనల ఫలితమంతా ఏ రంధ్రాల గుండా బయటకు నిష్క్రమిస్తుందో అర్థం చేసుకోలేడు.

అందుచేతనే '**క్షురస్య ధారా నిశితా దురత్యయా దుర్గం పథస్తత్కవయో వదన్తి** - భగవన్మార్గంలో పయనించడం పదునైన కత్తి అంచు మీద నడవడం లాంటిదని ప్రాజ్ఞులు అంటారు' అని కఠోపనిషత్తు (1.3.14) హెచ్చరిస్తుంది. అనేకమంది యోధులు కూలిపోవడం కళ్ళారా చూశాక కూడా ఎల్లకాలం భయంతో మనమలాగే ఉండిపోతుంటాం.

మీరంతా తెలివైనవారు. మీరు జ్ఞానదీపాన్ని వెలిగించి ప్రపంచం మొత్తానికీ వెలుగులు పంచాలి తల్లీ! ఒకసారి జ్ఞానోపలబ్ధి కలిగాక, భక్తి, యోగం, కర్మ అన్నవి బానిసల లాగా అనుసరిస్తాయి!

నీ బుద్ధిబలం మీద ఆధారపడకుండా భగవంతుని చరణాలపై భక్తి విశ్వాసాలను ఉంచి నీ కర్తవ్యాన్ని నిర్వహించు. శ్రీరామకృష్ణులను శరణువేడినవారు ఎలాంటి భయాందోళనలు చెందనవసరం లేదు. ఆయన మనల్ని ఎక్కడ ఉంచితే అక్కడ ఉండగలగాలి. మనతో ఏ పని చేయిస్తే ఆ పనిని చేయగలగాలి. నువ్వు ఎలాంటి భయానికి లోనుకావద్దు. శ్రీరామకృష్ణులను శరణువేడు తల్లీ!

(*సుశ్రీ కాలాంతరంలో ప్రవ్రాజిక నిర్భయప్రాణా మాతాజీగా సుప్రసిద్ధులు)

తెలుగు సేత: కె. త్రివిక్రమరావు

ప్రేమాశీస్సులతో
స్వామి ప్రేమేశానంద



జీవితంలో నిరాశ చెందిన పిదపే లౌకికులు భగవంతుణ్ణి వెదకనారంభిస్తారు. కానీ నిర్మలమైన పుష్పం లాగ చిన్నతనం నుండే తన హృదయాన్ని భగవత్ పాదపద్మాలకు సమర్పించే వ్యక్తి ధన్యుడు. - శ్రీశారదాదేవి

(...15వ పేజీ తరువాయి)

సరిదిద్ది, కర్మఫలాల పరిత్యాగమూ తపస్సేనని నిరూపించిన కర్మయోగిగా దత్తాత్రేయుడిని ఈ సంకీర్తనాచార్యుడు కీర్తిస్తూ....

**అపరిమితములైన యజ్ఞాలు వడిజేయ**
**ప్రపన్నులకు బుద్ధి పచరించి**
**తపముగా ఫలపరిత్యాగము సేయించు**

**కపురుల గరిమల కర్మయోగి**...అంటున్నాడు. పచరించి అంటే 'ప్రసరించి' అని, కపురుల అంటే 'శోభల', గరిమల అంటే 'ఘనత కలిగిన' అని అర్థం. అవగాహన లేకుండా, మిడిమిడి జ్ఞానంతో సంప్రదాయాలపై, ఆచారాలపై విముఖత వ్యక్తం చేయడం మన అజ్ఞానానికి నిదర్శనమే! ముఖ్యంగా కర్మాధ్యక్షుడు ఆ భగవంతుడే అన్న సత్యాన్ని మరచిపోయి, మనమే కర్తలమనుకోవడం కూడా అజ్ఞానమే! ఇదే సూచనతో భగవద్గీతలో సవ్యసాచితో శ్రీకృష్ణభగవానుడు...



**యజ్ఞార్థాత్ కర్మణోఽ న్యత్ర లోకోఽ యం కర్మబంధనః ।**
**తదర్థం కర్మ కౌంతేయ ముక్తసంగః సమాచర ॥** *(గీత.3-9)*

'ఈశ్వరప్రీత్యర్థం చేసే కర్మ కాకుండా, కర్తృత్వభావనతో చేసే కర్మలు బంధకారకాలు. అనాసక్తితో కర్మలను చేయి' అని అంటాడు. ఇలా లోకవ్యవహారాల్లో ఉంటూనే, లంపటంలో పడ కుండా తామరాకుపై నీటిబొట్టులా మనగలగడమే కర్మయోగం.

బ్రహ్మయోగి...

అవధూత స్థితికి సంపూర్ణ నిర్వచనంగా నిలిచిన పరమపురుషులు దత్తాత్రేయులు. సర్వప్రకృతి వికారాలకు సుదూరంగా దేహం,ఇంద్రియ సంబంధ విషయాలతో మమేకం కాకుండా మనస్సును ఆత్మలోనే లీనం చేసిన నిష్ప్రపంచులే అవధూతలు. సశరీరంగా అలాంటి మహోన్నత స్థితితో దత్తాత్రేయులు గురూపదేశాలను బోధించారు. పంచభూతాల నుంచీ, పశుపక్ష్యాదుల నుంచీ పాఠాలు నేర్చుకోవచ్చని దత్తాత్రేయ అవతారంలో దేవదేవుడు నిరూపించారు. ఆ ఆచార్యదేవుడిని స్మరించుకుంటూ...

**అన్ని చేతలును బ్రహ్మార్పణ విధిజేయ**
**మన్నించి బుద్ధులను మరుగ జెప్పి**
**ఉన్నత పదమున కొనరంగ కరుణించు**
**పన్నగ శయనుడె బ్రహ్మయోగి...**

'ఈ కలియుగంలో అన్ని క్రియలనూ పరబ్రహ్మకే అర్పించి, ఉన్నతపదానికి చేరుకొమ్మనీ; పన్నగశయనుడైన పరంధాముడినే దత్తాత్రేయుల రూపం దాల్చిన బ్రహ్మయోగి' అనీ అన్నమయ్య ప్రబోధిస్తున్నాడు. కురుక్షేత్ర సంగ్రామానికి ఆరంభంలో అర్జునుడికి ఆ భగవానుడు కూడా బ్రహ్మార్పణ విశిష్టతను వివరిస్తూ...

**బ్రహ్మార్పణం బ్రహ్మహవిః బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్ ।**
**బ్రహ్మైవ తేన గంతవ్యం బ్రహ్మకర్మ సమాధినా ॥** *(గీత. 4-24)*

'యజ్ఞం చేసే వ్యక్తి, హోమానికి అర్పించే ద్రవ్యాలు, వాటిని దగ్ధం చేసే అగ్ని, పరబ్రహ్మ స్వరూపాలే! ఆ యజ్ఞఫలితం కూడా పరబ్రహ్మ స్వరూపమే' అని ఉద్ఘాటించాడు.

ఇలా సర్వకర్మలనూ యజ్ఞదృష్టితో చేయడమే బ్రహ్మకర్మ సమాధి నిష్ఠ. ఇలాంటి నిష్ఠ కలిగిన వ్యక్తి పరబ్రహ్మస్థితినే పొందుతాడు. యుగయుగాల్లోనూ భగవంతుడు జీవుల కర్మఫలాల భారాల్ని మోసేందుకు సంసిద్ధంగా ఉన్నాడు. అయితే మనమే అహంభావంతో అలవి కాని కర్మల భారాల్ని మోపుల్లా మోసుకుంటూ జన్మల పరంపరను పెంచుకుంటున్నాం.

అభ్యాసయోగి...

దత్తాత్రేయుడు యోగ సంప్రదాయకులని నారద పరివ్రాజక ఉపనిషత్తు చెబుతోంది. భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస కూడా దత్తాత్రేయ అవతార ప్రాధాన్యాన్ని ప్రస్తావిస్తూ "బ్రహ్మజ్ఞానం పొంది, సమాధి స్థితి ఏర్పడితే ఆ తరువాత 'నేను' అనే అహంకారం ఉండదు. అందుకే దత్తాత్రేయుడూ, జడభరతుడూ, తాము పొందిన బ్రహ్మదర్శనం గురించి ఏమీ వివరించలేకపోయారు. దత్తాత్రేయుడు మూగజీవాలను కూడా తన గురువులుగా చేసుకొని ఆధ్యాత్మిక జ్ఞానాన్ని బోధించాడు" అని గుర్తుచేసుకున్నారు. నిజమే! మనస్సు సిద్ధంగా ఉండాలే కానీ, మనకు ప్రకృతిలోని ప్రతి జీవీ పాఠాన్ని నేర్పుతుందనడానికి కొంగ నుంచి కొండచిలువ వరకు, తుమ్మెద నుంచి తేనెటీగ వరకు ఇలా ప్రతి ఒక్కదాన్నీ గురువుగా భావించిన దత్తాత్రేయులే నిదర్శనం.

**తనరగ కపిలుడై దత్తాత్రేయుడై**
**ఘనమైన మహిమ శ్రీవేంకటరాయడై**
**ఒనరగ సంసార యోగము కృపసేయ**
**అనిమిష గతులను అభ్యాసయోగి...**

భాగవత పరంగా భగవానుడు కపిల మహర్షిగా, తదనంతరం దత్తాత్రేయుడుగా లోకాన్ని ఉద్ధరించి, శ్రీవేంకట రాయుడై తిరుమలపై కొలువు తీరాడని కొండలరాయుడి ప్రియభక్తుడు పరవశించిపోతున్నాడు. సంసారాన్ని కూడా యోగంగా మలచేందుకు ఆదర్శయోగిగా, అభ్యాసయోగిగా మనకు దత్తాత్రేయులు ఎన్నో మెలకువలు నేర్పి తరించే మార్గాల్ని చూపారని అంజలి ఘటిస్తున్నాడు. ❖

**డిసెంబరు 6వ తేదీన 'శ్రీదత్తజయంతి'**






- స్వామి పార్థసఖానంద




## నేను - నా మార్గం

నేను
కాకతాళీయంగా కాక కోరుకున్న విధంగా జీవించాలని అనుకుంటాను.
సాకులు చెప్పాలని కాక మార్పులు చేయాలని అనుకుంటాను.
వంచింపబడాలని కాక స్ఫూర్తిని పొందాలని అనుకుంటాను.
వాడుకోబడాలని కాక ఉపయోగపడాలని అనుకుంటాను.
గెలవాలని కాక ఎదగాలని అనుకుంటాను.
ఓదార్పును కాక ఆత్మగౌరవాన్ని పొందాలని అనుకుంటాను.
తోచినట్లు చెప్పే ఇతరుల అభిప్రాయాలను కాక
నా అంతరాత్మ ప్రబోధాన్ని వినాలని అనుకుంటాను.




## విత్తనంలోని పండ్లు

నిజాయతీ అనే విత్తనాన్ని నాటితే,
దానికి ఫలంగా ఇతరుల విశ్వాసాన్ని పొందవచ్చు.
నిష్కపటం అనే విత్తనాన్ని నాటితే,
దానికి ఫలంగా ఆత్మీయతను పొందవచ్చు.
వినయం అనే విత్తనాన్ని నాటితే,
దానికి ఫలంగా అభిమానాన్ని పొందవచ్చు.
పట్టుదల అనే విత్తనాన్ని నాటితే,
దానికి ఫలంగా విజయాన్ని పొందవచ్చు.
దయ అనే విత్తనాన్ని నాటితే,
దానికి ఫలంగా ఇతరులతో సమన్వయాన్ని పొందవచ్చు.
శ్రమ అనే విత్తనాన్ని నాటితే,
దానికి ఫలంగా అభివృద్ధిని పొందవచ్చు.




## కష్టాలు, కడగండ్లు

1. కష్టం అనేది ఓ గులకరాయి లాంటిది. దాన్ని కంటికి మరీ దగ్గరగా ఉంచుకుంటే మిగతా వాటిని కనపడనీయ కుండా చేస్తుంది. కానీ దాన్ని కంటికి సరైన దూరంలో ఉంచుకుని చూస్తే, మనం దాన్ని బాగా గమనించగలం. ఇక దాన్ని మన కాళ్ళ దగ్గర పడేస్తే, అది మన జీవన గమనంలో ఎదురైన మరో చిన్న అవరోధం మాత్రమే అని తెలుసుకోగలం.
2. మన జీవితంలోకి సమస్యలు రావడానికి కారణం ఏమిటో తెలుసుకోవాలంటే, వాటి ప్రభావం నుండి బయట పడ్డప్పుడు మాత్రమే అది సాధ్యమవుతుంది.
3. కష్టంలోనూ చిరునవ్వు చెరిగిపోనీయని వారు, బాధ నుండి బలాన్ని కూడగట్టుకునే వారు, పరిణతి పొంది ధైర్యాన్ని పెంచుకునే వారే మహాత్ములు.

## భగవద్గీత - సద్గుణ సుధ

# ఈ గూటిలోని చిలుక ఎగిరేదెచటికో!

- స్వామి పరిజ్ఞేయానంద

అర్జునుడు యుద్ధభూమిలో తన కర్తవ్యాన్ని మరచి ఎంతో కరుణాస్వరూపుడిలా, విరాగిలా, జ్ఞానవంతునిలా ప్రవర్తించాడు. అర్జునుడి బాల్యచేష్టల్ని ఎంతో సహనంతో భరించి, అతడి తప్పుల్ని గుర్తుచేశాడు శ్రీకృష్ణుడు. అప్పుడు అర్జునుడు తన తప్పులను తెలుసుకొని, తనకు సరైన మార్గాన్ని చూపించమంటూ శ్రీకృష్ణుణ్ణి వేడుకున్నాడు.

అయితే, అర్జునుడు 'భగవాన్! నేను మీ ఆజ్ఞను శిరసా వహించడానికి సిద్ధంగా ఉన్నాను' అని చెప్పినప్పుడు, భగవానుడు వెంటనే అతడిని అస్త్రశస్త్రాలను ధరించి యుద్ధానికి సిద్ధం కమ్మని చెప్పలేదు. ఎందుకంటే అర్జునుడిలో మళ్ళీ భయం, ఆందోళన, నిరాశ, చపలత్వం, మోహం లాంటి బలహీనతలు పొడసూప కూడదని భావించాడు. అందువల్ల శ్రీకృష్ణుడు కర్తవ్య నిర్వహణకు ముందు అర్జునుడికి ప్రేరణదాయకమైన బోధనలు చేశాడు.

నేటికాలంలో ఐ.ఏ.ఎస్., ఐ.పి.ఎస్; బహుళ జాతీయ సంస్థల్లో ఎంపికైన అభ్యర్థులకు, పదవీ బాధ్యతల్ని చేపట్టే ముందు శిక్షణ శిబిరాలను నిర్వహిస్తున్నారు. కానీ శ్రీకృష్ణుడు, అర్జునుడికి ఆనాడే బాధ్యతల్ని సమర్థంగా నిర్వహించడానికి శిక్షణ తరగతులను నిర్వహించాడు.

ఇంతకీ అర్జునుడి సమస్య ఏమిటి? భయం, నిరాశ, అలజడి, ఒత్తిడి, మోహం... ఇవన్నీ కేవలం అర్జునుడి సమస్యలే కావు. మనందరి సమస్యలు కూడా! ఈ సమస్యలకు కారణం - 'నేను, నాది' అనే భావం.

మన జీవితాల్లో కూడా ప్రతి నిత్యం జరిగే సంఘటనల పట్ల మనం ప్రతిస్పందించే తీరును ఒక్కసారి ఆలోచిస్తే మన పరిస్థితి ఏమిటో అర్థమవుతుంది. పక్కింట్లో ఎవరైనా చనిపోయినా, 'అయ్యో పాపం' అనేసి, మనం హాయిగా భోజనం చేసి నిద్రపోతాం. అదే మన ఇంట్లో ఎవరైనా చనిపోతే నిద్రాహారాలు మాని విలపిస్తాం. అలాగే పక్కింట్లో లక్షల ఖరీదు చేసే నగలు పోతే స్థితప్రజ్ఞునిలా నిశ్శబ్దంగా ఉంటాం. అదే మన ఇంట్లో ఒక గుండుసూది పోతే పక్కింటి వారిని నిద్ర పోనివ్వం. మన ఈ పక్షపాత వైఖరికి కారణం మమకారమనే సంకెళ్ళలో బందీ కావడమే!

"నా సోదరులు, నా బంధువులు, నా గురువులు... ఇలా 'నా వారు' అనుకున్న వారంతా యుద్ధంలో చనిపోతారు" అనే భయం అర్జునుణ్ణి ఆవరించింది. అర్జునుడిది నిజమైన ప్రేమ, దయ, కరుణ అయినట్లయితే యుద్ధంలో పాల్గొన్న మిగతా సైనికుల కోసం కూడా విలపించి ఉండేవాడు. కానీ అలా జరగలేదు. అర్జునుడి దుఃఖానికి కారణం- 'నావాళ్ళనే మమకారమే!'

ఈ మమకారపు సంకెళ్ళ నుండి విడిపించడానికే శ్రీకృష్ణుడు దేహ పరిణామక్రమాన్నీ, అశాశ్వతత్వాన్నీ, పరమార్థతత్త్వ జ్ఞానాన్నీ బోధిస్తూ...

**దేహినోఽ స్మిన్ యథా దేహే కౌమారం యౌవనం జరా ।**
**తథా దేహాన్తరప్రాప్తిః ధీర స్తత్ర న ముహ్యతి ॥** *(గీత. 2-13)*

'మానవుడికి ఈ దేహంలో బాల్యం, యౌవనం, ముసలితనం ఎలా కలుగుతున్నాయో, మరణం తరువాత మరొక దేహాన్ని పొందడం కూడా అలాంటిదే! ఈ విషయంలో జ్ఞానులు (ధీరులు) మోహవశులు కారు' అని వివరించాడు.

బాల్యం, యౌవనం, వార్ధక్యం - ఈ మార్పులన్నీ మనకు తెలుస్తున్నాయి కాబట్టి దుఃఖం లేదు. కానీ మరణం తరువాత ఏం జరుగుతుందో తెలియదు కాబట్టి మరణమంటే మనకు భయం కలుగుతుంది. అందుకే 'చిరిగిన వస్త్రం వదలి, కొత్త వస్త్రాన్ని ధరించినట్లు- మరణం తరువాత ఆత్మ మరో దేహాన్ని ధరిస్తుందని గ్రహించినవారే ధీరులు' అని ఉద్ఘాటించి, అర్జునుడి మోహపాశాన్ని త్రుంచి వేశాడు శ్రీకృష్ణుడు.

మన దృష్టిలో ధీరులంటే అశోకుడు, అలెగ్జాండర్ లాంటివారు. కానీ శ్రీకృష్ణుని దృష్టిలో నిజమైన ధీరులు - సోక్రటీస్, రమణమహర్షి లాంటి జ్ఞానులు. సోక్రటీస్ మరణ సమయంలో అతడి శిష్యులు 'మీరు చనిపోయిన తరువాత మీకు అంతిమ సంస్కారాలు ఎలా చేయాలి?' అని ప్రశ్నించారు. అప్పుడు సోక్రటీస్ 'అసలైన నేను (ఆత్మ) మీకు దొరకను. మీరనుకున్న ఈ నేను (దేహం)కు అంతిమ సంస్కారాలు అందరికీ చేసినట్లే చేయండి' అని నవ్వుతూ బదులిచ్చారు.

అలాగే ఒకసారి రమణమహర్షి దగ్గరకి ఒక భక్తుడు వచ్చి 'స్వామీ! నేను కొత్తగా కొన్న కారులో మీరు ఒక్కసారి వచ్చి కూర్చొని పావనం చేయండి' అని వేడుకున్నాడు. అందుకు రమణమహర్షి 'నేను ఇప్పటికే ఒక వాహనంలో (శరీరంలో) కూర్చొని ఉన్నాను' అని చమత్కరించారు.

ఆత్మజ్ఞానం పొందిన మహాత్ములు అతి కొద్దిమందే ఉంటారు. ఆ స్థితిని పొందడం అందరికీ అంత సులభం కాకపోవచ్చు. కానీ ఈ దేహం శాశ్వతం కాదని గుర్తెరిగి వ్యవహరిస్తే మన సమస్యలన్నీ పరిష్కారమవుతాయి. నిజానికి మనలోని అసూయా ద్వేషాలకూ, అహంకార మమకారాలకూ, లోభ మోహాలకూ, కోపావేశాలకూ, పంతాలు పట్టింపులకూ, భయాందోళనలకూ ముఖ్య కారణం ఈ భూమ్మీద మన జీవితం మూన్నాళ్ళ ముచ్చటేనని మరచిపోవడమే!

'ఈ దేహం వేరు, ఆత్మ వేరు' అన్న అనుభూతి మనకు కలగకపోయినా 'ఈ దేహం ఎప్పుడు రాలిపోతుందో, ఈ గూటిలోని చిలుక ఎక్కడికి ఎగిరిపోతుందో' అన్న భావన మన మదిలో మెదిలితే మమకారం పటాపంచలవుతుంది. అప్పుడు ఈ ప్రపంచమనే నాటక రంగంలో మన పాత్రలను సమర్థంగా నిర్వహించి, సంతోషంగా నిష్క్రమించే ధీరులుగా రూపొందగలుగుతాం. ❖

## అది తెలిస్తే... ఇది వదిలేస్తాం!

మతం, భగవంతుడు వీటి గురించి నీకు అర్థం కావాలంటే నీవు నీ మేధాశక్తితో, గ్రంథపఠనంతో, దేవీదేవతల విగ్రహాలతో ఎంత కుస్తీపట్టినా ప్రయోజనం శూన్యం. దానికి గొప్ప ఆర్తి, పరితాపం కావాలి.

ఒక మహానుభావుడైన జ్ఞాని ఇలా చెప్పేవారు.

"ఒక గదిలో దొంగ ఉన్నాడు. అతనికి ఎలాగో అలా ప్రక్క గదిలోనే బంగారు రాశులున్నాయని తెలిసింది. ఈ రెండు గదులకూ మధ్యన ఓ గోడ మాత్రమే అడ్డంగా ఉంది. ఆ దొంగ పరిస్థితి ఏమిటి? అతని మనఃస్థితి ఎలా ఉంటుంది? అతడు నిద్రపోలేడు, ఏమీ తినలేడు, త్రాగలేడు. అతని మనస్సంతా ఆ బంగారాన్ని ఎలా దోచుకోవాలన్న ఆలోచనతోనే నిండివుంటుంది.

ఆనందపు ఖని, అనుగ్రహపు రాశి, భగవత్ వైభవం - అన్నీ ఇక్కడే ఈ భూమిపైనే ఉన్నాయని నిజంగా నమ్మిన జనులు ఆ భగవత్ ప్రాప్తికై ప్రయత్నించకుండా ఉండగలరా చెప్పండి?"

భగవంతుడున్నాడని నమ్మిన తక్షణం వ్యక్తి ఆయనను పొందాలనే కోరికతో పిచ్చివాడై పోతాడు. ఒక వ్యక్తి తాను ప్రస్తుతం గడుపుతున్న జీవితం కన్నా మహత్తరమైన జీవితం మరొకటి ఉందని తెలుసుకున్ననాడు, ఈ ఇంద్రియాలే సర్వస్వం కాదని గ్రహించిననాడు, ఈ క్షణికమైన భౌతిక శరీరం మరణం లేని శాశ్వతమైన ఆత్మానందం కన్నా అధికం కాదని తెలిసిననాడు - ఆ శాశ్వత ఆనందాన్ని తనంతట తానుగా పొందేందుకు పిచ్చివాడైపోతాడు. ఆ విధమైన పిచ్చి, దాహం, నిరంతర కృషినే 'మేలుకొలుపు' అంటుంది మతం. ఆ స్థితి మనిషికి కలిగిననాడు అతడు మతం గురించి ప్రాథమిక జ్ఞానం పొందినవాడవుతాడు. ఉప్పు బొమ్మ ఒకటి సముద్రపు లోతు కొలవడానికి సముద్రంలోకి వెళ్ళి అందులో కరిగిపోయినట్లన్నమాట! ❖

## జీవన వేదం

స్వామీజీ కథల సారం

## నువ్వే అతడు.. అతడే నువ్వు!

రెండు రకాల ధైర్య సాహసాలు ఉన్నాయి. ఒకటి తుపాకీకి రొమ్మిచ్చి నిలవడం, రెండవది ఆధ్యాత్మిక దృఢ నిశ్చయం. భారతదేశంపై దండెత్తిన ఒక చక్రవర్తికి అతని గురువు అచ్చటి కొందరు యోగులను దర్శించమంటూ సలహా ఇచ్చాడు. చక్రవర్తి చాలా చోట్ల యోగుల కోసం వెతికాడు. చివరకు ఒక చోట బండరాతిపై కూర్చొని ఉన్న ఒక వృద్ధుణ్ణి చూశాడు. ఆ చక్రవర్తి అతనితో కొంతసేపు మాట్లాడి, అతని తెలివితేటలకు చాలా ప్రభావితుడయ్యాడు. ఆ యోగిని తనతో పాటు తన దేశానికి రమ్మని కోరాడు.

"లేదు. నేను ఇక్కడ ఈ అరణ్యవాసంతో చాలా సంతోషంగా ఉన్నాను" అన్నాడా యోగి. "నేను ప్రపంచాధినేతను. నేను నీకు అపారమైన సంపదను, పదవిని ఇస్తాను" అని చెప్పాడు చక్రవర్తి.

"వద్దు. అవన్నీ నాకు అవసరం లేదు" అని బదులిచ్చాడు యోగి. "నీవు నాతో రాకపోతే నిన్ను చంపివేస్తాను" అని హెచ్చరించాడు చక్రవర్తి. ఆ యోగి ప్రశాంతంగా చిరునవ్వు నవ్వి "నువ్వు ఎంత మూర్ఖుడివి? నీవు నన్ను చంపలేవు. నన్ను సూర్యుడు ఎండించలేడు, అగ్ని కాల్చలేదు, శస్త్రం చంపజాలదు. నాకు చావు పుట్టుకలు లేవు. నేను సర్వశక్తిమంతమైన, సర్వవ్యాపినైన ఆత్మను" అని ఆ చక్రవర్తికి సమాధానమిచ్చాడు. ఇదే ఆధ్యాత్మిక దృఢత్వమంటే! మిగిలినవన్నీ సింహం, పెద్దపులి వంటి వాటి కుండే దృఢత్వం.

మరొక సంఘటన చెబుతాను- 1857వ సంవత్సరంలో సిపాయిల తిరుగుబాటు జరుగుతున్న సమయంలో ఒక స్వామీజీ ఉండేవారు. ఆయనను ఒక మహమ్మదీయ తిరుగుబాటుదారుడు క్రూరంగా పొడిచివేశాడు. హిందూ తిరుగుబాటుదారులు కొందరు ఆ మహమ్మదీయుణ్ణి పట్టుకొని ఆ స్వామీజీ ముందుకు తీసుకొనివచ్చి, అతణ్ణి చంపి వేయమని కోరారు. కానీ ఆ స్వామీజీ ప్రశాంతంగా చూస్తూ, "సోదరా! నువ్వే అతడు... అతడే నువ్వు..!" అంటూ మరణించాడు. ❖

తెలుగు సేత: కె. త్రివిక్రమరావు



# ఫలించిన అమ్మ ప్రార్థన

చిత్రాలు: వేంకట్ చిత్రకథ: స్వామి విమూర్తానంద అనుసృజన: స్వామి జ్ఞానదానంద

1 శ్రీరామకృష్ణ పరమహంస మహాసమాధి చెందిన తరువాత శ్రీశారదామాత కొంతకాలం కామార్పుకూర్‌లో నివసించారు. కటిక పేదరికం, బంధు నిరాదరణ లాంటి కష్టాలను వేటినీ పట్టించుకోక ఆమె భగవద్ధ్యాసలోనే కాలం గడుపుతూ వచ్చారు.



2 ఆ సమయంలో ఒరిస్సాకు చెందిన ఒక సన్న్యాసి కామార్పుకూర్‌కు వచ్చాడు. జపధ్యానాలలో సమయాన్నంతా గడుపుతున్న ఆయనకు కుసంస్కారులైన తుంటరులు కొందరు చెప్పలేనంత ఇబ్బంది కలిగించ సాగారు. అప్పుడు ఊరి పెద్దమనుషులు కొందరు ఇలా అన్నారు:




3 సన్న్యాసి ఊరు వదలిపెట్టి పోతున్నాడని తెలిసి మాతృదేవి ఊళ్ళోని కొందరితో మాట్లాడారు.







4 ఇతరుల సహాయంతో మాతృదేవి ఆ కుటీరాన్ని తిరిగి కట్టనారంభించారు.

5 అప్పుడు హఠాత్తుగా ఆకాశం మేఘావృతమైంది. భారీ వర్షం వచ్చేట్లు అనిపించింది.




6 తక్షణమే మాతృదేవి భగవంతుణ్ణి ప్రార్థించారు.




ఏమాశ్చర్యం! వర్షం ఆగిపోయింది. ఆకాశం నిర్మలమైంది. జనులు మాతృదేవి ప్రార్థనాశక్తిని చూసి మహదానందం చెందారు.

7 అమ్మా! మీ ప్రార్థన మేరకు వాన ఆగిపోయింది. ఇదిగో! సాధువుగారి కుటీర నిర్మాణం ఇప్పుడే పూర్తిచేస్తాం.



కుటీర నిర్మాణం పూర్తయి, సాధువు అందులో ప్రవేశించే దాకా వర్షం కురవలేదు.

8 కాలాంతరంలో ఒకసారి జయరామ్‌బాటిలో మాతృదేవి ఉన్నప్పుడు ఆ చుట్టుపక్కల ప్రాంతాల్లో క్షామం తలెత్తింది. వర్షాలు లేవు. వ్యవసాయం మూలపడింది. జనులు ఆకలితో అలమటించడం చూసి మాతృదేవి తల్లడిల్లిపోయారు.



9 ఒకరోజు గ్రామస్థులు కొందరు...

అమ్మా! ఈ ఏడాది వర్షాలు పడకపోతే, మా చావులు తథ్యం.













## ఉత్తమ సంస్కారం

మహారాష్ట్రకే మకుటాయమానుడు ఛత్రపతి శివాజీ. ఆయన సేనాపతి ఒకరు కల్యాణ దుర్గాన్ని జయించాడు. ఎన్నో అస్త్రశస్త్రాలతో పాటు, అపారమైన ధనం కూడా అతడి వశమైంది. ఒక సైనికుడు కల్యాణ దుర్గాన్ని పాలించే రాజు యొక్క కోడలిని తీసుకువచ్చి సేనాపతి ఎదుట ఉంచాడు. ఆమె అత్యంత సౌందర్యవతి. సేనాపతి ఆమె సౌందర్యానికి ముగ్ధుడైపోయాడు. ఆమెను శివాజీ మహారాజుకు ఇవ్వాలని నిర్ణయించుకొని, ఆమెను ఒక పల్లకీలో కూర్చోబెట్టి శివాజీ వద్దకు తీసుకొని వెళ్ళాడు.



శివాజీ ఆ సమయంలో తన సేనాపతులతో పాలనా వ్యవస్థకు సంబంధించిన సంభాషణలు జరుపుతున్నాడు. ఆ సేనాపతి చక్రవర్తికి నమస్కరించి 'మహారాజా! కల్యాణ దుర్గం నుండి మీకొక అపురూపమైన కానుక తెచ్చాను' అన్నాడు పల్లకీవైపు చూపుతూ.

శివాజీ వెంటనే లేచి పల్లకీ పరదాను తొలగించి చూశాడు. అందులో ఓ నవయవ్వన సౌందర్యవతి కూర్చొని ఉన్నది. వెంటనే శివాజీ సిగ్గుతో తలదించుకున్నాడు. శివాజీ పరాయి స్త్రీలను సైతం సొంత తల్లిలా గౌరవించేవాడు. ఆయన బాధతో సేనాపతివైపు చూస్తూ "అయ్యో! మన అమ్మలు కూడా ఇంత అందంగా ఉండి వుంటే మనం కూడా ఎంత అందంగా ఉండేవారమో!" అన్నాడు. "నువ్వు నాతో ఉండి కూడా నా స్వభావాన్ని తెలుసుకోలేకపోయావు కదా!" అని సేనాపతిని కోపగించుకున్నాడు. "వెళ్ళు, వెళ్ళి ఈమెను సగౌరవంగా వాళ్ళ ఇంట్లో దింపిరా" అని సేనాపతిని ఆజ్ఞాపించాడు. ఇది శివాజీ మహరాజ్ మహోన్నత సంస్కారం. ❖

## మనల్ని రక్షించేది..!

ఒకసారి కొంత మంది సైనికులు మహమ్మద్ గారిని వెంబడించారు. అప్పుడు ఆయన వెంట ఒక్క వ్యక్తి మాత్రమే ఉన్నాడు. "మహానుభావా! వాళ్ళు దగ్గరికి వచ్చేస్తున్నారు. మనం దగ్గరలో ఉన్న గోతిలో దాక్కుందాం" అన్నాడు. వాళ్ళు అక్కడికి చేరుకుని చూడగా అందులో ఒక సాలెపురుగు గూడు ఉంది. ఆ వ్యక్తి ఆ గూడుని తీసి పారేయాలనుకున్నప్పుడు మహమ్మద్ అతడిని ఆపారు. "మిత్రమా! ఖుదా కోసమైనా ఈ సాలెగూడును పాడు చెయ్యవద్దు. పాపం, ఆ సాలీడు ఎంత శ్రమ పడి ఈ గూడు కట్టుకున్నదో కదా! దానిని పడగొట్టొద్దు" అన్నారు.

కానీ మిత్రుడికి ఈ మాట రుచించలేదు. "సమయం చాలా తక్కువగా ఉంది. మన ప్రాణాల కోసం దీనిని పడగొట్టడంలో తప్పు లేదు. ఇది దయ తలిచేందుకు తగిన సమయం కాదు" అన్నాడు.

"నువ్వు చెప్పింది నిజమే. కానీ మన ప్రాణాలను రక్షించుకునేందుకు ఇతరులను శిక్షించడం సరైన పని కాదు. ఇటువంటి సమయంలో దయ చూపించక పోతే, ఇక దయ ఎప్పుడు చూపిస్తాము?" అన్నారు మహమ్మద్.

విషయం అతడికి అర్థమైంది. ఇద్దరూ సాలెగూడును కొంచెం కూడా పాడు చెయ్యకుండా, ఆ గూటి క్రిందికి వెళ్ళి దాక్కున్నారు. సైనికులు అక్కడికి చేరుకొని, వాళ్ళ కోసం అటూ ఇటూ వెతికారు. గొయ్యిలో చూశారు. చెక్కు చెదరకుండా ఉన్న సాలెగూటిని చూసి "వాళ్ళే గనక ఈ గొయ్యిలో దాక్కుని ఉంటే సాలెగూడు చెదిరిపోయి ఉండేది. కాబట్టి వాళ్ళిక్కడ లేరు" అని అనుకుని వెళ్ళిపోయారు. ❖

అనువాదం: డాక్టర్ వై.సరోజా నిర్మల

**(రామకృష్ణ సంఘం - హిందీ మాసపత్రిక 'వివేకజ్యోతి' నుండి)**

(...27వ పేజీ తరువాయి)

మంచితనం మీద, మన ప్రతిభ మీద, మన భావాల మీద మనకు విశ్వాసం ఉండాలి. అసూయాద్వేషాలు కలగడానికి కారణం ఇతరులతో పోల్చుకుంటూ, మనల్ని మనం తక్కువగా భావించుకుంటూ ఆత్మన్యూనతకు గురికావడమే!

జీవితంలో మనం అనుకున్నట్లు ఇతరులు చేయకపోయినా, ఇతరులు చెప్పినవి మనకు నచ్చకపోయినా అభిప్రాయభేదాలు, అపార్థాలు, కోపతాపాలు తలెత్తుతాయి. ఇలా ప్రతి చిన్న విషయాన్నీ మనస్సులో పెట్టుకొని మథనపడినా, ప్రతిదాన్నీ భూతద్దంలో చూసి ఆవేశపడినా మనం ఎవరితోనూ కలసిమెలసి ఉండలేము. అందుకే *"If you leave petty things as petty, your life will be pretty. Instead, if you see petty things as pretty, then your life will become petty* - ప్రాధాన్యం లేని విషయాలను పట్టించుకోకుండా ఉంటే జీవితం ఆనందమయం. అలా కాకుండా ప్రతి చిన్న విషయాన్నీ పెద్దదిగా ఊహించుకొని బాధపడితే జీవితం దుఃఖమయం అవుతుంది' అన్న సత్యాన్ని గ్రహించాలి.

అలాగే, ఇతరుల లోటుపాట్లను లెక్కించడంలో సమయాన్ని వెచ్చించకుండా ముందు మనలోని లోపాలను తెలుసుకోవాలి. అందుకు 'నా తప్పులను సరిదిద్దుకోవడానికే సమయం సరిపోవడం లేదు. ఇక ఇతరుల తప్పులను వెతకడానికి సమయమెక్కడిది?' అన్న కబీర్‌దాస్ వచనాలను గుర్తుతెచ్చుకోవాలి.

ఇతరుల గురించిన చెడు అభిప్రాయాలను మనస్సులో పెట్టుకోకుండా ఉండడం, ప్రాధాన్యం లేని విషయాలను తలచుకొని మథనపడకుండా ఉండడం, మనలోని లోపాలను సరిదిద్దుకోవడానికి ప్రయత్నించడం - ఇవి మన జీవితంలో ఏ కొంచమైనా ఆచరించగలిగితే అసూయాద్వేషాలకు, పగలూప్రతీకారాలకు లోనుకాకుండా అందరితోనూ కలసిమెలసి ఉండగలుగుతాం. ప్రశాంతంగా జీవించగలుగుతాం. ❖

**మానవుడు తన మనస్సును దిగజార్చుకున్న తరువాతే ఇతరుల దోషాలను ఎన్నుతాడు. పరులు మనల్ని విమర్శించినంత మాత్రాన మనకేమి నష్టం? విమర్శించేవాడే బాధపడతాడు.**



## వార్తావాహిని





# సహయోజన సదస్సు

హైదరాబాదు రామకృష్ణ మఠం అనుబంధ సంస్థ 'వివేకానంద ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ హ్యూమన్ ఎక్సలెన్స్' హైదరాబాద్ మేనేజ్‌మెంట్ అసోసియేషన్, కంపెనీ సెక్రటరీస్ ఆఫ్ ఇండియా, కాస్ట్ అకౌంట్స్ ఆఫ్ ఇండియా, ఉస్మానియా యూనివర్సిటీ సంస్థల సహకారంతో 2014 అక్టోబర్ 28న 'వ్యాపార అనుబంధ సంస్థల సామాజిక బాధ్యత' అనే అంశంపై సదస్సును నిర్వహించింది.

ఈ సదస్సుకు గవర్నర్ శ్రీ ఇ.ఎస్.ఎల్. నరసింహన్ ముఖ్యఅతిథిగా విచ్చేశారు. స్థానిక రామకృష్ణ మఠాధ్యక్షులు స్వామి జ్ఞానదానందజీ; వివేకానంద ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ హ్యూమన్ ఎక్సలెన్స్ సంచాలకులు స్వామి బోధమయానందజీ; శాంతా బయోటెక్ సంస్థ సి.ఎమ్.డి డాక్టర్ కె.ఐ.వరప్రసాద్ రెడ్డి; పెన్నార్ ఇండస్ట్రీస్ చైర్మన్ శ్రీ నృపేంద్రరావు ప్రసంగించారు. ఈ సదస్సులో 600 మంది వ్యాపారవేత్తలు, విద్యావేత్తలు, సమాజ సేవకులు పాల్గొన్నారు. ❖ నివేదిక : డి.ఎన్. సంజీవ

## భక్తులకు మంత్రదీక్ష

కడప రామకృష్ణ మిషన్‌లో, రామకృష్ణ సంఘ ధర్మకర్త, పాలకవర్గ సభ్యులు మరియు చెన్నై, శ్రీరామకృష్ణ మఠాధ్యక్షులు శ్రీమత్ స్వామి గౌతమానందజీ మహరాజ్, 2015 జనవరి 6,7 తేదీలలో భక్తులకు మంత్రదీక్ష ప్రసాదించెదరు.

పూర్తి వివరాలకు సంప్రతించండి : కార్యదర్శి, రామకృష్ణ మిషన్, పుట్లంపల్లి, కడప -516 002. ఫోన్: 08562 - 200120

## గ్రంథ స్వీకారం



### శ్రీ సీతారామాంజనేయ సంవాదము

(తాత్పర్య విశేషార్థ వ్యాఖ్యాన సహితము)

సంకలనం : శ్రీచంద్రగిరి యస్. సుబ్రమణ్యం
వెల: రూ. 350/-, పుటలు : 564
ప్రతులకు: బ్రహ్మస్ఫూర్తిని ప్రచురణలు 21/303, మురుగేశం కాంపౌండ్, ఎస్.ఎఫ్.ఎస్.వీధి, కడప-516 001



చతుర్వేదాంతర్గత

### ఉపనిషత్ ఉద్యానవనము

తాత్పర్య-వ్యాఖ్యానములు:శ్రీ వై.హెచ్. రామకృష్ణ
వెల: రూ.500/-, పుటలు: 638
ప్రతులకు: శ్రీమతి యేలేశ్వరపు కనకదుర్గ, ఇంటి నెం.2/8, శివాలయం వీధి, కూచిపూడి, కృష్ణాజిల్లా - 521 136
ఫోన్: 08671-251164, 92479 25278

### మహాభారతము

ప్రశ్నోత్తరమాలిక

సంకలనం: డా॥ నందూరు గోవిందరావు
వెల: రూ.125/-, పుటలు : 278
ప్రతులకు: డా॥ నందూరు గోవిందరావు, ఇంటి నెం.1-9-1113/31, విద్యానగర్ హైదరాబాదు - 500 044
ఫోన్: 040-27610835, 98498 01490



### ఆత్మసంవాదాలు

రచన: శ్రీ దోనెపూడి వెంకయ్య
వెల: రూ.75/-, పుటలు : 151
ప్రతులకు: రమణ భక్త మండలి ట్రస్టు, రెండవ అంతస్తు, ఫ్లాట్ నెం.377, ఎఫ్ బ్లాక్, 12వ క్రాస్, 16వ మెయిన్, సహకార నగర్, బెంగుళూరు-560 092
ఫోన్: 90353 15104



Printed and published by Swami Jnanadananda owned by Ramakrishna Math Trust and printed at Kala Jyothi Process, 1-1-60/5, RTC Cross Roads, Musheerabad, Hyderabad - 500 020 and published at Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029. Editor: Swami Parijneyananda






**23వ వార్షిక భక్త సమ్మేళనం, కదిరి, (అనంతపురం జిల్లా) తేదీలు: 2015 జనవరి 16,17,18**

**సమ్మేళన ప్రాంగణం : జిల్లాపరిషత్ బాలికల ఉన్నత పాఠశాల, కదిరి**

అనంతపురం జిల్లాలోని శ్రీరామకృష్ణ సేవాసమితుల ఆధ్వర్యంలో కదిరిలో **2015 జనవరి 16,17,18** తేదీల్లో జరగబోయే 23వ వార్షిక భక్త సమ్మేళనానికి సాదరంగా ఆహ్వానిస్తున్నాం.

- ఈ భక్త సమ్మేళనంలో పాల్గొనే భక్తులు, వ్యక్తిగతంగా కానీ, సమితి ద్వారా కానీ **రూ.200/-** ప్రతినిధి రుసుము చెల్లించవలెను. ఈ రుసుమును **31-12-2014** తేదీ లోగా **శ్రీరామకృష్ణ సేవాసమితి, కదిరి** పేరున ఎమ్.ఓ/డి.డి.ల ద్వారా క్రింద సూచించిన చిరునామాకు పంపవలెను. గడువు తేదీ 31-12-2014 తర్వాత నమోదు చేసుకొనే భక్తులు ప్రతినిధి రుసుము రూ.300/- చెల్లించాలి.
- ప్రతినిధులకు భోజన, వసతి సౌకర్యాలు 2015 జనవరి 16వ తేదీ శుక్రవారం ఉదయం నుండి జనవరి 18వ తేదీ ఆదివారం సాయంత్రం వరకు ఏర్పాటు చేయబడును.
- ప్రతినిధులకు సాధారణ వసతి సౌకర్యములు మాత్రమే ఏర్పాటు చేయబడును. ప్రత్యేక సదుపాయాలు కావాల్సినవారు హోటల్ నందు గదులు స్వయముగా రిజర్వు చేసుకొనగలరు.
- ఈ బృహత్ కార్యక్రమానికి సుమారు రూ.20 లక్షలు వ్యయం అవుతుందని అంచనా. ఈ కార్యక్రమం విజయవంతం కావడానికి భక్తులు, శ్రేయోభిలాషులు, అభిమానులు యావన్మందీ పాల్గొని ధన, వస్తురూపేణ తమవంతు సహాయ సహకారములు అందించి భగవాన్ శ్రీరామకృష్ణుల కృపకు పాత్రులు కాగలరు.
- ఈ భక్తసమ్మేళనం సందర్భంగా ఒక స్మారక సంచికను విడుదల చేయనున్నాము. ఆ సంచికలో ప్రకటనలు ఇచ్చి ప్రోత్సహించాల్సిందిగా కోరుచున్నాము. ప్రకటన వివరాలతో కూడిన సి.డి.ని శ్రీ జె.ఆదినారాయణ, శ్రీరామకృష్ణ సేవాసమితి, రామకృష్ణ మందిరం రోడ్డు, కదిరి - 515 591 (సెల్:9441034597) అనే చిరునామాకు పంపగలరు.

**ప్రకటనల ట్యారిఫ్ వివరాలు :**

| | పూర్తి పేజీ | అర పేజీ | పావు పేజీ |
|---|---|---|---|
| కలర్ | 5,000 | 2,500 | 1,500 |
| బ్లాక్ & వైట్ | 3,000 | 1,500 | 800 |
| 2,3 కవరుపేజీలు | 15,000 | - | - |
| 4వ కవరు పేజీ | 20,000 | - | - |

- పై కార్యక్రమాలకు విరాళములు, ప్రతినిధి రుసుములు, ప్రకటనల రుసుములను మనియార్డర్/ డి.డి.ల ద్వారా **జె. గంగాధర్, నిర్వాహక కార్యదర్శి, శ్రీరామకృష్ణ సేవాసమితి, రాజేంద్రప్రసాద్ వీధి, కదిరి-515 591** అనే చిరునామాకు పంపవలెను. **చెక్కులు స్వీకరించబడవు.**
- విరాళాలను ఆన్‌లైన్ ద్వారా కూడా పంపవచ్చు. వివరాలు: **శ్రీరామకృష్ణ సేవాసమితి, కదిరి, అకౌంట్ నెం. 32312200001840, సిండికేట్ బ్యాంక్, కదిరి (IFSC-SYNB0003231).**

మీ అమూల్య సహాయ, సహకారములతో ఈ మహత్తర కార్యక్రమమును విజయవంతం చేయ ప్రార్థన.

**పూర్తి వివరాలకు:**

**శ్రీరామకృష్ణ సేవా సమితి, కదిరి**

ఆర్. చంద్రశేఖర్ గుప్త (అధ్యక్షులు) - **9966680680**
ఎమ్.వి. సుబ్బారావు (నిర్వాహక అధ్యక్షులు) - **9052027716**
జె. గంగాధర్ (నిర్వాహక కార్యదర్శి) - **9440693309**